# జీవితములు

| | | ప్రతి 1-కి |
|---|---|---|
| శ్రీ లాలాజపతిరాయిజీవితము | ... | |
| శ్రీ గోపాలకృష్ణగోఖ్లేజీవితము | ... | 0 |
| శ్రీ మహాదేవగోవిందరానడేజీవితము | ... | 0 |
| శివాజీచరిత్ర, ప్రతిమతో | ... | 1 |
| గౌరాంగస్వామిచైతన్యజీవితము | ... | 0 |
| శ్రీ శంకరాచార్యచరిత్ర, ప్రతిమతో | ... | 0 |
| దాదాభాయినౌరోజీచరిత్ర ,, | ... | 0 |
| శ్రీ కరంచంద్ గాంధిజీవితము, ప్రతిమతో | ... | 0 |
| నెపోలియన్ చక్రవర్తిచరిత్రము ,, | ... | 0 |
| నెపోలియన్ బోనపార్టి జీవితచారిత్రము, రెండవభాగము | ... | 1 |
| గాంధిమహాత్మునిచరిత్ర, ఉపన్యాసములు | ... | 1 |
| శ్రీ మొడుంబ నరసింహాచార్యస్వామి జీవితము | ... | 0 |
| సోదరినివేదితజీవితము, ప్రతిమతో | ... | 0 |
| శ్రీ గైక్వారుగారిజీవితము ,, | ... | 0 |
| వివేకానందస్వామిజీవితము ,, | ... | 0 |
| లార్డ్ క్లైవుజీవితము ,, | ... | 0 |
| స్వామిరామతీర్థజీవితము | ... | 0 |
| శ్రీ రామానుజాచార్యచరిత్ర | ... | 0 |
| శ్రీ వేమనయోగిజీవితము ,, | ... | 0 |
| ఆనిబిసెంటుచరిత్ర, ప్రతిమతో | ... | 0 |
| శ్రీ తుకారామస్వామిచరిత్రము | ... | 0 |
| శ్రీ సమర్థరామదాసస్వామిచరిత్రము | ... | 0 |
| శా... చరిత్ర | ... | 0 |
| ...తము | ... | 0 |
| ...వితము | ... | 0 |
| | ... | |
| ...జీవితము | ... | |

శ్రీరస్తు

# ప్రేమాగ్రణి

రచయిత;

ఉపేంద్రము శంకరనారాయణరాజు, బి. ఎ., బి. టి.



చెన్నపురి:

వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్ వారిచే

ప్రకటితము.

 [Price. Rs 1—8—0.

# అర్పణము

సీ. ఏపురాణపురుషు హృదయస్థలం బది
సరసిజావాసకు సదన మయ్యె?
ఏభక్తబాంధవు నాభీసరోజంబు
వాణీమనోహరు వాస మయ్యె?
ఏదేవదేవుని సాదరోదర మెన్న
నిఖిలలోకములకు నిలయ మయ్యె?
ఏదయాసాగరు పాదారవిందముల్
భక్తకోటికి మోక్ష పదము లయ్యె?
తే.గీ. ఏవిభునిదివ్యనామంబు లెల్లవారి
కఘునిబర్హణమంత్రవ ర్ణంబు లయ్యె?
అట్టి జగదేకవల్లభు నంఘ్రులకు స
మర్పణ మొనర్తు నీపొత్త మధికభక్తి.

# విజ్ఞప్తి

భాషాభిమానులగు పాఠకమహాశయులారా!

రసాత్మకంబులును, నీతిప్రదాయకంబులును, మనోరంజకంబులును, భాషావైదుష్యమును గలుగఁజేయునవియు నగు నవలలయందు నాకు బాల్యంబునుండియు నభిలాష మిక్కుటముగనుండెడిది. క్రమక్రమమున నయ్యది యభివృద్ధియై నన్నును నా యోపినంతవఱకును నవలారచనమునకుఁ బురికొల్పెను. నామనోభావములను వ్యక్తీకరించుటకుఁ దగినయుత్సాహము వొడమెను. అయినను మొదట నాలో నాకె కొంతజంకు గలిగెను. కాని "ఆరంభరహితుఁబొందునె యారయ సంపదలు, హీనుఁడయ్యును సుజనుం డారంభశీలుఁడై యకృతారంభుల నోర్చు నెంతవారలనైనన్" అను నార్యోక్తి ననుసరించి, ధైర్యం బవలంబించి యీనవలారచనమునకుఁ గడింగితి.

నేను గళాశాలయందుఁ జదువు నప్పుడాంగ్లమునం దుపవాచకముగ నుండిన 'భీమసింగ'ను నాంగ్లనవల కిది యనువాదము. కేవల మందలికథ నాధారముగఁ గొని మదీయకల్పనలతోడను, వర్ణనలతోడను నచ్చటచ్చట నుచితంబులగు కథావిషయకమగు మార్పులతోడను నిద్దాని రచించి కథానాయిక పేర 'ప్రేమాగ్రణి' యనునామం బిడితిని. కవులు, పండితులు, భాషాభిమానులు, నాయీపాత్రంబును సాంతంబుగఁ జదివి గుణంబులఁ గొని, లోపంబు లున్న సాదరంబునఁ జక్కఁదిద్ది,

నేనే యుభాషాయోషాసేవార్చనంబులకు దోహదం బొసంగు దుఱు గాక! యని ప్రార్థించువాఁడ.

నాపై నాదరభావమున శ్రమయనక నాయీపొత్తమును సక్రమముగ బరిశోధించి నాకెంతయు సాయమొనర్చిన బ్రహ్మశ్రీ, విద్వాన్ బాలకవిసింహ అష్టావధాని, సోంపల్లె కృష్ణమూర్తిగారికిని, ఈనవలను సాంతముగఁ బరిశీలించి తమ యమూల్యాభిప్రాయముల నొసంగిన శ్రీయుతులు, గౌరవర్ఝుల రామకృష్ణసీతారామ సోదరకవులకును, శ్రీ. డి. వి. కృష్ణమూర్తి గారికిని నామనఃపూర్వకవందనముల నర్పించుచున్నాను.

నే నీనవలను 1933 వ సంవత్సరముననే పూర్తిగా రచించియు ధనాభావంబుచేతను, దగినసహాయము లభింపమిచేతను నింతదనుకను బ్రచురింపలేకుంటిని. ఇపుడు శ్రీవావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్సువారు సాదరంబున నాయీనవలను ముద్రించి ప్రచురించినందులకు నాకృతజ్ఞతాభివందనములు. మఱియు నన్నీయుద్యమమునకుఁ బురికొల్పిన శ్రీ జి. నారాయణశర్మ (సైదాపేట టీచర్సు కాలేజి హైస్కూలు తెలుగుపండితులు) గారికి తదితరమిత్రమండలి కెల్లను గృతజ్ఞుఁడ.

ఇట్లు,

బుధజనవిధేయుఁడు,

ఉపేంద్రము శంకరనారాయణరాజు.

మదనపల్లె.
1-12-50

# విషయసూచిక

శ్రీరస్తు

# పండితాభిప్రాయములు

క. శ్రీయుతుఁడౌ శంకరనా
రాయణరాజా! త్వదీయ-గ్రంథము గంటిన్
బాయక సాకల్యముగా
నాయది నవరించితిన్ గుణాగుణచర్చన్.

చ. ప్రథమ కృతంబు మీవగుటఁ-బ్రాప్తిలె భేదము లచ్చటచ్చటన్
బుధులవి లెక్కగాఁగొనఁగఁ - బోరు, క్రమక్రమరీతిఁ గల్పనా
విధ మది సొంపునింపుఁ బ్రభవింపఁగఁజేయునుగాత! భారతీ
ప్రథితకృపావలోకనము - భవ్యముగాఁ బ్రసరించి మీయెడన్.

మ తవ "ప్రేమాగ్రణి" నామపుస్తకము వి-ద్యావంతు లెల్లన్ మనం
బచురం గాంచి నుతింత్రుగాత! మఱియు - య్యాంగ్లానువాదంబు ను
త్తమమంచాంగ్లవిదుల్ వచించి లనమ - ద్యత్కీర్తి సాధింత్రుగా
త! మహిన్ శాశ్వతమైన పేరుగనుతన్ - ధర్మానుసారంబుగన్.

తే. వచనరచన మృదూక్తుల-వఱలుచుండె
శైలి ధారాళమై మధు - సరణి గనియెఁ
గనుక విద్యార్థులకుఁ బాఠ్య - మనఁగఁదగిన
నవల "ప్రేమాగ్రణి" యె యంచు - నలువు నొడె.

తే. నవల లెన్నియొ రచియించి - నవ్యపథము
ననుసరించితి వని నియ - మాదులెల్లఁ
బెద్దలకు నొప్పఁజెప్పెడి విద్దెకాండ్రు
మంచివిషయము గనుటకు మార్గ మిదియె.

ఇట్లు,

కొక్కంటి, కదిరి తాలూకా
అనంతపురము జిల్లా.

విద్వాన్ బాలకవిసింహ అష్టావధాని
(వేద) సోంపల్లె కృష్ణమూర్తి.

మహాశయా! ఆశీర్వాదములు.

మ. పరమానందముఁ జెందినారము కవిత్వప్రౌఢిమం గాంచి, శం
కర నారాయణరాజ! వర్ణనలకా? కాణాచి, శృంగార వీ
ర రసంబుల్ నివసింప తావు; మధుధారాస్యంది; ప్రేమాగ్రణిం
ద్వరగాఁ బండితహస్తపద్మముల నిల్వంజూడుమా! మిత్రమా!

చ. సరసుఁడు కృష్ణమూర్తి యొకసారి పఠింపఁగ విన్నవాఁడఁ ద్వ
ద్విరచిత గద్యకావ్యమును; ప్రేమరసాస్పదమై; విచిత్రవా
గ్స్ఫురితమునై, సహృజ్జనుల కర్ణరసాయనమై, వియన్నదీ
స్ఫురదరవిందమాధురికిఁ జొక్కిన తేఁటులపాటసాటి యౌ.

చ. కవులగువారలెల్లమును కావ్యములన్ రచియించి; ధారుణీ
ధవులసభాస్థలంబుల నితాంతయశంబు గడించుచుండిరీ
నవయుగమందుఁ గన్పడెడు నాటకము ల్మఱిఖండకావ్యముల్
నవలలు వానిలోనఁ దమనవ్యకృతీంద్రము వన్నెఁ గాంచుతన్.

ఇట్లు

కవిసార్వభౌమ: కావ్యవిశారద; సాహిత్యరత్నాకర;
విద్యావిభూషణ; ఆంధ్రవాఙ్మయమహోదధి; ఆశుకవిచక్రవర్తి;
అభినవబాణకవి; శతావధాని, బిరుదాంకితులు

(*Sd*) గౌరవఝ్ఝుల రామకృష్ణసీతారామ సోదరకవులు.

గజ్జెకొండ (కర్నూలు) జిల్లా.

VIDWAN D. V. KRISHNAMURTHY. M. A. Lecturer in Telugu. Madanapalle College.

Superintendent of Vernacular Studies. Madanapalle.

I have gone through the novel "Premagrani" of Mr. Upendram Sankaranarayanaraju of Thamballapalle. The story is interesting; the style is good. The author deserves encouragement.

(*Sd*) D. V. KRISHNAMURTHY.

31-7-1937.

శ్రీరస్తు

# ప్రేమాగ్రణి

## మొదటి ప్రకరణము



### సమావేశము

శా. శ్రీకళ్యాణుఁడు నిర్వికారుఁడు కృపా
సింధుండు కృష్ణుండు లో
కైకారాధ్యుఁడు భక్తవత్సలుఁడు దీ
వ్యత్కీర్తిలీలాకరుం
డాకంజాతభవేశ్వరాది వినుతం
డాద్యుండు వైకుంఠుఁ డా
శ్రీకాంతాపతి పాదపంకజములన్
సేవింతు నశ్రాంతమున్.

అప్పుడప్పుడే తెలతెలవాఱఁజొచ్చెను. ఆదిశలను నిరాటంకముగఁ బ్రపంచమంతయుఁ దట్టముగ నలముకొనియుండిన తిమిరము తిరోహితము గాఁజొచ్చెను. లోకబాంధవునిరాక నెఱింగించుచున్నవో యనఁ గుక్కుటారావంబు లన్నిదిశల వ్యాపించెను. చల్లనిమందమారుతము వీవఁదొడంగెను. దినకాంత తనప్రియుండగు హరిరాక కలరి, తనమృదుమధురకంఠంబునఁ గర్ణపర్వంబుగ మనోహరగీతంబులఁ బాడుచుఁ బ్రాణకాంతునకు స్వాగతం బొసంగఁబోవుచున్నదో యన, శుకపికశారికాది శకుంతసంతానంబులు

సుస్వరంబుల మనోహరగానంబులు సల్పుచు, నాహారాన్వేషణంబునకై కులాయంబుల వీడి వినువీథి బారులుదీరి పోవుచుండెను. ప్రకృతియంతయుం మనోహరంబై, సృష్టిసౌందర్యవిభవాతిశయంబుల వేనోళ్లఁ జాటుచుండెను. అట్టిసమయమునఁ బద్మినీకాంతనోముల ఫలంబో, మూఁడుమూర్తులసారంపు ముద్దయో యనునట్లు సూర్యుం డుదయాద్రి నధిరోహించెను. కమలాప్తుని కరస్పర్శంబునం జేసి యదివఱకు దీనభావంబున ముకుళత్వం బొందియుండిన కమలంబులు వికసించి నేత్రపర్వం బొనర్చెను. అప్పద్మమరందంబులం గ్రోలి మత్తిల్లి మొత్తంబులై భృంగరాజంబులు ఝుమ్మనినాదంబు లొనర్చుచుండెను. అప్పటి యాబాలార్కబింబము ప్రాగ్దిశాకాంతవిశాలఫాలంబున జగన్మోహనంబుగ నిడిన సిందూరతిలకంబో యన నొప్పారుచుండెను. అప్పుడప్పుడే భూసురులు నిర్మలనదీతోయంబులఁ దోయంబులాడి త్రిమూర్తిస్వరూపకుండును సర్వసాక్షియుఁ బవిత్రుండును బ్రత్యక్షదైవంబునగు సహస్రకిరణున కర్ఘ్యంబు లిడుచుండిరి.

అట్టి మనోహరప్రాతఃకాలసమయంబున నుదయపురరాజగృహాంగణమున మంగళతూర్యనాదములు శ్రవణపర్వంబుగ వినవచ్చుచుండెను. నాఁటి దినము జరుగఁబోవు "అహేరియా" యుత్సవమునకు నాహ్వానింపఁబడిన రసపుత్రవీరు లందఱు నుచితరీతుల నలంకృతులై నానావిధాయుధపాణులై, యనుచరవర్గసమేతులై వచ్చి యారాజగృహమున కెదురుగఁ దమకై యుచిత రీతుల శృంగారింపఁబడిన యొకవిశాలసౌధంబునందుఁగలపీఠములపై నుపవిష్టులై యుండిరి. నాఁటిదినము రాజులును సర్వజనులును నేకరీతిగ నాదరింపఁబడుచుండిరి. రసపుత్రవంశాబ్ధిసోముండును, రాజనీతినిపుణుండును, నసమానగుణబలధైర్యసాహసుండును నేలికయునగు రాణారాజసింహుని యాగమనంబున కెదురుచూచుచు రాజపుత్రు లందఱు సంతోషితస్వాంతులై గుంపులుగూడి సంభాషించుచుండిరి.

పవిత్రరసపుత్రకులోత్పన్నులును ప్రభుభక్తిపరాయణులును 'సక్త్వాట్' ప్రభువులునునైన మోహనగంగాసింగులు 'బెడ్లా,' 'బిజోల్,' నగరాధీశులతో వినోదముగ సంభాషించుచుండిరి. ఒకవంకఁ బలువురు రాజపుత్రు లొకటిగఁగూడి తా మిదివఱకొనర్చిన యుద్ధములంగూర్చియుఁ దమపూర్వుల బలపరాక్రమాదులం గూర్చియు ముచ్చటించుకొనుచుండిరి. మఱియొకయెడఁ గొందఱు రాజపుత్రులు నాఁటి వేఁటకుఁ గావలసిన యాయుధసంపత్తి నాయత్తపఱచుకొనుచుండిరి.

ఆప్రాంగణమున నొకయున్నతప్రదేశమున రెండు హంసతూలికా తల్పంబులం దిరువురు రాజపుత్రవీరు లాసీనులై యుండిరి. వారిముఖ కాంతులంబట్టియు, వేషభాషలంబట్టియుఁ జూడ వారు గొప్పవీరులని తోఁచక మానదు. వారిలోఁ బ్రథమునకు దాదా పిరువదివత్సరము లుండవచ్చును. కాని యాతనిదేహపటిమ యొక్కింతయేనిఁ దగ్గియుండలేదు. రెండవవీరుండు మధ్యవయస్కుండు. ఆఱడుగుల పొడగరి. ఎత్తైన భుజయుగమును, విశాల వక్షంబును, కరికరంబులంబోలు నిడుద కరంబులును, విశాలఫాలంబును, గంభీర దృష్టులును, నల్లనివంకర మీసంబులును జూచువారల కాతని బలశౌర్య గాంభీర్యంబులఁ జాటుచుండెను. ఈతని బలశౌర్యంబుల కెంతయు మెచ్చి రాజసింహుఁ డీతని నెక్కుడుగ గౌరవించి యాదరించుచుండెను. ఈతఁ డెల్లప్పు డప్రమత్తుఁడై రాజభక్తితత్పరుఁడై దేశసేవాధురంధరుఁడై విదేశీయు లగు మహమ్మదీయులు తమదేశముపై దాడివెడలకుండు నట్లారావళీ పర్వత పంక్తులందుండు 'కుంభాల్మరు' కనుమను రాజు నాజ్ఞమేరకుఁ గాపాడుచుం డెను. అరసపుత్రవీరు లీక్రిందివిధమున మాటాడఁజొచ్చిరి.

ప్రథముఁడు:——గోపీనాథఠాకూరా! మన మిదివఱకు జేసికి సహాయులమై యనేకసంగ్రామంబుల ముష్కరులగు తురుష్కుల నోడించి పాఱఁదోలితిమి. ఇప్పుడు క్రూరుండును గఠినుండును, మీఁదుమిక్కిలి హింసామత

ద్వేషియగు నౌరంగజేబు మనల జయింప సమకట్టియున్నాఁడట. రాజపుత్రులందఱు దమజీవితముల కాసపడక బలపరాక్రమంబులఁ జూపవలసిన కాలము సమీపముననే యున్నది. రాజపుత్రులందఱప్రమత్తులై యుండ వలయును.

ఠాకూరు:—ఖైర్ సరారు ప్రభూ! రాజపుత్రులందఱీవిషయమున సంసిద్ధులై యున్నారు. వారు దమజీవంబులఁ దృణంబులుగ నెంచి పోరు సల్ప నున్నారు. రాణాయును యావచ్ఛక్తి నుపయోగించి వైరినిఁ గెల్వ నున్నాఁడు.

ఖైర్ సరారు:— ఠాకర్! సర్వము రాజపుత్రుల బలస్థైర్యశౌర్యంబుల మీఁద నాధారపడియున్నది.

ఠాకూరు:—నిశ్చయము.

ఖైర్ సరారు:—నేఁటివేఁటయందు సంపూర్ణవిజయము చేకూరినఁ, గడసరిగ మనను సంపూర్ణవిజయము లభించునని రాజపుత్రుల దృఢవిశ్వాసము.

ఠాకూరు:—నేఁటి వేఁటయందుఁ బాల్గొనుటకు రాజపుత్రు లుత్సాహపడుచు నున్నారు.

అని వారిరువు రిట్లు సంభాషించుచుండ రాణాద్వితీయపుత్రుండగు భీమసిం గొకయున్నతాశ్వం బధిరోహించి మెల్లన వారియొద్దకు వచ్చి నిలిచెను. భీమసిం గిరువదేండ్లయీడువాఁడు. రమారమి యాఱడుగుల పొడగు. విశాలఫాలమును నరవిందంబులం గేరునేత్రయుగ్మమును, దిగ్దంతికరంబులఁ బోలు కరంబులును, బీనవక్షంబును, జక్కని నాసికయును నిరంతరమందహాస సుందరవదనారవిందంబును నాతఁడు సర్వాంగసుందరుఁడని చాటుచుండెను. అదిగాక సర్వసద్గుణంబుల కాటపట్టయినవాఁడు. అతని రూపగుణ యౌవనాదులం గాంచి యతనిఁ బ్రేమింపని వారుండరు. వేఁటకుఁబోవఁదగిన యుడుపుల నాతఁడు ధరించియుండెను. ఆతఁడు గుఱ్ఱపుస్వారియందును, విలువిద్య యం

ము, కత్తి చెయిజేసెలు బల్లెము మొదలగు నాయుధోపయోగము లందును, గుస్తీపట్టుట పరుగిడుట దుముకుట మొదలుగాఁగల శరీరవ్యాయామ సంబంధములగు నాటలయందును, దనతోడి రాజపుత్రులందఱికంటెను మిగుల నేర్పరియై యుండెను. కేవలము పైఁజెప్పినవియే గాక, విద్య, చిత్రలేఖనము మొదలగు వానినిసైతము చక్కఁగ నేర్చియుండెను. రాజకుమారుఁ డెఱుంగవలసిన రాజనీతివిషయంబుల నెల్లఁ దెలిసికొనియుండెను.

భీమసింగు రాఁగానే యా మువ్వురు రజపుత్రవీరు లాతని సగౌరవంబుగ నెదుర్కొని యుచితాసనము నాసీనుం గావించిరి. పిమ్మట వారు మువ్వు రీక్రింది విధమున మాటాడఁదొడఁగిరి.

ఖాసారు:—భీమసింగుకుమారా! నేఁడు నీవుకూడ వేఁటయందుఁ బాల్గొందువా?

భీమసింగు:——(చిఱునవ్వుతో) ఏల మీ రిట్లనుగుచున్నారు? నేను రాజపుత్రుఁడను గానా? నారక్తనాళములఁ బవిత్ర రాజపుత్రరుధిరము ప్రవహించుటలేదా? నేను చాలకాలమునుండి వేఁటయందుఁ బాల్గొని నా శక్తిసామర్థ్యములఁ జూపఁదలఁచి యుంటిని. కాని నే బాలుఁడనని, తండ్రిగారు నిరాకరించుచుండిరి. నేఁడు న న్నాయనయే వేఁటకు రమ్మని యాజ్ఞాపించిరి.

ఖాసారు:——కుమారా! నీ నుడువులు మాకెంతయుం బ్రమోదంబుఁ గూర్చుచున్నవి. కాని నీ వెయాయుధములను ధరింపక కేవల మొకబల్లెమును, జిన్నయీటెను మాత్రమే చేకొనియున్నాఁడవు. వీనితోడనే నీ వెట్లు వన్యమృగంబులఁ బరిమార్తువు?

భీమసింగు:——ఆర్యా! మీరు పొరపడితిరి. నేనీ రెంటిసాయమున నే వేఁటయందు గెల్పొందఁగలను. చాలకాలమునుండియుం నీచిన్నయీటెచే గుఱి

క్రియంటకు నేర్చికొంటిని. ఆఱువదియడుగుల దూరంబుననుండు
రమైన దీనిచేఁ గడుసులభంబున వేయఁగలను.

-కుమారా! నీనుడువు లాశ్చర్యమును బుట్టించుచున్నవి. నీవాక్య
త్యాసత్యములు నేఁ డెఱుంగుదుముకదా ?

వారిట్లు మాట్లాడుచుండ రాజనగరసింహద్వారమున భేరీపటహ
నాదములు వినవచ్చెను. రాజపుత్రులందఱా ప్రక్కఁ జూచుచు
బారులుదీర్చి ప్రభురాకకై వేచియుండిరి. ఇంతలో రాణా
డు యనేకరాజసమేతుఁడై యుచితరీతి నలంకృతుఁడై యొక్క
శ్వం బధిరోహించి మెల్లన నచ్చోటుఁ జేరెను. వాఁడు రాగనే
లందఱు "రాణారాజసింహునకు జే" యని యొక్కమాఱు ది
ధ్వనులిచ్చునట్లు జయజయ శబ్దములను జేసిరి. తర్వాత వీరపురుష
రాణాకు వందనంబు లాచరింపఁబడెను.

సింహుఁడు తనపూర్వులందఱికంటె నెక్కువ బలపరాక్రమ
పేరొందినవాఁడు. సమస్తరాజపుత్రు లాతని యాజ్ఞల శిరసా
వేర్చుచుండిరి. అతఁడు రాజైన కొంతకాలమునకు రాజపుత్ర
ప్ప కాటకము సంభవించెను. అప్పుడితఁ డనేకలక్షల రూప్యం
చి రాజసముద్రంబను కాసారం బొండు త్రవ్వించి, తన్మూలం
కఁ బంటలు పండింపంజేసి కాటకబాధ లేకుండఁజేసెను.

ంగు తనయన్నయగు జయసింగును శీఘ్రమునఁ గలసికొనెను.
లిరువు రొకరినొకరు ప్రేమమీఱఁ గౌఁగిలించుకొని కుశలప్రశ్న
. వారిరువురకు గుణభేదము లున్నను నొకరినొక రెక్కుడుగఁ
డిరి. జయసింగురాణాకు మిక్కిలి ప్రేమాస్పదురాలగు రంగదేవి

ఒక్కసమయమున నౌరంగజేబు తనపూర్వులవలె నొక్కరాజ
వాహమాడఁగోరి, రూపనగరము రాజుకుమార్తెయు, సర్వాంగ
నగురంగదేవిని బరిణయమాడఁగోరెను. కాని పవిత్ర రాజపుత్ర

కులోత్పన్నయగు రంగదేవి క్రూరమ్లేచ్ఛచక్రవర్తి కర్ధాంగి యగుట కిచ్చగించునా ? అప్పుడు రంగదేవి "ముష్కరుండగు తురుష్కచక్రవర్తిబారినుండి న న్నేరసపుత్రవీరుఁడు రక్షించునో యట్టి వీరాగ్రేసరున కర్ధాంగి నగుదు" నని సమస్తరాజలోకమునకును జాటించెను. అప్పుడు రాజసింహుఁడు రంగదేవినిఁ గొనిపోవుటకై వచ్చిన చక్రవర్తిసైన్యములఁ దనబాహుబలంబున జయించి యామెను రక్షించి సర్వసేనాసమక్షంబున నామెను బరిగ్రహించెను. అట్టి నారీశిరోరత్నమైన రంగదేవికిఁ గొమరుఁడైనను జయసిం గొకింత మందస్వభావుఁడుగ నుండెను. అతఁడు తనతమ్ముఁడగు భీమసింగునంతటిచురుకుదనము గలవాఁడుగాఁడు. అతఁ డొకింత స్థూలకాయుఁడైనను నంగసౌష్ఠవముంబట్టి చూడ సుందరాకారుండని చెప్పక తప్పదు. విలువిద్దయుఁ గత్తి ఈటె, మొదలగునాయుధోపయోగంబులఁ జాలినంతవఱకుఁ జక్కగ నెఱింగెను. గుఱ్ఱపుస్వారియం దద్వితీయుఁడని పేరొందెను. కాన విద్యయం దెక్కుడు పరిశ్రమ గావించి మురళీవీణాదులఁ జక్కగ వాయింప నేర్చెను. విశ్రాంతిసమయములం దెల్లప్పుడు మురళిఁ జేఁబూని సర్వజనమనోహ్లాదనంబుగ వాయించుచుండువాఁడు. అతఁడు తనసంగీతవిద్యాపాండిత్యంబునం జేసి సుందరసుందరీసందోహంబుల కెల్లఁ బ్రేమాస్పదుండయ్యెను.

ఆరాకొమరు లిరువురు నేఁ డుత్సాహపూరితులై వేఁటయందుఁ దమ శౌర్యసాహసాదులఁ జూప నువ్విళ్ళూరుచుండిరి. రాజసింహుఁడు సర్వరాజపుత్రపరివృతుఁడై మృగయావినోదార్థము బయలుదేరెను. రాజపుత్రు లుత్సాహంబునఁ దమధనుర్విద్యాకౌశలంబు మెఱయ దూరంబుననుండు వస్తుసమూహంబుల గుఱితప్పక వ్రేయుచుఁ దమకత్తుల నవలీలఁ ద్రిప్పుచు బల్లెంబులను క్రూరమృగంబులఁ బొడుచువడుపున నాడించుచు వేఁటతమకంబున వనంబున కరుగుచుండిరి.

ఆసమయమున నొకయున్నతరాజసౌధంబునఁ గొందఱు కన్యకామణులు గూడి పలువిధములగునాటల నాడుచుండిరి. అందొక్కకన్యకామణి

మాత్రము తదేకధ్యానయై యారాజపుత్రాశ్వికదళమునే కనుమఱు గగునంత
వఱకుఁ జూచుచుండెను. ఆమెవయసు పదునెన్మిదేఁడు లుండవచ్చును. బాల్య
మంతరించి యౌవనము చూపట్టుచుండెను. సువర్ణచ్ఛాయ నపహసించు మేని
కాంతియుఁ, గందర్పకోదండంబున నపహసించు కనుబొమలును, నాకర్ణాంతవిశాల
లోచనంబులును, దిలపుష్పంబునుంబోలు చక్కనినాసికయు, దొండపండు
వంటియధరంబును, ధావళ్యకాంతులీను పలువరుసయుం, మృణాళసదృశంబులగు
బాహువులును గల్గి సౌందర్యాతిశయంబులఁ జెన్నొందుచుండెను.

ఈమె భావూరుగోపీనాథునిపుత్రిక. ఈమెజనించిన కొద్దికాలమునకే
జనని దివంబు నలంకరించెను. తల్లియుఁ దండ్రియుఁ దానెయై పుత్రినే
పుత్రుఁడుగ నెంచి భావూ రామె నెక్కుడు ప్రేమంబునఁ బెంచెను.
ఆబాలకు విద్యాబుద్ధులుగఱప సర్వవిద్యాపారంగతుండగు నొక్కసన్యాసిని
నియమించెను. ఆమెయుఁ దండ్రియాజ్ఞ మేర కప్పగి వ్రాజకున కెల్లవేళలఁ బరి
చర్య సేయుచు, శ్రుతిస్మృతిపురాణేతిహాసంబులఁ జక్కఁగఁ బఠించెను. అంతియె
గాక భావూ రామెకు యోధుఁ డెఱుంగవలసినవిషయముల నెల్ల నేర్పెను.
విలువిద్దెయం దామె మిగుల నేర్పరి యయ్యెను. ఆమె కొన్నివేళలఁ బురుషో
చిత వస్త్రంబులు ధరించి తనతండ్రితోఁగూడ చిన్నచిన్నకదనరంగంబులకుఁ
బోవుచుండును. అట్టిసమయంబున నామెను జూచినవారెల్లరు నెవరో యొక
రాకొమారుఁడని తలంపకపోరు. ఆమె విద్యావతియు, సౌందర్యవతియు
నగుటయెగాక సకల సద్గుణంబులకెల్ల నాటపట్టయి సర్వజనప్రేమాదరంబు
లకుఁ బాత్రురాలై యుండెను. స్త్రీసహజంబులగు చక్కదనము, దయ-మృదు
త్వము-వినయము-ఓర్పు-దైవభక్తి మొదలగువానియందే కాక పురుషోచితంబు
లగు దేశభక్తి, రాజభక్తి, ధైర్యము, సాహసము, ఔదార్యము మొదలుగాఁగల
వానియందును నామె యందఱిచే స్తుతింపఁబడుచుండెను.

భీమసింగు తనతండ్రితో ముచ్చటించుటను నామె చూచెను. అది
వఱకే భీమసింగు రూపయౌవనాదులను బలధైర్యసాహసాదులను సద్గుణము
లను వినియుండెఁజిని. నేఁడాతనిఁ జూచినప్పటినుండియుం నామె మనంబున

నూతనభావనాపరంపర లుత్పన్నంబులయ్యెను. వారిమనోవృత్తులు చాలవఱకు నేకీభవించుటచే భీమసింగునం దామె కొకవిధమైన ప్రేమగౌరవాదులు జనించి యుండెను. ఇప్పు డవి మఱింత దృఢములయ్యెను. ఆమె యొకమృదు తల్పంబున నాసీనరై యేమియో యాలోచింపఁదొడఁగెను. ఆసమయమున నామె సకియ యొకతె యచ్చోటికివచ్చి యామెపార్శ్వంబున నాసీనయయ్యెను. ఆలోచనాసముద్రంబున మునింగిన యాకోమలాంగి, చెలి యాగమనంబు నంతగ గమనింపలేదు. తుద కాచెలి యిట్లనియె.

చెలి:— ప్రేమా! నేఁ డెందుల కిట్లాలోచించుచున్నావు? నేను వచ్చినంతనే నిండారుప్రేమంబున నీమృదుమధుర వాక్సుధాధారలఁ దనుపుచుందువే? ఇపు డేల మాటలాడవు?

ప్రేమాబాయి:— సఖీ! వింతకారణం బెద్దియును లేదు. సర్వభూతాంతర్గతుండగు నప్పరమేశ్వరుని సృష్టివైచిత్ర్యంబులఁ దిలకించి యాదేవదేవుని మదిం దలంచుచుంటిని.

చెలి:— అమ్మ! నీదైవభక్తి కడు ప్రశంసాపాత్రము.

ప్రేమ:— చెలీ! నీమెచ్చుకోలున కభివందనములు. నేఁడు నీవింత త్వరితంబుగ రాఁ గతం బెద్ది?

చెలి:— నేఁడు రాజుగారు సర్వరాజపుత్రపరివృతులై వనంబున కరిగి యున్నారుకదా?

ప్రేమ:— అవును. తర్వాత విషయము లెవ్వి?

చెలి:— రాజాంతఃపురకాంత లందఱొక్కయెడఁగూడి యిష్టకథావినోదంబులఁగాలంబు బుచ్చుచున్నారు. నిన్నక్కడకు శీఘ్రంబునఁ గొనిరమ్మని దేవేరు లాజ్ఞాపింప సత్వరంబున నేతెంచితిని. వెడలుదము రమ్ము.

ప్రేమ:— మంచిది.

(అని వారిరువు రాసౌధంబువెడలి యంతఃపురమార్గంబునఁ జనిరి.)

# రెండవ ప్రకరణము



## పంది వేట

భేరీపటహమృదంగశంఖాది తూర్యారావంబులు దశదిశలయందుఁ బ్రతిధ్వనులీన, నశ్వపదఖురఘట్టనంబునం జేసి భూపరాగంబు దిక్కులెల్ల నిండ మృగయావినోదపరిపూర్ణమనస్కులై యుత్సాహంబున జయజయ శబ్దంబులం జేయు నారాజపుత్రుల యాశ్వికదళము పురంబు వెడలి, పచ్చిక బయళ్లను, సుందరోద్యానంబులను నానావిధజలవిహంగ జలచర జలజాత సంయుతంబులై నిర్మలవారిపూరంబులై యొప్పు కాసారంబులను గడచి యొక్కఘోరకాంతారసమీపంబున నిడిసెను. ఆ దమ్యోపమానంబగు స్వచ్ఛజలపూరితంబైన సారసాకరంబొండుఁ బొడఁగని రాజపుత్రులందఱు చోటఁ ఘోటకంబులనుండి డిగి యాసరోవరజలంబులఁ గాలు సేతులు గడిగి గుఱ్ఱంబుల జలంబులఁ ద్రావించి మఱల నశ్వారోహణంబు గావించి కొంతదూర మరుగు నప్పటికిఁ గొందఱు జానపదులు, రాణా కెదురుగ వేఁగు దెంచి వినయవినమితో త్తమాంగులై కరంబులు మొగిడ్చి "మహాప్రభూ! మేము మీయాజ్ఞానువర్తు లమై యివ్వనంబెల్ల గ్రుమ్మరి యొకకొండచఱియయం దైదువరాహంబులం గాంచి యావృత్తాంతంబు దేవరవారి కెఱింగింప వేగంబున వచ్చితిమి. అయ్యది యిక్కడికి కొలఁదిదూరంబుననే యున్న" దని నుడువ వారిమాట లాలించి సం తసించి తగుబహుమతు లొసంగి వారు చూపుమార్గంబునం జనిచని యనుచర సమేతముగ రాణా యక్కొండచఱియం జేరెను.

అచ్చోటుఁ జేరఁగనే యారాజపుత్రులందఱు దమ ఱేనియాజ్ఞ మేరకు చఱియముందు నర్ధచంద్రాకారంబుగ నిలుచుండిరి. ఆప్రదేశమున కెదురుగ

రాణాయును, వతనిదక్షిణపార్శ్వంబున యువరాజును, శూలహస్తులై ధైర్య త్తతో నిలచియుండిరి. ఆచటియకుఁ బశ్చిమోత్తరభాగములందు సాయుధ హాస్తులై థాకూరుభీమసింహులు లుండిరి. వారుండుప్రదేశము కంటకలతాదులచేతను, గర్కశపాషాణంబులచేతను లోయలచేతను నిండియుండెను. తక్కిన వీరులంద ఱుచితస్థలంబుల ఖడ్గపాణులై నిలువఁబడియుండిరి.

అట్టితఱిని గొందఱు కిరాతులు పైశిఖరంబులనుండి గొప్పశిలల నా లోయలందుఁ ద్రోసిరి. మఱియు భేరీమృదంగాదినిస్వనంబులఁ గావించిరి. ఆశాలప్రేటులకును, వాద్యములధ్వనికిని సందుండు భూదారంబులెల్ల భయంపడి ఱాలిమీఁదఁగొట్టిన పెంకువలెఁ జెల్లాచెదరై భీకరంబుగ ఘూర్ణిల్లుచుఁ బరుగెత్తెను. అందొక్కవరాహంబు భీమసింగున్నదెసకుఁ బరుగెత్తెను. కాని మఱలఁ దటాలున వెనుదిరిగి థాకూరున్నదెసకుఁ బరుగిడ నారంభించెను. మొదట నవ్వరాహంబు తనదెసకు వచ్చుటంగాంచి భీమసిం గుత్సాహపూరితుండై బల్లెంబుఁ జేఁబూని దాని నొక్కప్రేటునం బరిమార్ప సంసిద్ధుఁడై యుండెనుగాని, యది తటాలున థాకూరున్నదిశకుఁ బరుగిడుటం జేసియతని యాశ ఫలింపదయ్యెను. ఆక్రోడంబు తనదిక్కునకుఁ బరుగిడుటం జూచి థాకూరు తనతురంగంబును బరుగెత్తించి దానిని సమీపింపఁగనే బల్లెంబున ప్రేసెను. ఆఘోరమృగం బాప్రేటును దైవయోగంబునఁ గొంచెములోఁ దప్పించుకొని యతిరయంబునం బాఱెను. అది భీమసింగు గాంచి తనయశ్వంబు నతిశీఘ్రంబునఁ బరుగెత్తించి యాభూదారమును వెన్నంటెను.

ఇంతలో థాకూరు శూలంబు కేలంగొని యాయడవిపందిని సమీపించి తనబలంబు కొలఁది శూలంబున ప్రేసెను. కాని యాబల్లెంబు వేగంబున వెడలి యాసూకరంబు ముందటంబడి భూమియందుఁ గ్రుచ్చికొనెను. అయ్యది నా ప్రేటు తప్పుటచే నతి త్వరితంబుగ వెనుదిరిగి తాను వచ్చిన మార్గంబునఁ బాఱఁజొచ్చెను. భీమసిం గది కని గుఱ్ఱంబును దఱిమి యావరాహంబును

వెన్నాడెను. ఇంతలో ఖానూరు తనయొద్ద బల్లెంబుదక్క నేయాయుధంబును లేమిం జేసి గుఱ్ఱంబుమీఁది దిగి నిదానంబుగ బల్లెంబు నూడదీయుచుండెను. ఇంతలో నాఘోణి యతిభీషణంబుగ ఘుర్ఘుర్లుచుఁ దటాలునఁ దిరిగి ఖానూరుండుమార్గంబునఁ బరుగిడ భీమసింగు ఖానూరును హెచ్చరించెను. కాని బల్లెంబు నూడదీయు వాఁడు నామాటల నాలకించలేదు. మృత్యుదేవతవలె నావరాహము భయంకరాకారంబున వానిని ద్రుంపఁబోవుచున్నను ఖానూరది కాంచలేదు. అప్పుడు భీమసింగతిరయంబున నిజవారువంబును బరుగెత్తించి, యాక్రోడంబును సమీపించి తనచిన్నయీటెచే గరంబునం గొని గుఱితప్పక బలంబు గొలఁది వ్రేసెను. అదియుం నతివేగంబున వెడలి యాసూకరకంఠంబునఁ గ్రుచ్చుకొనియెను. వ్రేటుపడఁగనే యాభూదారంబు గిఱ్ఱునఁ దిరిగి కట్టిగ నఱచుచు నేలంగూలెను. తత్క్షణమే భీమసింగు దానిని సమీపించి బల్లెంబునఁ బొడిచి పంచత్వంబునొందించెను. ఖానూ రావరాహోదావంబున కులికిపడి చూడ, నవ్వుచు భీమసింగిట్లనియె. "ఆర్యా! నేఁడు చూచితిరా? యీచిన్నయీటె ప్రభావము." ఆపలుకులకు ఖానూ రాశ్చర్యంబు నొంది భీమసింగును నెక్కుడుగ నభినుతించెను. భీమసింగాతనికి వినయపూర్వకముగ ధన్యవాదము లొసంగెను.

ఆ యాఖేటస్థలమునం దింకొకయెడ నొక్క పెద్దక్రోడంబు చెలరేఁగి భయంకరంబుగ ఘుర్ఘుర్లుచుఁ గొమ్మున భూమిం జిమ్ముచు రాజసింహునిఁ దున్న దెసకుఁ బరుగెత్తెను. రాజసింహజయసింహు లాయది తమదెసకుఁ గాలవశంబున జీవుండు మృత్యువున్నదెసకుఁ బోవుతెఱంగునఁ బరుగిడుటం గాంచి, హయంబులఁ ద్వరితంబుగఁ దఱిమి దానిని వెన్నాడిరి. ఆఘోణియుఁ జాల పఱకుఁ జిక్కక పాఱుచుండెను. వారిరువురును మఱింత యుత్సాహులై సైంధవంబుల నతిసత్వరంబుగఁ బోనిచ్చిరి. యువరాజు తండ్రి గుఱ్ఱంబు కంటెఁ దనహయంబును వేగంబుగఁ దఱిమి యాభీకరమృగంబును వెన్నా

డెను. అక్కిటియుఁ దనయపాయంబు నెఱింగి ధైర్యంబు చిక్కఁబట్టి, మిట్ట
పల్లంబులనక తొట్లముండ్లనక పారుచుఁ గాలువల నెగిరి దాఁటుచుఁ బొద
రిండ్ల దూఱుచుఁ బోవుచున్నను, విరోధి తన్ను వెన్నాడుటను జూచి యేమి
చేయుటకును దోఁపక తుదకు దూరంబున నొక్క కంటకలతావృతంబును సుల
భంబుగఁ జొర నశక్యంబును భయంకరవల్మీకావృతంబును నగు పొదం గాంచి
యందుఁ జొచ్చుటకు నిశ్చయించి యామార్గంబునఁ బరుగిడఁ జొచ్చెను.

జయసింగు దానియుద్దేశంబును మనంబున నూహించి యప్పొదఁ
జొరకమునుపే దానినిఁ బరిమార్పఁదలఁచి వేగంబున వెన్నాడెను. చాలసే
పాసూకరంబునంటి తఱుముచుఁ బోవుచుండుటచే నాతనిదేహము స్వేదజల
ముచే నిండిపోయెను. కొమ్మలనక, చెట్లనక, గుట్టలనక, మిట్టపల్లములనక, స్వారి
చేయుచుండుటచే నాతఁడు చాల నలసియుండెను. చెట్లకొమ్మలను ముండ్ల
కంచెలకుఁ దగులుకొని యాతనివస్త్రములు చినిఁగిపోవుచుండెను. దేహమునం
దక్కడక్కడఁ జెట్లరాపిడిచేఁ జిన్నచిన్నగాయములుగూడఁ గలిగెను. కాని
యాతఁడు వానినెల్లఁ బాటించుటలేదు. అతఁ డొకేపట్టుదలతో ఘోటకం
బును దఱుముచుండెను. తురంగము వాయువేగమునఁ బరుగెత్తుచుండెను. ఆ వేగ
మున గుఱ్ఱపుకాలిగిట్టకొక కర్కశపాషాణంబు దగులుటచే నయ్యది కటాలున
ముందునకుఁ బడఁబోయెను. కాని జయసింగు గుఱ్ఱపుస్వారియం దద్వితీయుఁ
డగుటచే లాఘవంబున హయంబును బడకుండునట్లు తప్పించెను. మఱికొంత
సేపున కాతఁ డాదుష్టవరాహంబును సమీపించెను. వెంటనే యాతఁడు తన
బలంబుకొలఁది శూలంబున దానిం బొడిచెను. ఆయదియు నతిరయంబున
వెడలి యాసూకరంబు నుదరంబును ఛేదించివైచెను. అవ్వేటున కాభూదారము
నేలంబడి ప్రాణంబుల విడిచెను. ఈదృశ్యముం గాంచి రాజసింహుఁడు గొమ
రుని బలధైర్యంబుల కెంతయుం మనంబున నలరి యాతని నాదరించెను. తండ్రి
తన్నభినుతించుటం జేసి జయసింగొందిన యానంద మింతింతని చెప్ప
నలవికాదు.

మఱియొకయెడఁ గొందఱు రాజపుత్రు లొక్కయడవిపందిని వెన్నాడిరి. అకిటియు దైవయోగంబున వారినెల్లఁ దప్పించుకొని యొక్కయగాధంబగు లోయయందలి పొదరింటం దాఁగెను. వారు ఱాలతో రువ్వియుఁ జెవులు చిల్లులు పడునట్లు ధ్వనులఁ జేసియు, దాని నెట్లయిన బయటికిం దఱుమ యత్నించిరి. కాని యది బయటికి రాదయ్యెను. తుదకు వారు విసిగి యాపొద కనలంబు రగుల్కొలిపిన నాభూదారంబు చేయునదిలేక బయటికి రావలసి వచ్చెను. అది బయటకు రాఁగానే పాపము! పెక్కుబల్లెము లొక్కసారి వచ్చి గ్రుచ్చుకొనెను. తత్క్షణమే యది మృతినొందెను. మోహనసింగు విజృంభించిన యొక్క క్రోడంబును సమయించెను. ఇంకొకచో బొండ్లానగరాధీశుఁ డొకదొడ్డ వాలుమెకంబును రూపుమాపెను. తదితరవీరభటులు తక్కుంగల ముక్కుడిమెకంబుల నుక్కడంచిరి.

ఆఖేటస్థలమునకు వరాహపంచకంబు బలియయ్యెను. వేఁటరుల కెట్టి విపత్తులులేక వేఁట నిర్విఘ్నముగ సమాప్తియయ్యెను. తర్వాత రాజపుత్రవీరు లందఱు దమకై యొకవిశాలవటమహీరుహచ్ఛాయ నతిమనోహరంబుగ నమర్పఁబడినగుడారములను జేరిరి. నాఁటిదినము భీమసింగుజయసింగుల ధైర్యసాహసంబులఁ గీర్తింపని వారుండరు. భీమసింగొకచిన్నయీటెసాయంబున నొక్క పెద్దపందినిఁ బరిమార్చుట విని యెల్లరాశ్చర్యసంతోషంబుల నాతనిఁ గొనియాడిరి. ఆరాకొమరులు నానందాబ్ధి నోలలాడిరి.

ఇంతలోఁ గొందఱు జానపదు లావరాహంబుల నైదింటిని మోసికొని వచ్చి తమరాక కెదురుచూచుచున్న రాజసూదకుల సమ్ముఖంబునం దుంచిరి. సూపకారు లావరాహంబులనెల్ల ఖండఖండంబులుగ ఛేదించి యప్పలలఖండంబులఁ దగురీతి శుద్ధంబుగావించి తమపాకశాస్త్రనైపుణ్యంబు మెఱయఁ బలువిధంబులగు శాకంబులుగ వండిరి. మఱియుం షడ్రసోపేతంబులగు భక్ష్యభోజ్యంబుల నతిత్వరితంబున సంసిద్ధంబుఁ గావించిరి. అటుపిమ్మట నొకవిశాల ప్రదేశంబున రంగులీను రత్నకంబళంబులు పఱచి విందునకు సిద్ధము చేసిరి.

తర్వాత రాజపుత్రులందఱు దాపునఁ బ్రవహించుసెలయేటినీట జలకంబులాడి సాంధ్యకృత్యములనెల్లఁ దీర్చికొని శుచిర్భూతులైవచ్చి యుచిత స్థలంబుల నాసీనులైరి. సూపకారులు పదార్థములవడ్డింప నెల్లరుఁ గడుపార భుజించిరి. నాఁటివిం దిదివఱకు జరిగినవిందులకంటెఁ జాలశ్రేష్ఠముగ నున్నదని వారంద ఱనుకొనిరి. రాజసింహుఁడు సర్వరాజపుత్రుల నెక్కుడుగ గౌరవించెను. భోజనానంతరము కొంతప్రొద్దు వారిష్టకథలఁ గడపిరి. ఇంతలో నినుం డపరాద్రి నధిరోహించెను. అప్పుడప్పుడే శకుంతసంతానంబులు కులాయంబులఁ జేరఁబోవుచుండెను. తపనుని వేఁడిమికి భయమంది, మూలలందాగిన తిమిరంబులు ప్రపంచమునఁ గప్పుట్టఁబొడఁగెను. ప్రియుండగు కమలాప్తుం డంతర్ధానంబు నొందఁగనే పద్మినీసమూహంబులు దీనత్వంబున రోదనంబు సల్పుచున్నవో యన ముకుళత్వంబొందియున్న పద్మగర్భంబులంజిక్కిన యళిసమూహంబులు నాదంబులు సలుపఁజొచ్చెను. సూర్యాస్తమయ మయ్యెనని యారాజపుత్రుల యాశ్వికదళము వనంబువెడలి యుదయపురమార్గంబునం జనియెను.



# మూడవ ప్రకరణము



## సందేశము

మనకథాకాలంబున జగద్విఖ్యాతిఁగాంచి సకలసంపదలచేఁ దులఁ దూఁగుచుఁ జూచువారల కానందాశ్చర్యంబు లశ్రాంతంబుఁ గల్గించు పట్టణ రాజంబులం దుదయపురం బగ్రస్థానం బొందియుండెను. ఆపట్టణంబుఁ జుట్టు కొని శత్రురాజుల కభేద్యమై యుప్పరిగలచే విలసిల్లుచు నొక్క ప్రాకారంబు విరాజిల్లుచుండెను. మఱియు నా ప్రాకారంబు ప్రక్కన మీనమకరాది నానా విధజలచరజలపక్షిసంయుతంబై యొప్పు నొక్క యగాధంబగు నగడ్త శత్రు భీకరంబై కనఁబడుచుండెను. ఆయగడ్త దాటి కోటలోనికిఁ బ్రవేశించుటకుఁగా నొక్కవంతెన కావలసినప్పుడు వేయుటకును, దదితరసమయములఁ దీయుట కును, వీలుగ నమర్పఁబడియుండెను. నేఁటికిని మా వంతెన వేయఁబడియుం డెను. అనేకరాజపుత్రు లామార్గంబున నశ్వారూఢులై పోవుచుండిరి.

ఆపట్టణవీథులన్నియు దీర్ఘములును, వెడల్పుగలవియును, సమంచిత ములును నై విరాజిల్లుచుండెను. ఆవీథుల కిరువంకలఁగల విశాలోన్నతసౌధ సమూహంబు లప్పటి శిల్పవర్యులనైపుణ్యాతిశయంబుల వేనోళ్లఁ జాటుచుం డెను. రాజవీథులు గలయు ప్రతిస్థలమునఁ బూర్వరాజన్యుల శిలావిగ్రహంబు లును, వారివిజయస్తంభంబులును, జూపరుల కానందాశ్చర్యంబులం జనింపఁ జేయుచుండెను. ప్రతివీథియందును నీశ్వరాలయం బొప్పుచుండెను. అందెల్ల ప్పుడును మంగళనాదంబులు శ్రవణపర్వంబుగ వినవచ్చుచుండెను.

మఱియు నప్పురవరప్రాంతంబు లందందు సరోవరంబు లమృతోప మానంబులగు స్వచ్ఛజలంబులచేతను, నానావిధజలవిహంగగణంబుచేతను,

గమలకుముదకల్హారాదిపుష్పసమవాయముచేతను నప్పుష్పమకరందము గ్రోలి మత్తిల్లి మొత్తంబులై నాదంబు లొనర్చు మధుకరంబులచేతనుఁ బ్రకాశితం బులై చూపఱులకుఁ బ్రకృతికాంతాసౌందర్యంబుఁ జాటుచుండెను. ఆప్పట్టణ ప్రాంతంబులందలి సుందరోద్యానంబులు వివిధతరులతాపుష్పసముదయముల తోడను ఫలభారావనతశాఖాసమేతంబులగు మహావృక్షంబులతోడను జంద నాదిసుగంధపాదపంబులతోడను, ననేకశృంగారలతాగృహంబులతోడను నొప్పారుచుండెను.

ఇట్టి పట్టణశ్రేష్ఠంబగు నుదయనగరంబునఁ గ్రీస్తుశకము 1679వ సంవత్సరమునందు ఫాల్గుణమాసాంతమున నహేరియాయను నొకగొప్ప యుత్సవము చాల వైభవంబున జరుపఁబడియెను. నాఁటిదిన మానగరవాసు లందఱుఁ దమతమగృహంబుల నతిమనోహరముగ నలంకరించిరి. ప్రతిగృహాం గణమును గోమయంబునఁ జక్కఁగఁ బరిశుభ్రంబుఁగావించి పలువిధములగు రంగులముగ్గులను బెట్టి పచ్చనియాకుతోరణములతో నలంకరించియుండిరి. సౌధ శిఖరంబుల వాయుసంచలితంబులై చిత్రవర్ణములుగలపతాకములు శోభిల్లు చుండెను. మఱియు ననేకరీతుల నలంకరించిరి. నాఁటిదినము ప్రతిగృహము నను మంగళనాదములు వినవచ్చుచుండెను.

రాజసౌధముఖద్వారంబునఁగట్టిన యరఁటిస్తంభములును, బచ్చనియాకు తోరణములును, వింతరంగులీను రంగవల్లికలును, జూపఱులకు నేత్రపర్వం బొనర్చుచుండెను. ఆ రాజప్రాసాద మధ్యభాగంబున నొకవిశాలంబగు సభా మంటపం బతివైభవంబుగ నలంకరింపఁబడియుండెను. ధవళకాంతులీను స్ఫటికశిలానిర్మిత కుడ్యంబులతోడను, శిల్పచాతుర్యాతిశయంబులఁజాటు స్తంభపంక్తితోడను, బూర్వరాజన్యుల శిలావిగ్రహంబులతోడను దేవతాప్రతి మలతోడను, నిలువుటద్దంబులతోడను, మఱియు ననేక చిత్రగతుల నలంక రింపఁబడి, యా సభామంటపము శోభాయమానమై యొప్పుచుండెను. ఆ మంటప మధ్యభాగంబున నొకయున్నతప్రదేశమున సింహాసనంబును, దాని కిరుపార్శ్వంబుల రాజపుత్రప్రభువులకై యుచితరీతుల నలంకరించిన యాస

నంబులును నమర్పఁబడియుండెను. తక్కిన ప్రదేశమంతయును వింతకాంతుల వెదఁజల్లు రత్నకంబళంబులచే బఱచియుండిరి. రాజపుత్రవీరులందఱుచితరీతుల నలంకృతులై వచ్చి యం దుపవిష్టులైరి. పురజనులు తండోపతండంబులుగ నరు దెంచి యా సభాభవనమునం దాసీనులైరి. సభయంతయుఁ గ్రిక్కిరిసియుండె ను. అందఱు రాణాయాగమనమునకు వేచియుండిరి.

ఇంతలో రాణారాకను దెలుపుటకై భేరీమృదంగాదిశబ్దములు గావింపఁ బడియెను. రాణారాజసింహుఁడు పుత్రామాత్యపరివృతుండై యాసభామంటప మును బ్రవేశించెను. తోడనే యందఱు లేచి రాణాకు వినయపురస్సరంబుగ వందనంబు లాచరించిరి. వారిడు వందనంబులం గొనుచు, మెల్లనఁజని రాజ సింహుఁడు సింహాసన మధిరోహించెను. అప్పుడు రాణా రాజపుత్రవీరుల కెల్ల రకు నాయుధంబులను, భూసురులకెల్ల వారివారి యోగ్యతానుసారంబుగ ధనకనకవస్తువాహనంబులను నొసంగెను. తర్వాత రాజ్యవిషయచర్చలు జరి గెను. జనులు తమకష్టనష్టములఁగూర్చి రాజునకు విన్నవించుకొనిరి. రాణా యును వారివారి కనువైనవసతులు కలుగఁజేయునట్లుద్యోగుల కాజ్ఞాపించెను. పిమ్మట రాణా లేచి గంభీరముగ సమస్తజనులు విన నిట్లనియె.

“రాజపుత్రవీరులారా! మీ రెల్లరు రాజభక్తితత్పరులై దేశసేవా ధురంధరులై మహాసహాయులరై యిదివఱ కనేక సంగ్రామంబులఁ గీర్తిగడించి యున్నారు. ఔరంగజేబు రాజపుత్రుల నిర్మూలనము సేయసమకట్టియున్నాఁ డట. అతఁడు హిందువులను బెట్టుబాధలింతింతలని చెప్ప నలవికాదు. మనమిప్పు డుపేక్షఁజేసినఁ జేటువాటిల్లు. శీఘ్రంబున ఢిల్లీ సామ్రాట్టుతో మనకు ఘోరసంగ రము సంభవింప నున్నది. మీ రెల్ల రప్రమత్తులై యుండవలయును. మీ రొక్కింత తడవు మీ మనంబుల మీపూర్వులబలధైర్యసాహసంబులఁ దలంపుఁడు. కదన రంగమున వైరికి వెన్నిచ్చి పాఱకుఁడు. జన్మభూమిసంరక్షణార్థమై ప్రతివీరుం డును దన ప్రాణంబుల నర్పింప సంసిద్ధులై యుండవలయును. పవిత్రరాజపుత్ర వంశంబునకును, దేశంబునకును, రాజునకును గళంకంబు రాకుండ మెలంగుఁడు”

తని చదువగా నామాటలు విన్న వీరులందఱుద్రేకంబున దేహంబులు పఱచి, కరంబుల కరవాలంబులంటి "జన్మభూమి సంరక్షణార్థమై యశాశ్వతంబులగు దేహంబులఁ గదనదేవతకు బలి యొసంగి శాశ్వత మోక్షకాంతను వరించుటకు సిద్ధముగ నున్నార" మని ప్రతిజ్ఞ చేసిరి. అంతటితో సభ ముగిసెను. పిమ్మట రాజసింహుఁడు వారికి షడ్రసోపేతంబులగు పిండివంటలతోడ విందొసంగెను.

నాఁటిసాయంకాల మా పట్టణపురంధ్రీమణు లెల్లరును రంగులీనుబంగరు పళ్లెరంబులఁ బూజాద్రవ్యంబులం గొని, యుపపురోపకంఠంబునంగల దుర్గాలయంబునకు వివిధమంగళతూర్యంబులతోడ బయలుదేరి, యద్దేవి యాలయముం జేరి, వినయవినమితోత్తమాంగులై కరంబులు మొగిడ్చి, భక్తిపూర్వకంబుగ నద్దేవికిఁ బ్రదక్షిణనమస్కారాదులఁ గావించి, పూజించిరి. ఉదయనగరంబునంగల సుందరీమణులెల్ల రానాఁడు సర్వాభరణభూషితలై నానారూపంబులందిన మోహినీదేవతచందంబున నొప్పారుచుండిరి. రాణాయును సమస్తరాజపుత్రసమేతుఁడై లోకజననియగు దుర్గాదేవిని సేవింప విచ్చేసెను.

కొందఱు వారాంగనాజనంబులు సుగంధానులేపనవస్త్రభూషణమాల్యాలంకృతలై కర్ణంబులందిడిన రత్నకుండలమరీచిజాలంబులు గండభాగంబుల నర్తనంబులు సలుప, పసిండికలశంబులంబోలు కుచములభారంబునను సూక్ష్మంబులగు మధ్యంబు లల్లాడ, హావభావవిలాససరసశృంగారచేష్టలం జేయుచు, నర్మవాక్యంబులం బలుకుచు, మందగమనలై, చిఱునవ్వులొల్కఁ బుష్పబాణుబాణంబులంబోలు నపాంగదృగ్జాలంబుల యువజనహృదయంబుల దుల్లసేయుచు నేతెంచి, కంకణనూపురరవంబులు తమరాగంబులకుఁ దోడ్పడ, భరతగాంధర్వవిద్యానైపుణ్యంబులు మెఱయ, సర్వజనమనోహ్లాదంబుగ గీతంబులం బాడుచు, నద్దేవిముందు లాస్యంబు సల్పిరి. వారినృత్యగీతాదులకు నానందించి రసనిమగ్నులై యెల్లరు మైమఱచిరి. పిమ్మట నర్చకు లాదేవిని సర్వమండన మండితం జేసి యొక్క దివ్యరథంబునందు నిల్పిరి. సర్వాభరణభూషితలగు బాలికామణు లద్దేవి కిరుపార్శ్వంబులఁ జామరంబులు వీచుచుండిరి. కొందఱు భక్తులా దేవిరథంబు నీడ్చుచుండిరి. మంగళనాదములు చెలరేఁగ దిశలు

మాఱు మ్రోగుచుండెను. ముందు వారాంగనాజనంబు నృత్యంబుసల్పుచుఁ
బోవుచుండెను. రాజపుత్త్రులు చెలరేఁగి చిమ్మనగ్రోవుల వసంతంబు నింపి
యొకరి నొకరు నేమఱించి చల్లుకొనుచుండిరి. రాణాయును రాజపుత్త్రులును
నీ యూరేగింపును గాంచి సంతోషించిరి.

ఇంతలో నిరువురాశ్వికు లతిరయంబున, దేహంబుల స్వేదజలంబులు
గార మార్గాయాసంబున నలసి రొప్పుచు, రాజసింహునిఁ జేరి "ప్రభూ!
మేము జోధ్పురమహారాణి దూతలము. మహారాజ్ఞిగారీ లేఖను సత్వరంబునఁ
జని మీ కిమ్మని యాజ్ఞాపింప మే మద్దానిఁ గొని శీఘ్రంబున వచ్చితి మ"ని
వినయపురస్సరంబుగ వందనంబు లాచరించి యాలేఖ రాణా కొసంగిరి.
రాణాయును నద్దానిఁగొని యందలివిషయముల నామూలాగ్రము చదువఁగనే,
యాశ్చర్య రోషంబు లాతని సుందరముఖారవిందమును గలఁచి వైచెను. సభ
యేలిక మొగంబున నాశ్చర్యరోషంబులు గన్పట్టుటఁగాంచి, తత్తరంబున రాజ
పుత్త్రప్రభువు లందఱు రాణా యేమి పలుకునో యని, వేచియుండిరి. రాణా
సింహుఁడు వివేకవంతుఁడగుటం జేసి, తత్క్షణమే మనంబున జనించిన రోషంబు
నుపసంహరించుకొని, సలంబటు ప్రభుహితవుమేర కొక ప్రత్యుత్తరంబు వ్రాసి
యావార్తాహరుల కిచ్చిపంపెను. దుర్గాదేవియుత్సవ మాటంకమేమియు లేక
యత్యంత వైభవంబున జరిగెను.

నాఁటిరేయి రాజసింహుఁడు మంత్రిసామంతులతోడ నాలోచించి
మఱునాఁటి యుదయముననే వేయిమంది గుఱ్ఱపురౌతులం గొని జోధ్పురమహా
రాజ్ఞినిఁ గొనితెచ్చుటకై వెడలెను. ఇంతలో నుదయపురంబున రాణా యా
గమనంబునుఁగూర్చి యనేకరీతుల ననుకొనఁజొచ్చిరి. జోధ్పురమహారాణి పతి
విరహితయై చిన్నకొమరునిఁ గొని యౌరంగజేబుదాడి కోర్వఁజాలక మిత్రపరి
వారయై వచ్చి బానసు నదికావలిగట్టున విడిసియున్నదనియు, జోధ్పురమహా
రాజగు జస్వంతసింహుని నౌరంగజేబు కుత్త్రలుపన్ని చంపించెననియు, నుదయ
పురప్రజలకుఁ గర్ణాకర్ణిగ వినవచ్చెను.

# నాల్గవ ప్రకరణము

## శ ర ణా గ తి

సూర్యభగవానుఁ డప్పుడప్పుడె యుదయాద్రి నధిరోహించెను. అరుణకాంతు లెల్లెడలఁ బ్రసరించుచుండెను. బానసునది యావలితీరంబున నొకవిశాల వృక్షచ్ఛాయ నమర్పఁబడిన గుడారంబుముందట నొకయాసనంబునఁ గాంతాలలామం బొక్కతె యాసీనయై మనంబున నేమియో యాలోచించుకొనుచుండెను. ఆమె సహజసౌందర్యవతియే యైనను, నిప్పు డామె వదనము వాడియుండెను. శోకావృతమై కన్పట్టుచుండెను; కాని యపుడపుడు ధైర్య శౌర్యంబు లామెముఖంబునఁ దోఁచుచుండెను. ఇంతలో నొకయోధుఁ డచ్చోటికి వచ్చెను.

యోధుఁడు:—మహారాణిగారికి వందనములు.

రాణి:—ఓహో! నీవా! కృష్ణసింగ్! విశేషము లేవైన నెఱింగివచ్చితివా?

కృష్ణ:—దేవీ! ఐదువందల రహాతూరు యోధులు మనరాకొమరుఁడగు నజితసింహుని క్షేమమునకై మొగలులతోఁ బోరాడి రణదేవతకు బలియైరఁట. దుర్గాదాసు చాలినంతవఱకు మొగలులు మనల వెన్నాడకుండునట్లు వారిని నిరోధించెనఁట.

రాణి:—ఆహా! ప్రభుభక్తిపరాయణులగు నా రహాతూరు వీరాగ్రేసరుల నేమని కొనియాడఁగలదానను.

కృష్ణ:—మహారాణీ! మొగలుసైన్యములు మనరాకొమరునిఁబట్టుకొనుటకై నిశ్చయించి దుర్గాదాసును సరకుగొనక, మనవిషయమునుఁ దెలిసికొని యీవిశకు వచ్చుచున్నారని వర్తమానము వింటిని. థామాయను నతని

పుత్రికయగు నేనూఱు కౌతుకంగొని హారావళీ ప్రాంతపుఁగనుమలచే గాపాడుచున్నారఁట.

రాణి:—తర్వాత విశేషము లెవ్వి?

కృష్ణ:—మహారాణీ దిలీర్‌ఖా నిప్పటి కజ్మీరు దాటియుండునఁట. మన మిక్కడాలసించిన ముప్పు వాటిల్లఁగలదు. కాన నిచ్చోటు శీఘ్రంబున విడువ వలయును.

రాణి:—నిశ్చయము.

కృష్ణ:—అయిన వెడలుటకు సిద్ధముగావింతునా?

రాణి:—(ఇంచుక యోజించి) మఱచితిని. నిన్నటిదినము మనయాగమన విషయమై రాణాకుఁ జెప్పియుంటిమికదా? అతఁ డిక్కడికిఁ రాఁగలడు. అతఁడు వచ్చువఱకు వేచియుందము.

అనుసమయమున సేవకుఁ డొకఁ డతిరయంబున నేఁగుదెంచి విస్మయ సంభ్రమంబుల రాణిగారికి వందనంబు లాచరించి "మహారాణీ! కొంతదూర మునఁ గొంత యాశ్వికదళమును గాంచితిని. అయ్యది మనదెసకే వచ్చు చున్నట్లు తోఁచుచున్న" దని నుడివెను.

కృష్ణ:—రాణాయే కాఁబోలును.

రాణి:—ఉండవచ్చును. కృష్ణసింగ్! నీవు వెడలి మనప్రయాణమునకు సర్వ మును సిద్ధముగావింపుము.

కృష్ణ:—చిత్తము. (అని సేవకుని బిలుచుకొని వెడలిపోయెను.)

తర్వాత దాది యొకతె చిన్నరాకొమరునిఁ దీసికొనివచ్చి మహారాణి కరంబులం దిడెను. రాణి యబ్బాలు నందుకొని, నిండారుప్రేమంబున నాతని దనయురంబునఁ జేర్చికొని, రాకాచంద్ర సదృశంబగు నాబిడ్డమోము ముద్దా డెను. జస్వంతసింహుని ప్రతిరూపంబునుంబోలు నాబాలుని యాకారంబును గాంచినతోడఁడి నామెకుఁ దనభర్తవిషయము జ్ఞప్తికి వచ్చెను. భర్తవిషయము

తలంపునకు వచ్చుకొలఁది నామె మోము శోకావృత మగుచుండెను. మనంబున జనించిన దుఃఖపరంపర లుప్పొంగ నాకాంతారత్నం బా శోకంబు నాపుకొనఁజాల కిట్లు విలపింపసాగెను.

"అయ్యో! కట్టడిదైవమా! నిర్దయుఁడవై నన్ను నాప్రాణప్రియుని నుండి యెడబాపితివే! అయ్యయో! ఈవియోగదుఃఖం బేరీతి సహించు దానను? హానాథా! కడపరాని యీశోకసాగరంబున ముంచి చనితివే! నన్ను నాథను జేసి చనుట నీవంటియుత్తములకుఁ దగునా?—అయ్యో! నాముద్దుల కూనా! నాచిన్నియజితసింహా! నానోములపంటా! రాకాశశాంకసన్నిభం బగు నీసుందరముఖారవింద చుంబనసందర్శనాది సౌభాగ్యంబులకు నీతండ్రి నోఁచుకొనఁడాయెగా? నీజిలిబిలిముద్దుమాటలను వీనులవిందుగ వినఁజాలఁ డయ్యెగా! హాపుత్రా! తండ్రిచే లాలింపఁబడుటకు నీవు నోఁచుకొనలేదు గదా! నీకు తల్లియుఁ దండ్రియు నేనయే సుమా!—హానాథా! నీసందర్శనం బింకగగనకుసుమ తుల్యమాయెగా! నీయనుంగుఁబత్నిని విడిచి చనుట పాడియే! హానాథా! నాథా! నాథా!—"యని శోకంబున మూర్ఛిల్లెను. అప్పు డాదాది యామెకు శీతలోపచారము లొనర్చి, యామె కొంత తెప్పిరిలినపిమ్మటఁ గొన్ని యుపశమనవాక్యంబులఁ బల్కి యామె నోదార్చెను.

దాది:——అమ్మా! వీరకాంతారత్నంబవగు నీవిట్లు భీరువువలె శోకించుట పాడియే? ఎట్టివారికేని కలిమిలేములు శాశ్వతములే? నీ విప్పు డెంతశోకించి నను ఫల మేమైనఁ గలదా? నీనాథుఁడు మగిడి పునర్జీవితుఁడు గాఁగలఁడా? ఆపత్కాలంబునఁ బ్రాజ్ఞులు శోకమునందరు. ధైర్యముఁ జిక్కఁబట్టుము. నిన్నిట్టికష్టములపాల్సేసిన యాతురుష్కాధముని పైఁ బగసాధింపఁబూనుము. వైరికుల భయంకరుండగు జస్వంతసింహమహారాజును జంపినందులకుఁ దగినప్రతిఫలంబును నౌరంగజేబనుభవించునుగాక!

రాణి:——(కొంచెము కోపము చల్లార్చుకొని) నిశ్చయము. ఆతురుష్కాధముఁడు తగినప్రాయశ్చిత్త మందుఁగాక. సర్వేశ్వరా! అనాథబంధూ! నీవే నాయీాపసికూనను గాపాడఁగలవాఁడవు

అని మాటాడుచుండ సేవకుఁ డొకఁడు లోని కరుదెంచి, "దేవీ! రాణాగారు శిబిరములను సమీపించి" రని నుడివి యటనుండి వెడలిపోయెను. ఇంతలో రాజసింహుఁడు శిబిరములను చేరెను. వెంటనే యాతఁడు మహారాణి శిబిరమునకు విచ్చేసెను. రాణా రాగనే మహారాణి లేచి యాతనికి వందనంబు లాచరించి కుశలప్రశ్నఁ గావించెను. తర్వాత వారిరువు రాసనంబుల నాసీనులైరి.

రాణా:—సహోదరీ! కొమరుదేవి! నీ విష్వసు దుఃఖాక్రాంతవై వచ్చి యుండుటఁజేసి నీకుశలంబును నేను వేఱుగ నడుగనక్కఱలేదు. నీదుఃఖ చరిత్రంబును నే నిప్పుడు విననొల్లను. నీజన్మభూమి యగు, నుదయనగరం బునకు విచ్చేయుము. నేను నారాజ్యము నాసర్వస్వము నీయధీనము. నాదేవేరు లెల్లవేళల నిన్ను గౌరవింతురు. నీవు వ్యథా చింతిల్లనలదు. సర్వేశ్వరుండు నీకు మేలొనగూర్చుఁగాక!

రాణి:—సహోదరా! రాజసింహా! నీదయారసం బపారము. నీబలధైర్యంబు లద్వితీయములు. నీవు యాచకుల కల్పభూజంబవు. వైరిరాలభుజంగపుం గవులకు వైనతేయసదృశుండవు. నీప్రతాపశౌర్యంబులఁ గాంచియే కదా నీశరణుఁజొచ్చితి.

రాణా:— సోదరీ! మన మిచ్చోటఁ గాలవిలంబనము జేయఁగూడదు. శీఘ్రంబుగా నుదయనగరంబునుఁ జేరవలయును. ప్రయాణమునకు సిద్ధ పఱుప సేవకుల నియోగింపవలయు.

తత్క్షణమే వారియాజ్ఞ మేరకు శిబిరము లెత్తివేయఁబడెను. వారందఱుఁ బ్రయాణమై యానాటిమధ్యాహ్నమున కుదయనగరంబుఁ జేరిరి. రాజకాంత లెల్లరు జోద్పురమహారాణికి, సగౌరవంబుగ స్వాగతం బొసంగిరి. నాఁటి నుండియు మహారాణి కుమారసహితయై యుదయనగరంబున సుఖంబుండె.

రాచనగరునం దొక్కయున్నత సౌధాంతర్భాగముల యొక విశాలమైనగదియందు, రెండుహంసతూలికాతల్పంబుల నిరువురు నారీలలా

షంబు లాసీనలై యుండిరి. ఆగది కడుశోభాయమానమై వివిధరీతుల నలంకరింపఁబడియుండెను. చిత్రవిచిత్రంబులగు చిత్తరువు లాగోడలందు వ్రేలాడుచుండెను. శిల్పనైపుణ్యాతిశయముఁ జాటు స్ఫటికశిలాప్రతిమంబు లందందు నిలుపఁబడియుండెను. మౌక్తికంబులచేఁ గూర్పబడి జలతార్లుగలిగి పలురంగులచే విరాజిల్లు చిత్రవిచిత్రంబులగు తెర లందందు వ్రేలాడుచుండెను. నేలయంతయు విలువైన రత్నకంబళంబులచేఁ బఱువఁబడియుండెను. ఆనారీలలామలం దొకామె కొంతచింతాక్రాంతయై కన్పట్టుచుండెను. తక్కినయాపె యామె నోదార్చుచు నిట్లనియె.

“మహారాణీ నీవిట్లు పలుమరు చింతిల్లెదవేల? నిరంతరచింతంజేసి నీవెట్లు కృశించియున్నావో చూచుకొమ్ము. ఆపదలు కలుగువేళ చింతింపక ధైర్యం బవలంబించి కష్టముల నిర్జింపవలయును.”

మహారాణి:— అమ్మా! రంగదేవి! దుర్భరంబగు శోకానలంబు మనంబును దహించివైచుచున్నది.—హా! నాథా! నిర్దయుండవై నన్నీశోకసాగరంబునఁ ద్రోసిపోయితివా? నీముద్దుంబట్టిని నీచిన్నియజితసింహుని నల్లారుముద్దుగఁ బోషించుభాగ్యమునకు నోచుకొనలేకపోయితివికదా! నీపవిత్ర చరణసేవా సౌభాగ్యము నాకికఁగలుగదని వార్తయయ్యెనుగా! పతివిరహితయైన కాంత సర్వమంగళములకు దూరమగునుగాదే? సతికిఁ బతితోడిదె స్వర్గంబు. నాఁడే నీతో సహగమనం బాచరింప సమకట్టితినిగాని, యస్మదుదరంబుననున్న యీచిన్నిబాలునికై ప్రాణంబుల నిలుపఁబెట్టుకొన వలసివచ్చెను. హా! ప్రాణప్రియా!—వైరిమత్తేభకుంభస్థలంబుల నిజకృపాణంబునఁ జీల్చిచెండాడు వీరసింహుండని పేరొందితివి గాదే? నీవంటి వీరాగ్రేసరుని, ముఖాముఖిఁ బోరాడి, చంపుశక్తిలేక, యాజిత్తులమారి యారంగజేబు, విషంబిడి మడియించెఁగదా? ఆ విషయముఁ దలచుకొన్న కొలఁది, దేహము భగ్గుమని దహించుకొని పోవుచున్నది. ఓరీ! తురుష్కాధమా! భగవంతుఁడు నీకుఁ దగినప్రాయశ్చిత్తముఁ జేయుంగాక!

రంగ:—అమ్మా ! కొమరుదేవీ ! నీవంటివీరనారీలలామయే, యిట్లు శోకింప వమునొంట్లగతిఁ జెప్పవలయునా ? గతజలసేతుబంధనమునకు ఫలమేమి ? చక్కఁగ యోజింపుము. శోకం బుడుగుము. ధైర్యం బవలంబింపుము. ప్రకృతపుఁ గర్తవ్య మాలోచింపుము. నీసుఖదుఃఖంబులు, మాసుఖదుఃఖంబులుఁగావా ? సర్వరాజపుత్రులు నీవిషయంబునఁ బ్రాణంబులనైన, నర్పింప సంసిద్ధులైయుండ, నీవు శోకింపఁదగునా ? నీకును నీబిడ్డకును, నీరాజ్యమునకును, నెట్టిముప్పును వాటిల్లదు. నిశ్చయము. నామాట నమ్ముము. చింత నుడుగుము. ఆచెనటి తగినప్రాయశ్చిత్తము నందుఁగాక ! ఆ నీచతురుష్కచక్రవర్తిపైఁ బగసాధింపఁబూనుము.

అని రంగదేవి యనేకోపశమనవాక్యంబులం బలికి యెట్టకేలకు మహారాణి శోకాగ్నినిఁ గొంతవఱకుఁ జల్లార్చెను.

మహారాణి:—(ధైర్యం బవలంబించి) అమ్మా ! రంగదేవీ ! నీమృదుమధురప్రేమవాక్సుధాధార లెట్టకేలకు నాశోకానలంబు నుపశమింపఁజేసినవి. పుట్టిన యింటికిని, మెట్టినయింటికినిఁ గీర్తిఁదెచ్చితివి. నీవంటి వీరపత్నులఁ గొనియాడ నేనెంతదానను ? నేనును, నాయీముద్దులబాలుఁడును, నీసహాయముమీఁదనే యాధారపడియున్నారము.

అని వా రిట్లు మాటాడుచుండ మెల్లనఁ దెరఁదీసికొని రాజసింహుఁడు, లోనికిఁ బ్రవేశించి కొమరుదేవిప్రక్కనఁ గూర్చుండెను. రాణా రాగనే రంగదేవి కొంతదూరముగ జరిగి కూర్చుండెను. అప్పుడు రాణా యిట్లు మాటాడెను.

రాణా:—సహోదరీ ! కొమరుదేవీ ! నిశ్చయముగ రాజపుత్రులందఱు నీ విషయంబునఁ బ్రాణంబులనైనఁ గోల్పోవ సంసిద్ధులైయున్నారు నీవింక శోకింపఁ బనిలేదు. నేఁడు నీవెఱింగిన విషయంబులనెల్ల విశదంబుగఁ బల్కుము. పిమ్మటఁ గర్తవ్యాంశమును విచారింతము.

మహారాణి:—సోదరా! నిశ్చయమును జెప్పుచున్నాను వినుము. ఇరువదినెలల క్రిందట ఔరంగజేబు నానాథునకు "సేనల నాయత్తపఱచుకొని యాఫ్ఘ

ఘనుస్థానమునకుఁ బోయి, యందలి కలఁతల నణఁచివేయవలయు" నని యాజ్ఞాపించెను. నా ప్రియుండును జేనియానతి మేరకు, యుద్ధంబులం దారితీరిన వీరభటసహస్రంబులం గొని యాఫ్ఘను స్థానంబునకు వెడలి తనభుజబలంబున రిపుబలంబుల నిర్జించి స్వదేశమునకు మఱలివచ్చెను. విదేశంబులకు వెడలి యందు ఘోరసంగరంబున మత్ప్రియుండు మృతుం డగునని యౌరంగజేబు తలంచెను. కాని దైవబలంబున నా హృదయేశుం డెట్టి విపత్తునుఁ బొందక విచ్చేసెను. నానాథుండు యుద్ధంబున జయించి వచ్చుటయుఁ దనకోరిక సఫలంబు గాకుండుటయుఁ గాంచి చక్రవర్తి యీర్ష్యాగ్రస్తుండై నాపతి నెట్టులైనఁ దుదిముట్టింపఁ దలంచెను. బహిరంగ ముగఁ జంపించుట కష్టమనియు మీఁదుమిక్కిలి యపకీర్తికి హేతువనియుఁ దలంచి మాయోపాయంబున నెట్టులైనఁ జంప సమకట్టియుండెను. నా మగండు వైరినిర్మూలనంబుఁ గావించి, చక్రవర్తి తన్నెక్కుడుగ గౌరవించునను నాసతో ఢిల్లీపురంబును బ్రవేశించెను. అపయోముఖవిషకుంభమువంటినీచుఁడు! ఔరంగజేబు! మనంబునందు క్రోధంబును బయటికిఁ దోపనీక కృత్రిమప్రేమంబున మన్నాథు బహూకరించుటకై యొక గొప్పవిందు గావించెను. అవ్విందులో విషం బిడి నా ప్రియునిఁ బితృపతి పురంబున కనిపెను. ఇంతటితోఁ దనివినొందక యాతురుష్కాధముఁడు నాయాపసికూనప్రాణములనైతము గొని నిర్వంశంబుఁ జేయ సమకట్టెను. తొలుత నాముద్దులబిడ్డను బట్టి తనకొప్పగించువాని కెక్కువ బహుమతుల నిచ్చెదనని, యానీచుఁడు నా యనుచరుల కాశఁగల్పించెను. కాని ప్రభుభక్తిపరాయణులగు వా రానీచకార్యమున కొడంబడక యాతనిబహుమతులఁ దృణీకరించిరి. ఆమ్లేచ్ఛకిరాతుఁడు సేయునదిలేక యాకార్యంబు నిర్వహింపఁ గొంతసైన్యంబును బంపెనుగాని, మత్సైన్యం బాసైన్యంబు నోడించి తఱిమివేసెను. మఱల గొప్పసైన్యంబును బంపి మమ్ముఁ జెఱపట్టునని యెంచి భయంపడి త్వరితంబున నీశరణుఁ జొచ్చితిని. నీసాయంబున

భీమసింగు తలిదండ్రులయొద్ద సెలవుగొని "వజ్రాయుధం" బనెడి పేరుగల తనయశ్వంబువారువంబునెక్కి, బంగరుపనిపీ పనిచేయఁబడిన శిరస్త్రాణమున నతిరమ్యంబుగఁ జెక్కఁబడిన నెమలిపింఛము మెల్లన నిటునటుఁ గదలుచుండ సైంధవంబును మెల్లన నడపించుకొనుచు రాజనగరు వెల్వడియెను. తోడనే బయటనిలుచుకొని యుండిన ముప్వురు సేనానాయకులును, పదుత్తమదళంబులతోడ నారాకొమరునకు యోధపురుషసాంప్రదాయంబుగ వందనంబు లాచరించిరి. క్షణమే భీమసింగు యాజ్ఞమేర కాపళంబు బయనంబయ్యెను.

ముందు నీమూఁడు రాజసేనలును, వెనుకభాగంబున బెడ్డాసైనికులును, గుడియెడమల బిజోలీయోధులును, మధ్యప్రదేశంబున భీమసింగును మహారాణియును, నామెయంగరక్షకులును ప్రయాణము సేయుచుండిరి. విరోధిసైన్యంబులు దమ్ము వెన్నాడకముందే వారు కెల్వాకోటను జేరఁదలంచిరి కనుక నతిత్వరితగతిం బ్రయాణంబు గావించుచుండిరి. విరోధిసైన్యంబుల జాడల నెఱుంగుటకును, వనమార్గంబులఁ జిక్కఁబడకుండుటకును, రాకొమరుఁడు గొందఱ నియోగించెను. మఱియు భీమసింగు పదుఁజారగూఢచారులై యప్పుడప్పుడు ముందువెనుకలనుఁబోవుచు సమాచారముల నెఱుంగుచు సైనికుల నాదేశించుచు నప్రమత్తతతో మెలంగుచుండెను.

మఱునాఁడుదయము పదిగంటలు కాఁగానే యాదళము దేబారీకనుమను జేరెను. భోజనమునకై కొంతసేపు వారచ్చో నిడిసిరి. భోజనానంతర మొక్కింతసేపు విశ్రమించి మఱలఁ బ్రయాణమై మఱుసటిమధ్యాహ్నమునకు పూర్వమే 'దెల్వారా' రాజ్యమందలి సిద్ధాగ్రామమును జేరిరి. ఆప్రదేశము సన్నాఱుగులయెత్తుగలిగి నివసించుట కనుకూలముగ నుండెను. మఱియు నాస్థలము విశాలమై వివిధతరుషండమండితంబై నేత్రపర్వం బొనర్చుచుండెను. భీమసింగునానతి నాప్రదేశమున శిబిరములు వేయఁబడెను. భీమసింగవ్వన పరిసరప్రదేశంబులఁ గ్రుమ్మరి యచ్చటివనమార్గంబులనెల్లఁ

జక్కఁగ నెఱింగెను. భోజనానంతర మారాజపుత్రవీరులెల్లరు వారివారిశిబిరంబులం దుపవిష్టులై వినోదంబునఁ గాలంబును బుచ్చుచుండిరి.

అట్టిసమయమున గూఢచారుఁ డొకఁ డతిసంభ్రమమున నేఁగుదెంచి భీమసింగును గాంచి వినయవినమితోత్తమాంగుఁడై కరంబులు మోగిడ్చి తత్తరంబున "మహాప్రభూ ! నే నీవఱంబెల్లఁ గ్రుమ్మరుచు, విరోధివర్గంబుల జాడల నరయుచుండఁ, గొంతదవ్వున మూఁడేనుఁగులును, రమారమి యేబది వందలయాశ్వికదళంబును, మనశిబిరములదెసకు వచ్చుచున్నట్లు చూచి యావృత్తాంతంబు దేవరవారి కెఱిఁగింప వచ్చితి" నని చెప్పెను. వెంటనే యాసంగతి శిబిరములం దెల్లెడల వ్యాపించెను. కలకలము హెచ్చెను. తత్క్షణమే యుద్ధపరికరంబులఁగొని వీరభటులు విరోధివర్గంబుల నెదుర్కొనుటకు సంసిద్ధులై యావిక్కునకే చూచుచుండిరి. ఒకయరగంటసేపటిలో వారెల్ల రావచ్చు దళమును జూచిరి. మఱికొంతసేపటిలో నాదళము శిబిరములను సమీపించెను. వారు దలంచినటు లది విరోధిదళంబు గాదు. భీమసింగు మితపరివారుండై వారి నెదుర్కొనెను. అప్పుడు సర్వాలంకారశోభితంబగు భద్రగజంబునుండి యిరువురుకాంతలు క్రిందికి దిగిరి. ఆనూతనదళాధికారి, భీమసింగును సమీపించి వందనంబు లాచరించి ప్రక్కన నిలిచియుండెను. భద్రదంతావళంబు నెక్కి వచ్చుటచే వా రుత్తమవంశోద్భవులని యును, బంచవర్ణముల నలరారుపతాకాదులంబట్టి మాడ జయపురాధీశ్వరులగు కచ్వాలవంశసంభూతులని యుం భీమసింగెఱింగెను. తత్క్షణమే భీమసింగా కాంతలను రాణిగారిశిబిరమునకు దోడ్కొనిపోయెను. రాణి యాకాంతలకుఁ దగురీతి స్వాగతంబొసంగి యాదరించెను. భీమసింగాకాంతలను లోనికనిపి కచ్వాలనాయకునితో సంభాషించుచుండెను. ఇంతలో మహారాణి భీమసింగును లోనికిఁ గొనిరమ్మని యొకసేవకునిఁ బంపెను. భీమసింగు వెంటనే రాణిశిబిరమును బ్రవేశించి రాణియాజ్ఞమేర కొకమృదుతల్పంబున నాసీనుఁడయ్యెను. భీమసింగు లోనికి రాఁగనే యాహూతన

కాంతలు మేలిముసుంగుల సవరించుకొని కొమరుజేవిప్రక్కనఁ గూర్చుండిరి. భీమసింగాయిరువురిస్త్రీల నొక్కమాఱు వీక్షించెను. ఆనూతనస్త్రీలలో నొక్క తెకు దాదాపు ముప్పదియేడు లుండవచ్చును. ఆమె వేషభాషలంబట్టిచూడ నారెండవవ్యక్తికిఁ బరిచారికగా నుండవచ్చునని యాతఁడు తలంచెను.

ఆరెండవవ్యక్తి పదునాఱేండ్లుగలముగ్ధ. భీమసింగతి పరిశీలనానిపుణుఁ డగుటఁజేసి నిమిషమాత్రంబున నామెసోయగం బిట్టిదని గ్రహించెను. రాకాసుధాకరుఁ బురడించువదనంబును, నష్టమీశశాంకబింబసన్నిభంబై యళి నీలాలకభ్రాజితంబై యొప్పు ఫాలఫలకంబును, బుష్పచాపుచాపంబుసొంపు నేపఁ జాలు కనుబొమలును, బద్మపత్రసన్నిభంబై విరాజిల్లు విశాలలోచనంబులును, గంధఫలిసౌందర్యంబు సన్నంబుచేయఁజాలిన చక్కనినాసికయును, దొండపండు వంటి యధరంబును, ముఖంబున కతిసౌందర్యం బొసంగు నాణిముత్తెంబులం బోలుచక్కనిపలువరుసయు, గండుతుమ్మెదలకాంతుల నపహసించు దీర్ఘకుటిల కుంతలజాలంబును, నదియిది యననేల సర్వాంగసౌష్ఠవంబును నాకన్యకా మణికి సహజభూషణంబులై యొప్పుచుండెను. కర్ణంబులంగల రత్నకుండల ప్రభలు, చెక్కుటద్దములఁ బ్రతిఫలింపఁ గుందనంపుఁగాంతి నపహసించు మేని కాంతితోడ నొప్పుచుఁ బుష్పబాణుని యూఱవబాణమోయన నాకంబు నిర్గ మించి వసుంధరాతలంబునఁ జరింపవచ్చిన దివిజకాంతయోయన నక్కాంత యొప్పారుచుండెను. మఱియు సహజసౌందర్యంబునకు సన్నిహితయౌవనంబుఁ దోడ్పడ మూర్తీభవించిన సౌందర్యలక్ష్మియోయన నాబాలాలలామంబు చెల్వొందియుండెను.

కాని యారమణి దినమణిరాకకై పరితపించుపద్మినీమణివలె ముకుళిత ముఖకమలయై సంకుచితనేత్రారవిందయై యుండెను. ఆనవలామణి నావిధ మున దీనదశకుఁ బాల్పఱచిన విధిచెయిదము మనుజమాత్రుని యూహాప్రప చమునఁ గాననగునా ?

భీమసింగాభువనమోహనవిగ్రహంబును గాంచి యాశ్చర్యానందం బుల మునింగెను. ఆ దివ్యమంగళవిగ్రహంబును నేత్రపర్వంబుగఁ దిలకింప నెంచి భీమసింగనిమిషత్వంబు నొందెనో యన ఱెప్పవేయక తననేత్రచకో రంబుల నబ్బాలవదనేందుకళలఁ బానంబు సేయఁ జొచ్చెను. కాని, యాసుంద రాంగిముఖకమలము వాడియుండుటకుఁ గారణం బేమి యుండునా? యని యతఁ డాలోచింపఁదొడఁగెను. కొంతవఱకాసుందరాంగిసోయగంబు సంద ర్శించి, యాతఁడు మనంబున నిట్లు తలపోయఁ జొచ్చెను. "అహా! సౌందర్య ఖనియగు నిక్కన్యకామణి నిజ్జగంబున జనియింపఁ జేసిన యాసృష్టికర్తనై పుణ్యం బేమని కొనియాడుదు? అహా! ఏమిసౌందర్యము? ఏమిజవ్వనము?—ఇదేమి వింత?—ఎంతమరలింత మన్నను నీసుందరాంగిసందర్శనంబునుండి నా చూడ్కులు మరల కున్నవి. ఇట్టి కోమలాంగితో సుఖంబుల నోలలాడఁగల పురుషపుంగవుం డెట్టివాఁడో కదా! అట్టివానిదే జన్మము!—అహా! ఏమిది? సుశిక్షితంబైన మన్మనంబున నిబ్బాల గాంచిన దాదిగ విపరీతభావంబు లుత్ప న్నంబు లగుచున్నవి?—కుసుమశరా! నన్నెంత తీవ్రవేదనం బెట్టుచుంటివి? నీబాణములు పుష్పంబులయ్యు నెంతతీవ్రంబులు!—అహాహా! నాసౌభాగ్య మేమందును! అల్లదిగో! అల్లదిగో! అమ్మృగాక్షియుఁ దనకటాక్షవీక్షణ జాలంబుల నావంకకుఁ బఱపుచున్నది. ఆ కటాక్షధీదితులయాశయ మేమై యుండును?" అని భీమసింగు పరిపరివిధముల నాలోచింపఁ దొడఁగెను. అతని భావముల వ్రాయుట కింతపట్టినను నవియన్నియు నాతనిచిత్తాకాశమున విద్యు ల్లతలవలె నిమిషములో మెఱసిపోయెను.

అబింబోష్ఠియుం భీమసింగురూపయౌవనాదులం గాంచి సాభిలాషిణి యయ్యెను. ఆచంచలాక్షియుం లజ్జావినయసంభ్రమంబులఁ దన యపాంగ దృగ్జాలంబుల నాతనివంక బఱపుచు, తనఁ డొకవేళ తన్ను జూచినఁ దన చూడ్కుల నేలఁ బఱపుచుండెను. ఒక్కపరి వారిచూపు లేకం బయ్యెను. దేహంబు లుప్పొంగెను. మనములు వికసితము లయ్యెను. ప్రేమపాశంబు లెంత

వృథములు? వెంటనే మరుండ నెడివేఁటకాఁడు వారియన్యోన్యానురాగవీక్షణ పాశంబులచే వారిమనోమృగంబుల నొకటిగఁ గట్టివైచెను. ఆహా! మనోభవా! నీబలంబె బలంబు. శివునికోపాగ్నివలన భస్మీభూతుండవై, పునరుద్ధారముఁ బొందిన నీవు లోకంబుల మఱల నీయిష్టమువచ్చినరీతి నాడించుచున్నావు. నీదాడి కోర్వఁజాలక శివుం డర్ధనారీశ్వరుండయ్యె. పుండరీకాక్షుండు కమలాలలామం బును వక్షంబున నెయుంచుకొనె. పద్మాసనుండు వాగ్దేవిని వాక్స్థానంబున నె నిల్పికొనె. త్రిమూర్తులంతటివారె యిట్లు నారీప్రియులై యుండ నిఁక మానవు లెంతటివారు. పుట్టినదాదిగ సర్వంబు వర్జించి, గోచిబిగించి, కందమూలాదుల భక్షించి, యహంకారమమకారంబుల విసర్జించి, తపోనిష్ఠాగరిష్ఠులగు తాపస వర్యులుసయితము నీదాడికోర్వఁజాలక నిమిషములో నారీవశంకరులగు చున్నారు. నీశౌర్యంబె శౌర్యంబు!—ఇట్లు తటిల్లతలవలె మెఱసినమనో భావములచే మార్పడిన మోమువమ్మి నొక్కింతమరలించి భీమసింగురాజ్ఞి యను జ్ఞకై మోమును వీక్షించెను.

మహారాణి భీమసింగును గాంచి "రాజకుమారా! ఈలేఖ, నామూలా గ్రము సావధానచిత్తుఁడవై చదివి వినిపింపుమా." అని యొసఁగి కాగితంబు నందించెను. భీమసింగాజాబు నతిసంభ్రమంబునఁగొని చదువఁజదువ నాతని మనంబున నాశ్చర్యరోషసంకటంబులు జనించుచుండెను. ఆ మాటలు విను కొలఁదిని రాణిగారి నేత్రము లశ్రుపూరితము లగుచుండెను. ఆ లేఖను జదువు నప్పు డాతఁడు, పలుమాఱు దనచిత్తచోరయగు నచ్చంచలాక్షినిఁ జూచు చుండెను. చదువరు లాకమ్మవృత్తాంతంబు నెఱుఁగఁ దత్తరం బొందుచుందురు కాఁబోలు. భీమసింగా లేఖ నిట్లు చదివెను.

"జోద్పురమహారాణిగారికి:—

లోకేశ్వరేశ్వరుండును, భక్తజనసులభుండును, యోగిజనహృదయాంత రాళవాసుండునునైన, రుక్మిణీకాంతుండు సర్వసౌభాగ్యసౌఖ్యంబు లొసంగుఁ

గాక! లోకక్షయకారకుండగు సుమాకాంతుండు కృపాయత్తచిత్తుండై నీవైరి వర్గంబును నిర్మూలించుఁగాక! అమ్మా! కొమరుదేవి! దుర్భరదుఃఖానలంబునఁ దపించుచున్న నావిషాదపూరితంబగు కథనంబు సావధానచిత్తవై యాలకించి, కృపాయత్తచిత్తంబున నాముద్దులకూనయగు నిబ్బాలికామణి నుద్ధరింపుము. మహారాణీ! అంబరురాజ్యము సర్వనాశనమైనది. హా! తలంచుకొలఁది మనంబు కలఁగిపోవుచున్నది. దుర్భరము!—హా! జయసింహా! ప్రాణప్రియా!—అమ్మా! క్రూరుండగు నాతుచ్ఛతురుష్కచక్రవర్తి దుండగములేమని వర్ణింతును? నోట మాట రాకున్నది. వ్రాయుటకుఁ జేయిరాకున్నది. ఆ క్రూర కాలసర్పము! ఆ నీచాధముఁడు! ఆయధాంగ జేసి మత్ప్రాణప్రియుని నమ్మించి విషంబిడి శమనుబారి కనిపె. శోకానలంబు దేహంబును దహించి వైచుచున్నది. నే నిఁక పతివిరహితనై జీవింపఁ జాలను. నేఁడే యీదేహంబును నగ్నిభట్టారకున కాహుతియొసంగి యమరపతిపురంబునఁ బతిం గలసికొనియెద. నిస్సహాయయు, సర్వలక్షణలక్షితయునగు నాయనుంగుపుత్రిక, నాయంబాలికను నీసన్నిధానమునకుఁ బంపుచున్నాను. అమ్మా! ఈయనాథబాలికను నీపుత్రిగ నెంచి రక్షింపవేఁడెద. ఈమె వెంట నమూల్యంబులగు ధనకనకవస్తువాహనాదులఁ బంపుచున్నాను. ఈమె యుక్తవయస్కురాలైన పిమ్మటఁ గులశీలవిద్యావయోరూపంబుల ననుకూలుండగు నొక్క రాకొమరున కొసంగి పాణిగ్రహణం బొనర్పుము. నేనిప్పుడు పంపినవస్తువుల నెల్ల నరణంబుగ నిమ్ము అమ్మా! ఆతురాహ్వానము నీ సాధింపుము. సర్వేశ్వరుండు మేలొనగూర్చుఁగాక! ఈలేఖ నీకందులోపలఁ బతింగలిసి సుఖంబుండెద. అమ్మా! పుత్రిని రక్షింపుము. ఇదియే నా యంత్యవందనము."

ఇట్లు

శ్రీ జోడ్బాయి (అంబరురాజ్ఞి)

పై లేఖ సామూలాగ్రము వినఁగనే వినువారినేత్రములు, శోక బాష్పములతో నిండిపోయెను. అంబాలికయుఁ దనతల్లిదండ్రుల మరణమునకుఁ గడుంగడు దుఃఖింపఁ దొడఁగెను. మహారాణి యామెను దనయొడిలోఁ గూర్చుండఁబెట్టుకొని కన్నీరుఁదుడుచుచు, "అమ్మా! అంబాలికా! దుఃఖింపకుము. నాకళికసింహుఁ డొక్కటియుం నీ వొక్కటియుఁగాదు సుమా! నీతలిదండ్రులు లేనిలోపంబులు బోనడంచెద" నని శిరంబు మూర్కొనుచు నూరార్చెను. భీమసింగును నంబాలిక దీనావస్థనుఁ గాంచి శోకాకులితచిత్తుఁడయ్యెను. అతని కొక్కమాఱు రౌద్రోద్రేకముచే నొడ లుప్పొంగెను. అమాంతముగ ఢిల్లీశ్వరునిపైఁబడి కుత్తుక నుత్తరించి నెత్తురుద్రావుదునా యని యాతనిచిత్తము తత్తరమొందసాగెను. "కిరాతకా! నరహంతకుఁడవై నీవు మాత్రము పదివేలేఁడు లట్టిఁగట్టుకొని యుండఁగలవా? నీదుష్కర్మములు నిన్నూరకవిడుచునా? నీచాధమా! పౌరుషజ్ఞానశౌర్యంబులు గలవాఁడవేని, సంగరంబున మార్కొని చంపుట వీరుని గుణంబగుఁగాని నమ్మించిగొంతుగోయుందువా? - దురాత్మా! భీమసింగుమేనఁ బంచప్రాణంబు లుండువఱకు నీప్రాణంబుల నఱచేతనుంచుకొ" మ్మని యాతఁడు చక్రవర్తిపైఁబగసాధింప మనంబునఁ బ్రతిజ్ఞఁగొనెను.

పైవిషయములనెల్లఁ గాంచుచు సర్వాంగసుందరుండగు పదునెనిమిదేండ్లరాకొమరుఁ డొక్కఁడు కరంబునఁ జాపంబును, వీఁపున బాణంబులతోఁ నిండిన తూణీరంబును ధరించి, రాణీశిబిరకవాటంబు ముందట నిలిచి యుండెను. ఆబాలుఁడు శిబిరంబునజరిగిన విషయంబులనెల్ల బహుజాగరూకతతోఁ గాంచుచుండెను. అంబాలికాభీమసింహులవృత్తులను, వారియన్యోన్యప్రణయవీక్షణములను గాంచి వారిరువు రొకరినొకరు ప్రేమించిరని యాబాలుఁ డెఱింగెను. అదెందుకోగాని, లోకవిపత్కంబులఁ గాంచినకొలఁది నాతనిముఖంబున విరక్తిభావంబు గన్పట్టుచుండెను. తుద కతఁడుపడనగహ్వరమునుండి, వేఁడినిట్టూర్పులు వెడలివచ్చెను. భీమసింగు బాలునిఁ గాంచి లోనికిరమ్మని సంజ్ఞ

చేసెను. వెంటనే యాబాలుఁడు లోనికి వెడలి రాణికిని భీమసింగునకును, విన
యంబున వందనంబు లాచరించి, ఠాకూరుగోపీనాథు ముద్రగలయొకలేఖను
భీమసింగున కిచ్చెను. అతఁడాకమ్మనుగొని యందలివృత్తాంతమును సాంత
ముగఁ జదివి యాశ్చర్యమానసుఁడయ్యెను. ఆతనిమనంబు గలఁతనొందెను.
అతని కప్పుడేమిచేయుటకును దోఁపలేదు. అతఁడు కొంతతడవు యోజించి
"మహారాణీ! విరోధిసైన్యములు మనల వెన్నాడుచున్నవనియు, మన మాలసిం
చిన విపత్తు రానున్నదనియు, ఠాకూరు వర్తమాన మంపియున్నాఁడు. మన
మిచ్చోటినుండి వేగంబ ప్రయాణంబు సాగింపవలయును. రాజపుత్రసేనా
నాయకులతో నాలోచించుటకై నే వెడలెద. మీరు ప్రయాణమునకు సిద్ధ
ముగ నుండుఁడు."అనిపల్కి యటనుండి వెడలిపోయెను. పోవునప్పు డాబా
లునిఁ గాంచి తనతోఁ గూడ రమ్మని సంజ్ఞచేసి వెడలిపోయెను.

రాణి పుత్రసహితంబుగ నుదయనగరంబునకుఁ బారిపోయినదని తెలిసికొని తనసైన్యం బఫ్జుల్ ఖాను సైన్యంబుతోఁగలిపి యిరువురును గలిసి యుదయ నగరంబును ముట్టడింప నున్నట్లు తెలిసినది. మార్గంబుననున్న మాగ్రామం బులపైఁబడి మమ్ముజంపుదు రని భయపడి యరణ్యములకుఁ బారిపోవుచున్నా మని నుడివిరి. ఆవృత్తాంతంబును శీఘ్రంబుగ మీకెఱింగింప నాజనకుండు నన్నుఁ బుత్తెంచె. అఫ్జుల్ ఖాను మన కిప్పుడు చాలసమీపములో నున్నట్లు కొందఱు గూఢచారులు మా కెఱింగించిరి. కాన మనమిప్పుడె కడుజాగరూ కులమై యుండవలయును."

అని ప్రేమాబాయి నుడువగనే వార లాశ్చర్యమున మునింగిరి. భీమ సింగున కేమియును దోఁచుటలేదు. అతఁడు తీవ్రముగ నాలోచించుచుం డెను. తక్కిన నాయకులును నాలోచనాసముద్రమున మునుంగులిడుచుండిరి. కాని, వారి కప్పుడేమి చేయుటకును దోఁచలేదు. అప్పుడు ప్రేమాబాయి వారినిఁ జూచి చిఱునవ్వున నిట్లనియె.

"రాజపుత్రవీరులారా! మీరందఱు వీరాగ్రేసరులు. నేనో? యను భవములేని బాలను. అయినను నావాక్యముల మన్నించి వినఁగోరెద. ఇప్పటి పరిస్థితు లాలోచించిచూడ జయలక్ష్మినిఁ బ్రసాదించు తెరు వొక్కటి నా మనోవీథిఁ బొడగట్టుచున్నది. అదేమన? మహారాణి కుమారీకుమారులతోడను, బరిచారికాజనంబుతోడను, నేనుంగుల నెక్కి బానసునదీతీరమార్గంబునఁ గెల్వాకోటకుఁబోవున ట్లొనర్పుడు. అచ్చటి గాఢారణ్యములు వారిని విరో ధులనుండి గాపాడఁగలవు. వారి కేవిపత్తులును రాకుండఁ గెల్వాకోటను జేర్చుటకై బెడ్లాప్రభువు మూఁడువందలసైనికులఁగొని వారివెంటఁ బోవ లయు. ఇంతలోఁ దక్కినవా రుత్తపల్లకులఁగొని చేబారికనుమ మార్గముగ బోవున ట్లొనర్పుడు. ఆప్రదేశముల శత్రుసైన్యములు తిరుగుచుండుటంజేసి వారు మనయందలంబులం గాంచుట తటస్థించును. వారు మనశిబికలం గాంచి నంతనే మనల వెన్నాడుదురు. వెంటనే మనము వెనుదిరిగి యిక్కడి కాటు

మైళ్లదూరంబున నుండు నొక్కకొండచఱియయందు దాగియుండుదము. శత్రువుల కిచ్చటివనమార్గంబులు చక్కఁగఁ దెలియమిం జేసి వా రీరాత్రి కిచ్చట విడియుట నిశ్చయము. రాత్రి వారు నిదురించినపిమ్మట మనము వారిశిబిరంబులఁ బ్రవేశించి, గుఱ్ఱంబుల నానిదురించు వారిపైఁ దఱిమి, తగినయాయుధములతో వారినిఁ జక్కాడిన విజయము చేకూరును. ఈయరణ్యప్రదేశములు మనము చక్కగ నెఱింగినవగుటచే రాత్రికాలమైనను మాకంత కష్టముగ నుండదు.”

ఇట్లు ప్రేమాబాయి నుడివిన వెంటనే రాజపుత్రు లాపూర్గమే మంచిదని యెంచి యామె తెలివితేటలకు, యుక్తాయుక్త పరిజ్ఞానమునకు నచ్చెరువందిరి. భీమసింగుకూడ నామె నెక్కువగ శ్లాఘించెను.

తత్క్షణమే ప్రేమాబాయినుడివిన విధంబున రాణియు నంబాలికయు, రాకొమరుఁడును, ననుచరవర్గంబును, నిభరాజంబుల నెక్కి బానసునదీతీరారణ్యమార్గంబులఁ గెల్వాకోటకుఁ బ్రయాణమునల్పిరి. రాణియు నంబాలికయు రాకొమరుఁడును నొక్కభద్రదంతావళంబు నెక్కి యరుగుచుండిరి. దాని చుట్టును రాణి యంగరక్షకదళము నడుచుచుండెను. జెట్టాప్రభువు మూఁడు వందల యోధాగ్రేసరులఁగొని రాణీసంరక్షణార్థమై బయలుదేరెను. ప్రథమ సందర్శనంబుననే తనమనంబు నాకర్షించికొనిపోయిన యంబాలికాదివ్యమూర్తి వెడలినదిక్కునకే చూచుచు భీమసింగు నిలిచియుండెను. పోవునప్పు డంబాలిక తనభావగర్భితంబులగు దృక్కులతోడనే భీమసింగుయొక్క సెలవుఁ గొనెను. అప్పుడు భీమసింగుహృదయాకాశమున నంబాలికాదివ్యమంగళవిగ్రహము మెఱుంగుతెఱగున నొక్కపరి మెఱసెను. ఆ సమయమున నిర్విణ్ణుఁడై నిలిచియుండిన భీమసింగును వెనుకనుండి యెవ్వరో సంబోధించినట్లయ్యెను. వెంటనే యాతఁడు వెనుదిరిగిచూడ ప్రేమాబాయిసుందరమూర్తి యాతనియెదుట సాక్షాత్కరించెను. అప్పు డామె నవ్వుచు “ఆర్యా! నిర్విణ్ణ

చిత్తులై యుండుటకుఁ గతం బెద్ది? ఇట్టిసమయములఁ గాలవిలంబనము సేయఁ దగునా? అటుచూడుఁడు. సూర్యుఁ డపరాద్రిఁ జేరఁబోవుచున్నాఁడు. ఇఁక మూఁడుగంటలకాలమునకంటెఁ బ్రొద్దెక్కువలేదు. ఇంతలో మన ప్రయత్నము లెల్లను జరగవలయును. ఆలసింపకుఁడు.” అనియెను.

భీమసింగు:— —కన్యకామణీ! నీవివేక మేమని వర్ణింతును? నీవంటి వీరవనితా లలామలకు జన్మభూమియైన యీరాజపుత్రస్థానసౌభాగ్యం బేమని కొనియాడుదు? ఇదిగో, నీహితవుమేరకే కార్యంబుల నెఱవేర్చెద.

అని యామెను గొనియాడి, సమస్తరాజపుత్రులను రావించి నాఁటి రాత్రికిఁ దాము చేయఁదలఁచుకొన్నవిషయ మామూలాగ్ర మెఱిఁగించి యెల్ల రప్రమత్తులై వారివారినియమితకార్యంబులఁ జక్కఁగ నెఱవేర్చులాగున భీమసింగు కట్టడ చేసెను. రాజపుత్రులెల్ల రుత్సాహవంతులై యుండిరి.

తత్క్షణమే యారాజపుత్రులయాశ్వికదళము భీమసింగు నాజ్ఞమేరకు శిబికలసహితంబుగ నాగిరికిఁ దూర్పుభాగంబుగఁ బ్రయాణంబు గావించెను. చాలదూరమున నిరువు రాశ్వికులు ప్రయాణము సేయుచుండిరి. దూరదర్శన యంత్రములసాయంబున వారు విరోధులజాడలను గనుఁగొనుచుండిరి. కొంత తడవునిలిచి చుట్టును దిరిగిచూచి మఱికొంత సేపటిలో నదృశ్యులైరి. వారు తప్పక రాజపుత్రదళమును, శిబికలసహితముగఁ జూచియుందురు కాఁబోలు. ఇంతలో రాజపుత్రగూఢచారుఁ డొకఁడువచ్చి మొగలు సైన్యములు తమకుఁ జాలసమీపమున నున్నవని భీమసింగునకుఁ దెల్పెను. భీమసింగు తమయుక్తి నెఱవేఱునని సంతోషించెను.

వెంటనే రాజపుత్రులు శిఖరాగ్రంబుననుండి, డిగి కొంతదక్షిణంబుగఁ బ్రయాణంబుఁ జేసి చీకటియగునప్పటికిఁ బ్రేమాబాయిచెప్పిన కొండచఱియను జేరిరి. విరోధివర్గముల జాడల నరయుటకును, మీఁదుమిక్కిలి యఫ్జుల్ ఖానునకు రాజపుత్రు లాప్రదేశముల నున్నారను నమ్మికగల్గించుటకును, సీమాన్‌బిజోలి ప్రభువులు కొంతసైన్యముతో నప్పుడప్పుడు మొగలులపైఁ

బడుచు, మఱలఁ దటాలున వెనుదిరుగుచుండిరి. ఆచిన్నదొమ్మికి నిరుపార్శ్వములందును, నల్పసంఖ్యాకులగు సైనికులు మృతినొందిరి. ఇంతలో సూర్యుం డస్తాద్రిశిఖరప్రదేశంబున సంచరించుచుండి జరాభారంబునఁ గాలుజారి పశ్చిమాంబుధిఁబడి మునింగెనో యన నస్తమించెను.

రాత్రి సమీపించుటచేతను, దమ కాయరణ్యమార్గములు చక్కఁగఁ దెలియకపోవుటచేతను, నాఁటిరాత్రి కచ్చోటునే నిలిచి ప్రొద్దుపొడుచునంతనే వైరిజనుల వెన్నాడివచ్చునని తలఁచి యఫ్‌జల్‌ఖాఁ నచ్చోటనే శిబిరములు వేయుట కనుజ్ఞయిడెను. కొంతసేపటిలో నొకవిశాలప్రదేశమున శిబిరములు వేయఁబడియెను. రాజపుత్రులయదృష్టవశమున వారు పోవుచుండినచోటి కొకమైలుదూరమున మొగలుసేనలు విడిసెను. రాజపుత్రులు తమ్ము వెన్నంటించుచున్నారని వారణుమాత్రమైనఁ దలంపలేదు. తమసైన్యం బెక్కుడుగ నుండుటచే నఫ్‌జుల్‌ఖాను రాజపుత్రులకు భయపడుటలేదు. వారి సైన్యమును జయించి అంబాలికను గొనిపోవుట కాతఁడు కృతనిశ్చయుఁడైయుండెను. నాఁటిదినము గాంచినయందలములలో నంబరురాజపుత్రిక యున్నదని నమ్మియుండెను, కాన దనకోర్కె నెఱవేఱును గదాయని యూహఁ దుబ్బిల్లుచుండెను.

చాలదూరము ప్రయాణము చేసియుండుటచేత మొగలులు తమ యశ్వసహితంబుగ నలసియుండిరి. వారు తమగుఱ్ఱంబులను సమీపంబున గల్గు సెలయేటినీటిని ద్రావించి మేఁతవిడి శిబిరంబులచుట్టును గట్టివైచిరి. శిబిరములచుట్టు నక్కడక్కడ నగ్నిజ్వాలలు ప్రజ్వరిల్లుచుండెను. ఆయగ్ని జ్వాలలప్రభలచే శిబిరములందలి తిమిరము మాయమయ్యెను. కొంతసేపటికి వారు కడుపారభుజించిరి. భోజనానంతరము ద్రాక్షారస పానందమున గ్రోలిరి. పానమత్తతచేఁ బ్రపంచమును మఱచిరి. కన్నుమిన్ను గానక హిందువులను వారిదైవములను, దూఱుచుండిరి. తెల్లవాఱఁగనే వన్యమృగంబులవేఁటాడి చంపురీతి, హిందువులను గదనరంగమునఁ జంప నిశ్చయించుకొనిరి. మద్యపాన

భీమసింగా మెవాక్యంబు లాలించి విస్మయంబున నిట్లనియె. "కన్యకా రత్నమా! అనేకసంగ్రామంబులం దారితేరినవీరాగ్రేసరులుండ నొక్కయబలా రత్నంబు నిట్టికార్యంబులకుఁ బంపు టేటి న్యాయ్యము? విన్నవా రెవ్వరైన నేమందురు? ఎట్టివాఁడైన నిట్టిపని కిచ్చగించునా? దైవప్రతికూలంబున నీకెట్టివిపత్తైనసంభవించిన నీతండ్రి కేనేమని వచింతును? ఏమొగముపెట్టుకొని యాతనిఁ జూడఁగలను! వీరాధివీరులని బిరుదములందిన మేటిపోటుమగలుండ నొక్కకాంతారత్నంబు నిట్టియపాయకార్యంబులకుఁ బంపుట రాజనీతిగర్హితము. కాన నీవు వెడలఁగూడదు. నే నిక్కార్య మాచరించెద" నని, యాతఁడు చెప్పఁబోవుచుండఁ బ్రేమాబాయి చిఱునవ్వున నాతనితో మఱల నిట్లనియెను. "రాజకుమారా! మీరు పొరపడితిరి. నా కేలాటివిపత్తును గలుగదు. విరోధులకు మనజాడ లిసుమంతయైనఁ దెలియఁగూడదు. తెలిసిన మన ప్రయత్నములన్నియుఁ విఫలంబులగు. యోధాగ్రేసరుండగు వీరుండొక్కరుండుమాత్రము, నాతో రానిండు. మేమిరువురము వెడలి సర్వమును నిగ్రహింతుము. విరోధిశిబిరంబుల గలవలము సంభవింపఁగనే మీ రతిరయంబున వచ్చి వారిపైఁ బడుఁడు. అతిజాగరూకులై యుండుఁడు. నామాటల సంశయములు కల్గింపకుఁడు."

తుద కందఱు నామెవచనంబుల కియ్యకొనిరి. ప్రేమాబాయి యొక నిశితకరవాలంబు కేలంగొని, కృపాణపాణియై యొక్కవీరుండు వెంటరా విరోధులపాలిటి మృత్యుదేవతచందంబున నాభయంకరనిశాసమయంబున శత్రు శిబిరములవెలింగెడు, నగ్నిజ్వాలలు గుఱుతుగ నిడికొని నిశ్శబ్దముగఁ బోవుచుండెను. వైరిపరివృఢులు గాఢాంధకారమున వారియాగమనం బెఱయఁ జాలకుండిరి. కావలివారల నేమఱించుటకు గా నావీరకాంత సృగాలంబఱచిన విధంబున నఱవ, వారది నిజంబుగ జంబుకారావంబని మదిందలంచి యుపేక్షక నొక్కపాషాణంబుపైవ, ప్రేమాబాయి యతిలాఘవంబున నాప్రేటుఁ దప్పించు

కొని, ప్రేటుదిని బాధపడు జిత్తులమారిమేకంబుచందంబునఁ గూయ, వారది నిక్కంబుగ నక్కయే యని తలంచి నిశ్శంకితులై కావలిగాయుచుండిరి.

భటసమేతయై నిశ్శబ్దముగ నామెయు శిబిరములను సమీపించెను. శిబిరములను సమీపింపఁగనే యారాజపుత్రవీరుఁడు తనసూక్ష్మదృష్టితో వేఁగుఱ్ఱములుమాత్ర మచ్చటఁ గట్టఁబడియుండినట్లును, తక్కినగుఱ్ఱములు మఱొక్కచోటున నుండినట్లును, నూహించెను. వారికొకటిరెండుబారలదూరమున నొక కావలిగాయువాఁడు గుఱకలిడుచు నిదురించుచుండెను. మఱియొకఁడుచాల దూరమునగస్తు తిరుగుచుండెను. మొదట నానిదురించువానిఁగిక్కురుమనకుండ యమసదనంబున కనిపి, రెండవవాఁడు సమీపింపఁగనే వానిపైకుఱికి యంత మొందింతుననియుఁ, దర్వాత గుఱ్ఱంబులవిడిచి, తఱుమవచ్చుననియున్న నారాజపుత్రుఁడు ప్రేమాబాయికి సంజ్ఞారూపంబున నాయుక్తి వెలుతురుఁగోఁ దెలియఁజేసెను.

వెంటనే నిదురించువానికడ కేఁగి కత్తుకనొత్తి నిశ్శబ్దముగ వానినిఁ జంపెను. మఱికొంత సేపటికి కాకావలిగాయువాఁడు పరుండియుండిన భటుని సమీపించి, కనులు మూతలుపడుచుండ, "అరే! అరే! భాయ్! అబ్దుల్ ఖాఁ! జల్దీ ఉఠో రే - ఉఠో రే - కావలికీ నీవంతూవచ్చింది. నాకు నిద్రాకొట్టొక్క నీ వస్తూందిభై - అచ్ఛే! ఏమ్నిద్ర! ఏమ్నిద్ర! భై - కన్నుల్ మూతల్ బడుతుండాయ్. తిరిగీ తిరిగీ అలసీపోయీ యుండాఁ - జెల్దీఉఠో శే-అరేఅల్లా-శే అల్లా-నీకు యేమ్నిద్రాభై-ఎంతకొట్టుకొన్నా లేయవ్." అని యఱచుచు వాని దేహమును దట్టుచుండఁ దటాలున నారాజపుత్రుఁడు కరిపై లంఘించుసింహంబుపగిది నాతురుష్కునిసమీపించి నిమిషమాత్రంబున వానికంఠంబును దనకుఠారంబున నఱికివైచెను. తత్క్షణమే వారిరువురు గుఱ్ఱంబులఁ బగ్గంబుల నుండి వదల్చి గాఢనిద్రాసక్తులైయున్న మొగలుసైనికులపైఁ బఱపిరి. ఆ హయంబులు భయంబునఁ జెలరేఁగి యథాయథలై యానిదురించువారి

ద్రొక్కుచు నకిలించుచు, దిక్కుతోఁపక పరుగిడఁదొడఁగెను. ఇట్టి బల గొప్పగందరగోళము జనించెను.

"అరే! అల్లా! హిందియేమ! దేహం నల్గిపోయ్యేట్టుగా [illegible] డాయ్." అని యఱచుచు లేచిపార్చుండఁబోయి నిద్రమైకముచే [illegible] మూఁతలుపడుచుండ మఱలఁ దూఁగువారు కొందఱును, "అరే! అరే! [illegible] హాచ్చర్యం! కాఫర్ బడవాల్ పైనబడేట్టుగా వున్నది. అగ్గే [illegible], [illegible] అరేరహీం ఉఠో, ఉఠో" యని మేల్కొని [illegible] సంభ్రమంబులతోఁ దోడివారిని లేపువారు కొందఱును, "మారో, మారో, కాఫరు లుచ్చాలుపైఁబడినారు" అని యాసిధిసమయంబున [illegible] యాయుధంబుల ధరియింపఁబోవువారు కొందఱును, "అరే అల్లా! అరే అల్లా! హిందేమిగ్రహచారం-నాభరోడాంకే కనబడలేదు" అని [illegible] వారు కొందఱును, "అరేఖాసిమ్, అరే కలందర్, అరేమామా[illegible], [illegible]" యని మఱల పరుండిన వారిని లేపువారు కొందఱునై, మొగలాయీలు [illegible] తయ్యుఁ జెల్లాచెదరై దిక్కుతెలియక పరుగిడుసమయంబున రాజపుత్రులు [illegible] నాదములఁ జేయుచు నిరుపార్శ్వంబులనుండి వారి నాక్రమించిరి.

రాజపుత్రులకృపాణములను మొగలులశిరములు [illegible]. అంతలో నఫ్జుల్‌ఖాను చెదరిన కొంతసైన్యమును ప్రోగుచేసికొని రాజపుత్రులను దాఁకెను. పోరు కొంతవఱకు తీవ్రముగ జరిగెను. కాని మహమ్మదీయులు కచ్చటిప్రదేశములు చక్కఁగఁ దెలియకపోవుటచేతను, రాజపుత్రులు [illegible]త్తుగ నిద్రించుచుండిన తమపైఁ బడుటచేతను, వారు సంపూర్ణముగ [illegible] పోవలసివచ్చెను. మొగలాయిసైనికులు చాలమంది నశించిరి. దిక్కు [illegible] ప్రాణములరక్షించుకొనుటకై పలువురు పలుదెసలఁ బరుగెత్తిరి. నిర్భాగ్యముగఁ బ్రాణములఁ గోల్పోవ నిష్టములేని యఫ్జుల్‌ఖానుసహితము, హతశేషులగు మొగలులతోఁగూడి పాఱిపోయెను. నాఁటియుద్ధమున సంపూర్ణ విజయలక్ష్మి రాజపుత్రులను వరించెను.

# ఏడవ ప్రకరణము

## ఏకలింగేశ్వరుఁడు

ఒకనాఁటి ప్రాతఃకాలమున నుదయపురమునం దొక్క వీథియందు రాజపుత్రుఁడొకఁ డతిత్వరితంబున నడచిపోవుచుండెను. అప్పుడప్పుడె జనులు నిద్రఁజాలించి లేచుచుండిరి. అక్కడక్కడ పరిచారికలుమాత్రము గృహాంగణములఁబరిశుభ్రముఁ గావించుచుండిరి. వీథులందింకను జనులు సంచరించుటలేదు. మనపురుషుఁడుమాత్రము వేగంబున వీథున్నియందుఁ గడచిపోవుచుండెను. అట్లతఁడు వోవుచుండ, వెనుకనుండి యతనికి భుజముపై నెవ్వరో చేయివైచినట్లయ్యెను. తటాలున నాతఁడు వెనుదిరిగి చూడ నాయూతనవ్యక్తి చిఱునవ్వుతో నాతనియెదుట నిలచెను. అప్పుడు వా రీవిధమున మాటాడిరి.

నూత:—జగత్ సింహా! కుశలమా?

జగత్:—ఓహో! అమరసింహా! నీవా? నేను సుఖిసము. నీవిన్నిదినములు గ్రామాంతరంబుల నేమిచేయుచుంటివి? ఏపెట్లయిన నేమి? మంచిసమయమునకే వచ్చితివి.

అమర:—మిత్రమా! కొన్నితొందరకార్యము లుండుటచే నిన్నిదినము లుండ వలసివచ్చెను. గతరాత్రియే యూరుచేరితిని. చాల నలసివచ్చుటచే నప్పుడే నీయొద్దకు రానైతిని. పొదలకడనే నీయొద్దకువచ్చుచుండ నిన్ని చూచ్చెటఁ గాంచితిని.

జగత్:—చెలికాఁడా! నీప్రేమవాత్సల్యంబుల కేనెంతయుఁ గృతజ్ఞుఁడ.

అమర:—నీవింతత్వరితంబుగ నెక్కడకుఁ బోవుచుంటివి? ఉదయనగరము నందలి విశేషములెవ్వి?

జగత్:—విశేషములకేమి? కావలసి నన్నియున్నవి. నేడు గొప్పయుత్స వము జరుగులాగున మహారాణాగారు చాటింపఁజేసియున్నారు.

అమర:—చాలమంచిది.

జగత్:—మఱియొకముఖ్యవిషయముగూడఁగలదు.

అమర:—అదియెద్ది?

జగత్:—రాణారాజసింహుఁడు తనకులదైవంబగు నేకలింగేశ్వరు దర్శింప సర్వరాజపుత్రసమేతుఁడై పోవ సమకట్టియున్నాఁడు.

అమర:—ఎప్పుడు వెళ్లఁదలఁచియున్నాఁడు?

జగత్:—నేఁడే. ఉత్సవభారమంతయు భీమసింగుపై నుంపఁబడినది. రాకొమరుఁడు తనకు సహాయార్థము నన్నురమ్మని యాజ్ఞాపించుటచే నేఁ డింత వేఁకువఁ బోవుచున్నాను.

అమర:—అటులైనపొమ్ము. తర్వాత నేనుగూడ నిన్ను గలిసికొందును. అని యమరసింహుఁడు గృహాభిముఖుఁడై చనియెను. జగత్‌సింహుఁడు రాజమార్గంబున నెడలెను.

నాఁటి యుత్సవమునకు నుత్తరదిగ్భాగంబుననున్న సామంతులు దప్పఁ దక్కిన రాజపుత్రవీరులెల్లరును దమతమ యనుచరవర్గసమేతులై వచ్చియుండిరి. ఉదయనగరమంతయు సర్వశోభాయమానముగ నలంకరింపబడియుండెను. ప్రతిగృహమందును సర్వేశ్వరుండును, భక్తజనకల్పద్రుమంబును నగు నాయుమాకాంతు నర్చించిరి. ప్రతివీథియందును నూరేగింపులు జరుగుచుండెను. మంగళనాదములు రోదసీకుహరమెల్ల నిండి ప్రతిధ్వను లొసంగుచుండెను. పురజను లెల్లరును, సర్వాలంకారభూషితులై విరాజల్లుచుండిరి. అప్పటి యాపురరామణీయకంబుఁ దిలకింప, విశ్వకర్మ దిక్పతులపురశ్రేష్ఠంబుల సౌందర్యసౌభాగ్యంబుల కెనయగునట్టి పురం బొండు భూలోకంబున గల్పించెనా? యని తోఁచకమానదు.

తనకులదైవంబును; భక్తజనసులభుండును, మృత్యుంజయుండు నగు నాగిరిజాపతిఁ బూజింప నుదయనగరంబునకుఁ బదిరెండుమైళ్లదూరంబుననుండు నేకలింగేశ్వరాలయంబునకుఁ బోవుటకై రాజసింహుఁడు సంసిద్ధుఁ డయ్యెను. సామంతులు నుద్యోగులు మొదలగువా రందఱు రాచనగరుసింహద్వారంబున సంసిద్ధులై యుండిరి. దాదా పెనిమిదిగంటలగుసరికి రాజసింహుఁడు పుత్త్రపరివృతుండై బయటికివిచ్చేసెను. వర్షాకాలజలధరకాంతి విడంబించు మేనికాంతి కలిగి కుంభస్థలసంగతంబులైన మౌక్తికమణిమరీచిజాలంబులు క్రొక్కారు మెఱుంగుల తెఱంగున విరాజిల్ల మురువుఁగొల్పు భద్రగజంబుపై నతిరమ్యంబుగఁ గట్టబడిన యంబారియందు రాజసింహుఁడు యువరాజసమేతుఁడై కూర్చుండెను. భేరీమురజకాహళశంఖారవంబులు మిన్నుముట్ట, వందిమాగధవైతాళికాదిజనంబులు వినుతించుచుండ, గవివరులు రాజసింగు, జయసింగు, భీమసింగు, మొదలగు వీరపుంగవులయొక్కయుఁ, బ్రేమాబాయి మొదలగు వీరవనితారత్నంబులయొక్కయు, బలధైర్యసాహసాదు లుగ్గడించుచుండ, గాయకులు తమగాంధర్వవిద్యాకౌశలంబు మెఱయఁ బాడుచుండ, మకరాంకు మోహనాస్త్రంబులో యన నొప్పారు వారాంగనాజనంబులు భరతశాస్త్రవిద్యావైపుణ్యంబులు వెలయ నృత్యగీతాదులఁ బ్రేక్షకులమనంబులు దొంగిలించుచు ముందు నడువ, రాజపుత్త్రవంశాబ్ధిసోములగు మేవారురాజపుత్త్రులం పదునాల్గు రనుచరవర్గసమేతులై వాజులనెక్కి ధరణి కంపింప వెన్నంటి నడవ, వస్త్రమాల్యానులేపన భూషణాద్యలంకృతులై పౌరజనులు గొలిచిరాఁగ, గగనతలంబు నిర్గమించి భూతలంబునఁ జరింపవచ్చిన చంద్రరేఖల పోలుపున శృంగారవతులై ప్రకాశించు పుణ్యాంగనాజనంబు లున్నతప్రాసాదంబు లెక్కి పుష్పసంయుతంబులగు సేసలుచల్లుచుండ, నమరవల్లభుని వైభవం బుపహసించు వైభవంబున నమ్మనుజవల్లభుం డుదయనగరంబు కోటవెల్వడి యేకలింగేశ్వరాలయ మార్గంబునం జనియెను.

ప్రేమాగ్రణి—

యూరేఁగింపునకై వలసిన కార్యభారమంతయు భీమసింగుపై నుంపఁబడియెను. ఆరాకొమరుఁడు నేఁడు సర్వమండనమండితుండై వజ్రాయుధంబనెడి యనుంగు గుఱ్ఱంబునెక్కి ముందువెనుక లరయుచు సమ్మర్దమున నెట్టికలఁతలు లేకుండునట్లు చూచుచుండెను. భీమసింగు చెలికాఁడగు జగత్సింగును నొక్కవాహనం బారోహించి, రాకొమరునకు సహాయుఁడై తనకు విధింపఁబడిన కార్యముల నప్రమత్తతతో నెఱవేర్చుచుండెను. అప్పుడప్పుడు జయసింగు పైనుండి తమ్మునకుఁ దనకనుసన్నలచేఁ జేయవలసిన కార్యములను దెల్పుచుండెను.

జనులందఱు ప్రేమాబాయి భీమసింగుల కులశీలరూపయౌవనగుణగణంబులఁ బట్టిచూడ వారొకరికొకరు తీసిపోవువారు కారనియును, వారిరువురును వివాహమాడిన గౌరీశంకరులవలెను లక్ష్మీనారాయణులవలెను, రతీమన్మథులవలె నుందురనియు ననుకొనఁజొచ్చిరి. గడచినరాత్రి యుద్ధమున ప్రేమాబాయిచూపిన ధైర్యసాహసంబులు విన్నదాదిగా నెల్ల రామె నెక్కుడు ప్రేమగౌరవంబులఁ జూచుచువచ్చిరి. ప్రజలాడుకొను వాక్యములు భీమసింగున కణుమాత్రమైన రుచించుటలేదు.

ప్రథమసందర్శనముననే తనమనంబు దొంగిలించుకొనిపోయిన యంబాలికామూర్తి యాతనికిఁ బొడగట్టుచుండెను. తనప్రేమసామ్రాజ్యసింహాసన మలంకరించిన యాపువుబోఁడి నాతఁడెట్లు మఱచును? తననిర్మలహృత్ఫలకంబునఁ బదిలంబుగఁ జిత్రింపఁబడిన యంబాలికాపవిత్రమూర్తి నాతఁడెట్లు తుడిచివేయఁగలఁడు? ఆశృంగారము! ఆకోమలత్వము, ఆహసన్ముఖము నాఁ డామె తనవంకఁ బఱపిన ప్రేమాపాంగవీక్షణజాలంబులు ఆతఁడు మఱవఁగలఁడా? ఆమె కెల్వాకోటకుఁబోవునపుడు, "ఆర్యపుత్రా! సెలవొసంగెదరా?" యనిన భావగర్భితంబులగు పల్కుల నాతఁ డెన్నటికిని మఱవఁజాలఁడు. ఆతఁడేదియో మిషగల్పించుకొని తనప్రేమసామ్రాజ్యలక్ష్మి

యగు సప్తమిరాత్రిని వీక్షింపఁ గెల్వాకోటకుఁ బోవఁ దలంచియుండెను. కాని యొక్కువ తొందఱపనులుండుటచే నాతఁ డుదయనగరంబుననే యుండవలసినవాఁడయ్యెను.

దాదాపు పదిగంటలగుసరికి వా రేకలింగేశ్వరాలయ సమీపవనంబుఁ జేరిరి. భీమసింగు జగత్సింగు లశ్వారూఢులై ముందుఁ జనుచుండిరి. కొంత సేపటికి నా రాలయ ద్వారంబుఁ జేరిరి. వెంటనే వారంద ఱశ్వంబులనుండి దిగిరి. భీమసింగు నానతిమెయి నా రాజపుత్రపరివారము, రెండుభాగములుగఁ జీలి సింహద్వారమున కిరుపార్శ్వముల బారులుదీరి నిలిచెను. రాణాయును యువరాజసహితుండై భద్రదంతావళంబునుండి దిగి మేవారు రాజపుత్ర ప్రభువులు వారివారిబిరుదములు ధరించి వెంటరా నాలయ ద్వారంబుఁ జొచ్చెను. రాణా తమ్ము సమీపింపఁగనే యిరుపార్శ్వములనుండు రాజపుత్రులు రాజసింహునకు వందనంబు లాచరించి "రాణారాజసింహునకు జే" యని జయజయధ్వనులఁ జేసిరి. ఇంతలో దీర్ఘకాయుండును గౌరవర్ణుండును వల్కలాజినధారియుం జటాలంకృతుండును దెల్లనివిభూతి నలఁదిన దేహముకల వాఁడును బురోహితుండును నగు హారితుండు రాణా కెదురుగ నేగుదెంచి సగౌరవంబున దీవించి లోనికిం గొనిపోయెను.

ఏకలింగేశ్వరాలయము జగద్విఖ్యాతిగన్న దేవళంబు. మహమ్మదీయుల కభేద్యమై సకలసంపదలచేఁ దులఁదూగు నప్పురాతనదేవస్థానము చుట్టును, గొండలే ప్రాకారంబులై విరాజిల్లుచుండెను. విశాలకాసారంబులతోడను, నదులతోడను, బచ్చికబయళ్లతోడను, నానావిధపుష్పలతాగృహంబుల తోడను, సహస్రకిరణు కిరణంబులకుఁ జొరనశక్యంబులగు తరుసమూహంబుల తోడను బ్రకృతికాంతావిలాసమై విలసిల్లు నొక్కకోనయం దప్పురాతన దేవాలయశ్రేష్ఠం బొప్పారుచుండెను.

నాఁ డద్దేవాలయం బతిశృంగారంబుగ నలంకరింపఁబడియుండెను. అనేకు లనేకవిధముల నాదేవదేవు నారాధించుచుండిరి. జడలుధరించి కౌపీన

ధారులై దేహంబులఁ జెల్లనివిభూతిరేఖలఁదీర్చి, వ్యాఘ్రాజినంబుల పీపుఁ ధరించి, దండకమండలంబులఁ జంకలనిడుకొని చేతులుజోడించి నిమీలిత నేత్రులై "హరహర, గౌరీశంకర, కైలాసపతే"యని యయ్యుమాపతి నామ సంకీర్తనంబుఁ జేయువారు కొందఱును, జటాజూటంబులెల్లఁ గిరీటంబులరీతిఁ జుట్టి యాపాదమస్తకము గాషాయవస్త్రముల ధరించి, విశాలఫాలంబులఁ విభూతి నలఁది, కంఠంబుల రుద్రాక్షమాలలధరించి, మృగచర్మంబులపై నాసీనులై నిమీలితలోచనులై మనంబెల్ల నాత్రిపురాంతకుమీఁదఁ జేర్చి యా మృత్యుంజయుఁ సంకీర్తనంబు సేయువారు కొందఱును, గోచులబిగించి యరిషడ్వర్గంబులజయించి, చిత్తంబులఁ బరబ్రహ్మంబునందు హత్తించి, యాహారంబుల వర్జించి పద్మాసనాద్యాసనాసీనులై యోగనిష్ఠాగరిష్ఠులై తపంబుసల్పు యోగిపుంగవులు కొందఱును, నీశ్వరభక్తులగు సామాన్యజనులు కొందఱును, దేవపూజకై సర్వము నాయత్తముసేయు భక్తులు కొందఱును, దమజీవంబుల నెల్ల నా యేకలింగేశ్వరాలయ సంరక్షణార్థమై వినియోగించుచు గుంపులు గుంపులఁగూడి యయ్యుమేశు నారాధించుసన్న్యాసులు కొందఱును నై దేవాలయంబునం దెల్లయెడల నిండియుండిరి. కడపటఁ జెప్పఁబడిన సన్న్యాసులు కన్ఫరజోగులని పిలువఁబడుచుండిరి. అప్పటికాలంబున మహమ్మదీయులు హిందువులదేవాలయంబులపై దాడివెడలినప్పుడు కన్ఫరజోగులు వారితోఁ దీవ్రముగఁ బోరు సల్పుచుండెడివారు.

రాజసింహుఁడు పుత్రామాత్యపరివృతుఁడై యర్చకులు ముందుఁబోవ సన్న్యాసులయాశీర్వాదంబులఁగొనుచు, ననేకదేవతావిగ్రహంబులఁ గాంచి మ్రొక్కుచు, యోగిపుంగవులఁగాంచి వందనంబు లాచరించుచు, రాతికంబంబులఁ జెక్కఁబడిన విగ్రహంబులఁ గాంచి పూర్వపుశిల్పివర్యుల నైపుణ్యాతిశయంబులఁ గొనియాడుచుఁ గొన్నిప్రాకారగోపురంబులుగడచి, చూపఱుల కనులు మిఱుమిట్లుగొలుపునట్లు దీపకళికలచే నతిరమ్యంబుగ నలంకరింపఁబడిన గర్భాలయముం బ్రవేశించెను. చంద్రకాంత శిలానిర్మితకుడ్యంబులచేతను,

దేవతావిగ్రహంబులతోడను, నొప్పుగర్భాలయము నేత్రరంజకంబై యుం డెను. ఏకలింగేశ్వరున కెదురుగ నందీశ్వరవిగ్రహం బొప్పారుచుండెను. ఈశ్వరునకుఁ గొంతదూరమున నొకప్రక్కన సర్వాభరణభూషితయై యొప్పారు లోకజననియగు పార్వతీప్రతిమ ప్రతిష్ఠింపఁబడి యుండెను. మఱి యొకవంక, వినాయకకుమారుల ప్రస్తరవిగ్రహంబులు నిలుపఁబడియుండెను. ఇంకొకయెడ ప్రమథగణంబు ప్రతిష్ఠింపఁబడి యుండెను.

రాణా సమంత్రకంబుగ నతిభక్తిః గుంకుమచందనాదులచేతను, బిల్వంబు మొదలుగాఁగల పత్రపుష్పంబులచేతను, నాపురారినిఁ బూజించెను. నృపాలశేఖరుని సమక్షమున నాశశాంకశేఖరసమర్చనకనుకూలముగ సహస్ర నామంబులును, నష్టోత్తరశతనామంబులును, దేవాలయార్చకులచే నుచ్చరింపఁ బడెను. రాణాయును శివలింగముపై దృష్టినిగిడ్చి యాతనివిచిత్రలీలలఁ దలఁచి తలఁచి, తలయూఁచి, క్షణమాత్రము వైరాగ్యభావంబున నేకద్విశ్వమును మఱచి, తదుపరి దెప్పిఱిలి, సాష్టాంగదండప్రణామంబుల నాచరించి, భక్తి తత్పరుఁడై నిలిచెను. తర్వాత ధూపదీపనైవేద్యంబులు సమర్పింపఁబడెను. మంగళహారతు లొసంగఁబడెను. అంతటితోఁ బూజ ముగిసెను. పిమ్మటఁ బుత్రా మాత్యసహితంబుగ నాదేవతామూర్తులకుఁ బ్రదక్షిణనమస్కారాదుల గావించి దేవాలయంబు వెడలివచ్చి మఱల భద్రగజంబు నారోహింపఁబోవ నర్చకులు సన్న్యాసులు మొదలగువారు రాణాను సమీపించి వినయంబునఁ గరంబులు మొగిడ్చి యిట్లని నుడివిరి.

"మహాప్రభూ! 'నావిష్ణుః పృథివీపతిః' యనునార్యోక్తి మేరకు రాజు దేవాంశసంభూతుఁడు. తనరాజ్యంబున వర్ణాశ్రమధర్మంబులఁ గాపాడుచు, శిష్టులరక్షించుచు, దుష్టులశిక్షించుచు, న్యాయ్యాన్యాయ్యంబుల నరయుచు, విప్రగోధనంబులకెల్ల నెట్టివిపత్తులు గలుగనీక ప్రజల బిడ్డలవలెఁ గాపాడుచు ధరాపాలనంబునలుపుట ప్రభువునకుఁ గర్తవ్యమైయున్నది. రాజులలోనెల్ల నేటిరాజవై వెలసి రాజసింహుఁడని సార్థకనామధేయంబు నొందితివి. తమ

పాలనంబునఁ బ్రజలెట్టికష్టములు లేక హాయిగ సుఖించుచున్నారు. కాని యిప్పుడిప్పుడు క్రొత్తవిపత్తులు సంప్రాప్తించుచున్నవి. ప్రస్తుతము ఢిల్లీచక్రవర్తిదుండగము లెక్కువయగుచున్నవి. ఆ క్రూరాత్ముఁడు, పవిత్రమగుహిందూమతమును నిరసించి హిందూదేవాలయముల నేలపాలుగావించుచు, విగ్రహములను, హిందూవనితలను జెఱచుచు, హిందువులను హింసించుచుఁ, బెట్టరానియిడుములఁ బెట్టుచున్నాఁడు. హిందువులను మహమ్మదీయమతమునఁ గలుప సమకట్టియున్నాఁడు. అదిగాక జిజియా యనెడిగొప్పపన్నును విధించియున్నాఁడు. పన్నీనివారిని క్రూరముగ దండించుచున్నాఁడు. అక్రూరకర్ముని దుండగములకుఁ దాళఁజాలకున్నాము.—ఇదిగాక క్రొత్తసమాచారమొకటి తెలియవచ్చినది. మధురాపురమునందలి రుక్మిణీమనోహరునాలయంబు నిర్మూలింప సమకట్టియున్నాఁడట.—మహాప్రభూ ! నీవె మాకు శరణ్యుండవు. మమ్మింతవఱకుఁ బ్రేమంబున రక్షించితివి. మాకష్టంబులఁబాప నిక్కంబుగ నీవె సమర్థుండవు. మీరిప్పు డుపేక్ష సేసినఁ జేటువాటిల్లు. ఎట్టులైన నా గోపికావల్లభుని యాలయంబు నుద్ధరింపవలయు."

ఆమాటలు విన్నరాజపుత్రు లుద్రేకంబునఁ గరంబులఁ గృపాణంబు లంటి నిజమతోద్ధరణకై ప్రాణంబుల నర్పింతుమని వీరాలాపంబులాడుచుండ రాణా, వారల నాపి "పూజ్యులగు భూసురులారా ! మీరు చింతిల్లఁబనిలేదు. గోభూసురద్వేషియగు వానియైశ్వర్యౌన్నత్యము లతిచంచలములని వేదంబులు ఘోషించు. బేబరు, అక్బరుసార్వభౌములచేఁ బవిత్రతవహించిన మొగలాయి సామ్రాజ్యమునకు వినాశకాలము దాపరించుటచేతనే రాఁబోవు విపత్తును సూచించు విపరీతబుద్ధి యీదుష్టునకుఁగలిగినది. కాని, ఆర్యులారా ! ఆతనిదుర్ణయంబుల భగవంతుఁడుమాత్ర మెన్నినాళ్లోర్వఁగలఁడు ? సమీపకాలములోనే తాను జేసినదుండగముల ఫలితాంశము ఢిల్లీపురీశ్వరుఁ డనుభవింపకమానఁడు. మీకెల్లర కెట్టియాపదలు లేక రక్షించుట కన్నివిధములఁ బ్రయత్నించెద. ఔరంగజేబు కయ్యంబునకుఁ గాలుదువ్వుచున్నాఁడని నే

నెఱుంగుదువు. అతఁడు రాజపుత్రులపరాక్రమాదుల నెఱుంగఁడు కాఁబోలు. ఇంతకుమున్నె యతని సేనాధిపతుల నోడించి తఱిమిన సంగతి మఱచియుండ నోపు. నాజ్యేష్ఠపుత్రుఁడు సైన్యంబుఁగొనిపోయి తురుష్కులఁ బారద్రోలి కృష్ణవిగ్రహంబును రక్షించి రాఁగలఁడు. మొదట మనము చక్రవర్తికి సామోపాయంబున మనకష్టములఁగూర్చి తెలుపుకొందము. అతఁడు వినకపోయినఁ దగురీతిఁ బ్రవర్తింతము. మీరు భయంబు దక్కియుండుఁడు. నా ద్వితీయపుత్రుఁడగు భీమసింగును, ఢిల్లీపురంబునకు రాయబారిగఁబుత్తెంచెద. మీకు భద్రంబయ్యెడు" నని పలికి దంతావళంబు నారోహించి సర్వపరివారయుతుండై నిజనగరమార్గంబునం బయలుదేరెను.



# ఎనిమిదవ ప్రకరణము.



## సంతోషవార్త

పూర్వకాలంబున మహమ్మదీయరాజన్యులదాడి కోర్వఁజాలక హిందూ రాజులు దుర్గమంబగుపర్వతశిఖరంబులపై శత్రుల కభేద్యమై విలసిల్లు కోటల నేర్పఱచుకొనియుండిరి. రిపువర్గదుర్గమంబై చరిత్రలందుఁ బ్రఖ్యాతిఁగాంచిన మేటిదుర్గములలోఁ గెల్వాకోట యొక్కటి. మహమ్మదీయులచేఁ దఱుమఁ బడినప్పు డుదయపురరాజు లాకోటయందు నివసించుచుండెడివారు. ఆదుర్గ రాజము హారావళీపర్వతపంక్తులందుఁ గుంభాల్ మరుప్రాంతారణ్యంబులఁ బ్రకాశించుచుండెను. ఆకోటపరిసరప్రదేశములు నానావిధతరులతా సమూహవిరాజితంబులగు వనంబులతోడను, లేఁబచ్చికబయళ్లతోడను, సారవంతంబులగు పొలంబులతోడనుఁ బొలంబులకు జలంబు లనవరతంబు కొఱంత లేక నొసంగు తటాకంబులతోడను, దట్టపు టడవులతోడను, వివిధఫలతరుతతి చేతను గమ్మనిఫలంబు లనవరతంబు మెసవి మృదుమధురగానంబులుసలుపు పక్షి గణంబుచేతను, వివిధజంతుసముదాయముచేతను నొప్పి నేత్రపర్వం బొనర్చుచుండెను. అక్కడక్కడ పల్లెల నేర్పఱచుకొని యడవిజాతివారు నివసించుచుండిరి. వారు రాజపుత్రులకు లోఁబడి కావలసినప్పుడు వారికి సాయము సేయుచుండిరి.

మనకథాకాలంబున నక్కోట వీరాగ్రేసరుండగు దుర్గాదాసునాధిపత్యంబున నుండెను. దుర్గాదా సౌరంగజేబునకుఁ బ్రక్కలోనిబల్లెమై యుండెను. దుర్గాదాసుపేరు విన్నంతమాత్రముననే చక్రవర్తి యమితభయ మందుచుండెడివాఁడు.

ఒకనాఁటియుదయమున నక్కోటయందలి రాజసౌధంబునం దొక్క విశాలపుగదియందుఁ జంద్రసన్నిభముఖి యొక్కతె యొకమృదుతల్పంబున నాసీనయై యేమియో మనంబున నాలోచించుచుండెను. ఆగది చక్కఁగ నలంకరింపఁబడియుండెను. అందందు చిత్రవిచిత్రంబులగు తెరలు వ్రేలాడుచుండెను. శృంగారరసంబు వెదచల్లు సుందరీలలామంబుల చిత్రంబులును, మోహనోద్దీపితంబులగు ప్రణయినీరమణులపటంబులును, తెల్లనిగోడలందు వ్రేలాడుచుండెను. ముందుభాగమున నొకనిలువుటద్దం బమర్పఁబడియుండెను. మఱియొకప్రక్కనఁ బుస్తకములబీరువ యొండుండెను. ఇంకొకయెడ నాబాలామణికై [illegible]ంచఁబడియుండెను. యోచింపనది యొకశయనాగారమైయుండును.

ఆనవమణిరత్నము చాలసేపు తనకెదురుగనున్న యాచిత్రపటమును దదేకధ్యానయై చూచుచుండెను. ఆపటమునందు రాధాకృష్ణులు ప్రేమంబున నొకరినొకరు గాఢముగ నాలింగన మొనర్చి యధరపీయూషపానంబు సేయుచుండినట్లును, రాధ తనప్రియునివంకఁ బ్రేమపూరితములగు నపాంగవీక్షణజాలంబుల బఱపుచుండినట్లును, శృంగారరసం బుట్టిపడ రమ్యంబుగఁ జిత్రింపఁబడియుండెను. తుద కామె యొకనిట్టూర్పుఁ బుచ్చి మనంబున పరిపరివిధంబులఁ బొగులుచుఁ దనకంచుకంబు మఱుఁగున దాచియుంచిన యొకచిన్న పటమును, బయటికిఁదీసి కన్నులకద్దుకొని ముద్దాడి యాపటమునందలి రూపమును దిలకించి "ఆహా! ఈపురుషపుంగవుని నే నేముహూర్తమునఁ గాంచితినోకాని యప్పటినుండియు నామనంబంతయు నాతని యధీనమయ్యెను.— ఇదేమి చోద్యము? ఎంతటిలో నీతఁడు నామనం బాకర్షించివైచెను! నన్ను గాంచి యితరకాంత లెంత యుపహాసింతురు? నామనం బేల పరిభ్రమించుచున్నది. మహారాణి నన్నెంత యాదరించుచున్నను నామనంబునకు శాంతి లేకున్నది. ప్రకృతము విచారించిచూడ నీదివ్యమంగళవిగ్రహమును, గనులారఁ

గాంచుచు నీతనిపవిత్రనామమును జపించుచుఁ గాలము గడపుటకన్న వేఱొండుశరణ్యము గానఁబడదు.—ఛీ! నే నెంతచపలను? పరపురుషునిఁ జూచినంతనే ప్రేమించితిని. అతఁ డొకవేళ నన్ను ప్రేమింప నంతట నేనేమి చేయఁగలదానను?—అతఁడు నిజముగ నన్నుఁ బ్రేమించెనా? దీని కుత్తరము నెవ్వా రెవ్వరు?—ఆనాఁ డాతఁడు నాదీనచరిత్రను విని దయాపూరితము లగు చూపులం జూడలేదా? ఆచూపులయాశయ మేమైయుండును? నిశ్చయ ముగ నన్నాతఁడు ప్రేమించియేయుండును.—ప్రథమావలోకనమున నే నా చిత్త మపహరించిన రసికశిఖామణి యీతఁడేకదా?—హా!మనమా! లేనిపోని యాశల నేల కల్పించుకొందువు? ఆసుభగుఁ జూచుమహాభాగ్యము నీకిఁక నబ్బునా?—(ధైర్యముతో) ఎటులైనఁగానిమ్ము. నా కాతఁడే మనోహరుఁడు. అతఁడు నన్నుఁ బ్రేమించినఁ బ్రేమించుఁగాక. లేనియెడల నిర్బంధించెద. పాదముల పైఁబడియెద. ప్రార్థించెద. నే నాతనిఁదప్ప నితరులఁ బ్రేమింపను. అతఁడు నన్ను నిరసించినను నే నాతని దివ్యమంగళవిగ్రహమునే మదినిల్పి ధ్యానించుచుఁ గాలము గడపుదానను.” అని యామె మనంబునఁ దలపోయు చుండ నడుగులచప్పుడు వినవచ్చెను.

పదముల చప్పుడువినగనే యామె తెప్పిఱిలి తనమతిభ్రమ నెవ్వ రైనఁ జూచిరేమో యని వెఱఁగంది, తటాలునఁ బ్రియునిచిత్రపటంబును దల్పంబునఁ దాచివైచెను. ఆలోచనలో మునింగియుండుటచేఁ నా మొగదితలు పులు మాయ మఱచియుండెను. ఇంతలో నొక్కసుందరాంగి మందగమనం బునఁ గవాటంబు గదల్పకయరుగుదెంచెను. దానిఁజూచి యాకాంతయేమియుఁ దెలియనిదాని రీతి నేదో యొకపటమువంకఁ జూచుచుండెను. అనూతన కోమలాంగియుం వెనుకభాగమున మెల్లగవెడలి యంబాలిక భుజముపైఁ జేయివైచి,” అమ్మా! అంబాలికా!” యని సంబోధించెను.

అంబా:—(ఆశ్చర్యము నటించుచు) నీవా! సఖీ! చంద్రరేఖా! ఎంత నిశ్శ బ్దముగవచ్చితివి? నాకుఁ నీరాకయే తెలియలేదే! కూర్చుండుము.

చంద్ర:—(ప్రక్కనఁగూర్చుండి) అమ్మా! అంబాలికా! మాబోఁటివారిరాక మీబోఁటివారి కగపడునా? ఈలోపల నీదర్శనమే యపురూపముగ నున్నది. నీవు నీసఖులతో మెలంగుటయే లేదు. నీవిషయ మప్పుడప్పుడు నీచెలికత్తె నడిగి తెలిసికొనుచుంటిమి. నీచిత్తమేమో మాలినట్లును, నీవెల్లప్పుడొంటరివై యాలోచించుచుందువనియును నామె తెలుపుచుండెను. నీవు మాకొఱకు రాకున్నను, మేము నీకొఱకు రావలయును గదమ్మా! రాకొమరితవుగావునఁ దగిన గంభీరమే యున్నది.

అంబా:— చంద్రరేఖా! నీవిట్టినిష్ఠురోక్తు లాడఁదగునా? నీవు నాకెంతయుఁ ప్రేమాస్పదురాలవు గదా? నిన్నిచ్చటఁ జూచినప్పటినుండియు, నీయందు సోదరీభావ మంకురించి నానాఁటి కభివృద్ధియైనది. ఈమూఁడు నాలుగు రోజులనుండి కొంచె మస్వస్థతగ నుండుటచే నిన్నుఁ జూడ రాలేదు అంతియెకాని వేఱుకాదు. కోపగించుకొనకుము.

చంద్ర:—కోపగించుకొనుట కేమున్నది? హాస్యమున కటులంటిని. అక్కా! నీవిషయము నాకుఁ దెలియదా? (చిఱునవ్వున) అక్కా! అంబాలికా! నిన్నొక్కవిషయ మడిగెదను. సదుత్తర మీయవలయును.

అంబా:—ఏదియో యడుగుము. తెలిసినంత వఱకు సదుత్తరము లిచ్చెదను.

చంద్ర:—అక్కా! దినదినమునకు నీవు కృశించిపోవుచున్నట్లు తోఁచుచున్నది. కారణమేమియో నాకిసుమంతయైనఁ దెలియరాకున్నది. నీకిందుఁ గొఱంత యణుమాత్రమైన లేదుగదా? చక్కఁగ నాలోచించిచూడ మనోవ్యాకుల మేదియో నిన్నుఁబీడించుచున్నట్లు దోఁచెడిని. సోదరీ! నీమనోవ్యాకులతకుఁ గారణం బెద్దియో వినిపింపుము. వీలున్నఁ దగిన సహాయ మొనర్చెదను.

అంబా:—చంద్రరేఖా! నీప్రేమ యపారము. నీవంటిస్నేహితురాలు లభించినందుల కేనెంతయు ధన్యను.

చంద్ర:—ఆమాట లటుండనిమ్ము. ప్రశమమున నీయస్వస్థతకుఁ గారణము దెల్పుము.

అంబా:—అస్వస్థత యేమియును లేదు—సంతోషము లేకున్నది.

చంద్ర:—ఆ! ఏమి! సంతోషము లేదా? నీపై రాణిగారికేమైన నసూయ జనించినదా? లేక తగినసౌఖ్యము లిందు లేవా?

అంబా:—రామ! రామ! రాణిగారి నిందింపవలదు. ఆమహారాణి తన కన్నకొమార్తెవలె పోషించుచున్నది. కొఱంతయే లేదు.

చంద్ర:—అయిన నీమనంబున సంతోషము లేకుండుటకుఁ గారణమేమి?

అంబా:—కారణమేమో నాకే తెలియకున్నది.

చంద్ర:—అదిగో! అబద్ధమాడుచున్నావు. నీమాటలను నేను నమ్మఁజాలను. నీబహిఃప్రాణమునగు నాతోనా యబద్ధమాడుట. కారణమేమియో తెల్పుము. అంతవఱకు నిన్ను విడుచుదానను గాను.

అంబా:—(కొంతసంకోచించుచు) సఖీ! నామనోదౌర్బల్యమును విని పరిహాసింతువేమో?

చంద్ర:—(చిఱునవ్వుతో) పరిహాసింపను లెమ్ము. కారణమేమో తెల్పుము?

అంబా:—చెలీ! నీయందు నాకుండు నపారప్రేమయే నన్నుఁ బ్రోత్సహించుటచే నీరహస్యమును దెలుపుచున్నాను. మొదట తలుపు బిగించిరమ్ము. తర్వాతఁ జెప్పెదను.

చంద్ర:—(తలుపువైచివచ్చి) నీ కారణమతిగోప్యమైనదని తలంచుచున్నాను. విన నువ్విళ్లూరుచుంటిని. సత్వరంబునఁ జెల్పుము

అంబా:—నే నీరహస్యమును దెల్పుటకుముందు నీవొక వాగ్దానమును జేయవలయును.

చంద్ర:—ఏమని?

అంబా:—నేఁజెప్పఁబోవువిషయ మితరులతోఁ జెల్పనని.

చంద్ర:—నాయూహా సరిపోయినది. సత్యముగ నితరులతోఁ జెప్పను లెమ్ము.

అంబా:—ఇంతియె చాలును. ఇంకఁ దెల్పెదను.

చంద్ర:—సత్వరముగఁ దెల్పుము.

అంబా:—(తల్పంబున దాచినపటముదీసి) చెలీ! చంద్రరేఖా! ఇదిగో! ఈపటమును జూడుము. నాయస్వస్థతకు నాసర్వస్వమునకు నిదియే కారణము.

చంద్ర:—(పటమును నిదానముగఁ బరిశీలించి, ఆశ్చర్యమున) ఆహా! సఖీ! తెలిసినది. కారణము, తెలిసినది. నీమనోభావములు కొంతవఱకుఁ దెలిసినవి. పాపము. నీవేమిచేయఁగలవు. (బాగుగఁ బరిశీలించి) సోదరీ! అంబాలికా! ఈపటమున లిఖింపఁబడినసుందరాకారుఁ డెవ్వఁడు? ఆహా! ఏమియందము ! ఏమిజవ్వనము ! రతీకాంతజయంతవసంతాదులంబోలు నీమోహనాంగునిఁజూచిన నెవ్వరు ప్రేమింపరు?

అంబా:—ఈతఁడే నాచిత్త మపహరించినచోరుఁడు.

చంద్ర:—(చిఱునవ్వున) సెబాస్! సెబాస్! అంబాలికా యెంతగట్టిదానవమ్మా. తగినవరునే వరింపగల్గితివి. ఇట్టిపురుషపుంగవుని కౌఁగిట సుఖింపఁగల్గిన నీవేధన్యవు. అమ్మ! ఈతఁ డేరాకొమరుఁడు?

అంబా:—ఉదయపురరాజకుమారుఁడు.

చంద్ర:—నీ విదివఱ కీతని నెన్నిసార్లు చూచియుంటివి?

అంబా:—ఒక్కమాఱుమాత్రము చూచియుంటిని.

చంద్ర:—ఎప్పుడు?

అంబా:—నేను మొదట రాణిగారిసమ్ముఖమునకు వచ్చినప్పుడు.

చంద్ర:—ఓహో ! అంబాలికా ! నీవెంతచతురవు. ప్రథమసందర్శనమునసే యాతనిచిత్తమునుగూడ నాకర్షించియుందువని తలంచెద.

అంబా:—చంద్రరేఖా! మఱల నీబుద్ధిఁ జూపుచున్నావే? నాబ్రతుకొక హాస్యమైనది. కానిమ్ము. నే నింకేమియుఁదెలుఁగను.

చంద్ర:—(చిఱునవ్వుతో) అక్కా! కోపగించుకొనెదవేల? ఇఁకముం దెన్నటికిని నిన్ను హాస్యముచేయను లెమ్ము. నీచిత్తచోరునినామధేయం బేమియో యెఱింగుదువా?

అంబా:—(సిగ్గున) భీ-మ-సిం-గని వింటిని.

చంద్ర:—ఆ! ఆ! ఏమేమి! ఈతఁడేనా భీమసింగు? మహారాణి యాతని బలధైర్యసాహససద్గుణంబు లప్పుడప్పుడుకొనియాడుచుండును. ఈసుభగుఁ గూర్చి వినియుంటినేగాని నేఁ డీతనిరూపమును గన్నులారఁ గాంచితిని. సోదరీ! విద్యావయోరూపగుణంబుల నీకెనయైనవరునే వరించితివి. సెబాస్-సెబాస్.

అంబా:—చెలీ! నీపరిహాసోక్తుల కేమిగాని వింతసమాచారంబు లేవైన నను్నఁ దెల్పుము.

చంద్ర:—వింతసమాచారము లేమున్నవి?—(కొంచె మాలోచించి) చెలీ! మఱచితిని. నీకు, సంతోషకాలము రానున్నదిసుమా!

అంబా:—ఏమేమి? నాకు సంతోషకాలమా? చంద్రరేఖా! ఇంక నిట్టి హాస్యములు చాలింపుము.—చెలీ! చెలీ! నా వామనేత్రం బదరు చున్నది.

చంద్ర:—అవునుమఱి. నేను చెప్పలేదా యేమి? నీకింక సంతోషకాలము. ఆవిషయమును దెలియఁజేసిన నానందపారావారంబున మునింగెదవని తోఁచెడిని.

అంబా:—ఊరక లేనియాశలఁ గల్పించెదవేల? ఇఁకఁ బరిహాసములాపికి సమాచార మెద్దియో తెల్పుము. లేకున్న నూరకుండుము.

చంద్ర:—అక్కా! కోపగించుకొనకుము. చెప్పెదను వినుము. నీవప్పుడు మమ్ము మఱచిపోదువని తలంచుచున్నాను.

అంబా:—చంద్రరేఖా! ఎందులకు నన్నిట్లు బాధింతువు? విషయమేమియో తెల్పుము.

చంద్ర:—నిశ్చయముగఁ దెల్పెదను. నీవు నాకందులకు బహుమతియేమి యొసంగెదవు ?

అంబా:—నీ కేదికావలయునన్న నది యిచ్చెదను.

చంద్ర:—(నవ్వుచు) అయిన నీముత్యాలహార మిమ్ము.

అంబా:—(హారమునుదీసి) ఇదిగో కైకొనుము.

చంద్ర:—(నవ్వుచు) నెచ్చెలీ ! నీప్రేమౌదార్యములు వర్ణనీయములు. నే నూరక యడిగితిని. హార మిదిగో నీవే ధరింపుము.

అంబా:—(చంద్రరేఖను కౌఁగిలించి) ఇప్పుడైనను సమాచారమును దెల్పుము.

చంద్ర:—(చిఱునవ్వున) నేను రాకపూర్వము నీ వెవనిఁగూర్చి తలంచు చుంటివి?

అంబా:—(కొంచెముసిగ్గున) నాకేమియుఁ దెలియదు. నీవే చెప్పుము.

చంద్ర:—(నవ్వుచు) ఓహో ! నీమనోహరునిఁ గూర్చియా ? పాపము ! ప్రియునిఁజూడ నెంత నువ్విళ్లూరుచుంటివో కదా ? రేపు నీ వాతని సుందరముఖారవిందంబు సందర్శింపఁగలవు.

అంబా:—(ఆశ్చర్యసంభ్రమంబుల) ఏమేమి ! చెలీ ! చెలీ ! నిశ్చయముగఁ దెల్పుచుంటివా ? లేక హాస్యమునకుఁ బలుకుచుంటివా !

చంద్ర:—నిశ్చయముగనే పల్కుచుంటిని. నీతో హాస్యమాడుదునా ?

అంబా:—(సంతోషమునఁ జంద్రరేఖను కౌఁగిలించుకొని) చెలీ ! చంద్రరేఖా ! ఆర్యపుత్రుఁ డిచ్చటి కెందుకొఱకు విచ్చేయుచున్నాఁడు ?

చంద్ర:—(చిఱునవ్వున) నిజమనోహారిణిని దర్శింప వచ్చుచుండెను గాబోలు.

అంబా:—(కొంచెము కోపమున) చంద్రరేఖా ! నీపరిహాసము నింకఁజాలింపుము.

చంద్ర:—నీకింతటి కోప మేలనమ్మా ?

అంబా:—నీ వెవ్వ రీసమాచారమును దెల్పిరమ్మా ? పాపము ! కల గంటివి కాఁబోలు.

చంద్ర:—అవునమ్మా. అవును. మామాట కలవలెనే యుండును. రేపు మీకే నిజమగును.

అంబా:—సోదరీ ! నిజమేనా ? నీకెట్లు తెలియును ?

చంద్ర:—నేఁటియుదయమున రాజపుత్రయోధుఁ డొకఁడు రాణిగారియొద్దకు వచ్చి "మహారాణీ! భీమసింగురాకొమరుఁడు రేపటుదయమున కిచ్చటికి రాఁగలఁడు. ఈసమాచారమునుముందుగ మీకెఱింగింప నన్నుఁ బంపినా ర"నిచెప్పుచుండవింటిని. రాకొమరునకుఁ దగురీతి స్వాగతంబొసంగుటకు నాతండ్రిగారు సర్వమును సిద్ధము చేసియున్నారు. రే పాయనయే యాతని కెదురేఁగి పిలుచుకొనివచ్చునఁట.

తనమనోహరుని యాగమనవార్త శ్రవణవీథిఁజొరఁగనే యంబాలిక పొందినయానంద మింతింతయని చెప్ప నలవి కాదు. చంద్రాగమనంబున నుబ్బు చకోరంబులభాతి నచ్చంచలాక్షి తనప్రియుని యాగమనంబున కుబుకు చుండెను. ఆకాంతారత్నము లిరువు రిట్లు మాటాడుచుండఁ దలుపుఁదట్టిన ట్లయ్యెను. తత్క్షణమే చంద్రరేఖ వెడలి తలుపుఁదీయ వృద్ధసేవకుఁ డొకఁడు లోనికరుదెంచి యాసుందరుల కిరువురకు వందనంబు లాచరించి "దేవులారా! రాణిగారు తమకై వేచియున్నారు. భోజనపువేళ యతిక్రమించుచున్నది. ఎంతసేపటికిని మీరు రాకుండుటచే మిమ్ముఁ దోడ్కొనిరమ్మని రాణిగారు నన్నుఁ బుత్తెంచిరి." అని నుడివెను. పాపము. వారు మాటలసందర్భములో నాఁకలియే మఱచిపోయియుండిరి. ప్రొద్దెంతయైనదియుం వారు గ్రహింపలేదు. వెంటనే వారు మాటలు సాగించి భోజనశాలకు వెడలిరి.

---

# తొమ్మిదవ ప్రకరణము



## స్వాగతము

మఱునాఁటియుదయమున రాకొమరునికిఁ దగురీతి స్వాగతం బొసంగుటకై సర్వము సిద్ధము చేయఁబడియుండెను. కోటలోని సౌధము లన్నియుఁ జక్కఁగ నలంకరింపఁబడియుండెను. ఉదయము తొమ్మిదిగంటలగునప్పటికి భీమసింగును గొనివచ్చుటకై దుర్గాధ్యక్షుండగు దుర్గాదాసు మితపరివారుఁడై కోట వెల్వడెను.

భీమసింగు కృతప్రయాణుండై హారావళీపర్వతపంక్తులం దుండు దుర్గమంబులగు మార్గంబులఁ జక్కఁగ బరిశీలించుచుఁ గాంతారవాసులతో సఖ్యంబు నెఱపుచు, సరోవరంబుల స్నానంబాడుచు, నదుల దాటుచు, విశాలతరుచ్ఛాయల విశ్రమించుచు, నరణ్యములందలి చిత్రములఁ దిలకించుచు, నియమితదినంబునకుఁ గెల్వాకోటఁ జేరెను. కోటకుఁ బాతికమైళ్ళ దూరమున భీమసింహుని యాగమనమునకై దుర్గాదాసు వేచియుండెను. కొంతసేపటికి భీమసింగనుచరసమేతుఁడై వారిని సమీపించెను. భీమసింగు దుర్గాదాసును గాంచి యాశ్చర్యము నొందెను. దుర్గాదాసు సాటిమనుగులకంటెఁ బొడగరి. ఆజానుబాహువులు బలిష్ఠకాయము విశాలమగు నురము నల్లని కనుబొమలు గంభీరదృష్టులు వీరపురుషోచితంబుగఁ ద్రిప్పఁబడిన నల్లనివంకరమీసంబులు గుండ్రని గడ్డము నాతని బలధైర్యసాహసతేజోవిశేషంబులఁ జాటుచుండెను. భీమసింగు దుర్గాదాసు నుపలక్షించుచు నిలిచియుండెను. దుర్గాదాసుగూడ భీమసింహుని నాపాదమస్తక ముపలక్షించి వీరపురుషలక్షణంబు లాతనియందుఁ గాంచి మనంబునఁ జాల సంతసించెను. రాకొమరునిఁ జూడగనే యాతనియెడ దుర్గాదాసున కొకవిధమైన ప్రేమ గౌరవంబు లంకురించెను.

ప్రేమాగ్రణి—నే

దుర్గాదాసు భీమసింగును సమీపించి, తనదక్షిణకరంబున నారాజ కొమరునికరంబుఁ గీలించి గంభీరస్వరంబున నిట్లనియె. "రాకొమారా! భీమసింహా! నే నిదివఱకు నీ కపరిచితుఁడ నైనను, నారాజ్ఞియాజ్ఞ మేరకు నేఁటి శుభముహూర్తంబున నీకు స్వాగతం బొసంగి పురంబునకుఁ గొనిపోవ వచ్చినాఁడను. నీముఖలక్షణంబుల నుపలక్షించి నీవు వీరుండవని యెఱింగితి. మహారాణియుం నీ బలధైర్యసాహసంబులఁగూర్చి యప్పుడప్పుడు నాతోఁ బ్రసంగించుచుండెడిది. నేఁడు నిన్నుఁ జూడఁగ నే రాణిగారివాక్యములందలి సత్యం బెఱింగితి. నేఁ డీశుభముహూర్తంబున నీతో సఖ్యం బొనర్చుచున్నాను. మన స్నేహలత దినదినాభివృద్ధియై మనజీవితాంతమువఱకు నుండుఁగాక!"

భీమసిం గావాక్యంబు లాలించి యాతని యాదరణంబునకు సంతసించి యిట్లనియె. "దుర్గాధ్యక్షా! నేను నీ కపరిచితుఁడ నైనను నమితప్రేమంబున గౌరవించి నాస్వాంతంబునకు ముదంబుఁ గూర్చితిరి. సఖ్యంబు గావించి బహూకరించితిరి. వీరాధివీరులగు మీ రల్పసత్వుండనగు నాయందుఁ జూపిన ప్రేమ కే నెంతయుఁ గృతజ్ఞుఁడ." అని వారిరువురు మాట లాడుకొనుచుఁ గోటయందుఁ బ్రవేశించి కొన్నివీథులం గడచి, సర్వాలంకారవిరాజితంబై యొప్పు రాజప్రాసాదంబు సమీపించిరి.

ఆసమయమున సమీపసౌధమందలి రెండవయంతస్తునుండి మధురగానం బొండు వారిశ్రవణముల కానం దమిడెను. భీమసింగు తటాలున నిలిచిపోయెను. ఆశ్చర్యసంభ్రమంబు లాతని నావరించెను. ఆప్రేమగీతమును వినను వినను నాతనిదేహ ముప్పొంగసాగెను. ఆనందలహరీవిలాసంబగు గానామృతంబున నాతనిమనంబు నాకర్షించినవ్యక్తి యెవ్వరైయుండునో కాని భీమసింగుచిత్తాకాశమున నంబాలికాదివ్యమంగళవిగ్రహ మొక్కపరి విద్యుల్లతపలె మెఱసెను. ఆకంఠధ్వని యంబాలికదియా? లేక మఱొక్కరిదియా? యని యతఁడు తలపోయఁ జొచ్చెను. తుద కాతఁ డది యంబాలిక స్వనంబై యుండునని నిర్ధారించుకొనియెను.

భీమసింగు తలంచినరీతి నది యంబాలిక కంతమే. అంబాలిక తన ప్రియునకు స్వాగతం బొసంగుటకై నిజకరకంజంబుల వీణియం గొని కరాంగుళులం దంత్రులు మీటుచు నావీణాస్వనంబున దనకంఠస్వనంబు మేళవించి ప్రేమామృతధారలం గురియుచున్న స్వాగతగీతం బొక్కటి పాడుచుండెను.

భీమసింగు తటాలున నిలిచిపోవుటను దుర్గాదాసు గాంచెను. వెంటనే భీమసింగు చిత్తవృత్తి యాతనికిం దెల్లం బయ్యెను. దుర్గాదాసు మెల్లన నవ్వుకొని మనంబున నిట్లు తలపోయం జొచ్చెను. "ఆహా! ప్రేమపాశ మెంత దృఢమైనది? ఎట్టిపేరాధివీరుండైనను ప్రేమపాశమునకుం జిక్కవలసినదే కదా!— ఇందుం దప్పేమున్నది? అంబాలికారూపసౌశీల్యాది గుణంబులం గాంచి ప్రేమింపని వా రుందురా? మఱియుం గులశీలరూపయౌవనాదుల వీరొకరికొకరు తగియున్నారు. వీరిప్రేమసాఫల్యమున కంతరాయము లున్నను, దేవుండు వారియనురాగమును వృద్ధిపఱచి కోర్కె నెఱవేర్పుం గాక!" పిమ్మట రాకొమరుని రాజకాంత లాదరంబున నాదరించిరి. దుర్గాదాసభీమసింగులు సౌధాంతరమును జేరిరి.

నాంటిదినము భోజనానంతరమున రాణియు నంబాలికాభీమసింహులు నుచితాసనంబుల నాసీనులై యుండిరి. అంబాలిక భీమసింగునకుం గొంచెము మఱుంగునం గూర్చుండి యుండెను. రాణీభీమసింగులు వివిధవిషయములనుం గూర్చి ముచ్చటించుచుండిరి. యుద్ధమునం బ్రేమాబాయి చూపినధైర్యసాహసంబుల గుఱించియుం, మహారాణా, పుత్రామాత్యబంధుపౌరజననివహంబుతో నేకలింగేశ్వరాలయంబునకుం బోయి యచ్చట నతిభక్తి నయ్యుమాపతి నర్చించి తిరిగివచ్చినదియు మొదలుగాం గలవిషయంబుల నెల్ల భీమసింగు రాణిగారి కెఱింగించెను. రాణియు నంబాలికయుం బ్రేమాబాయిసాహసాదుల విని యమితాశ్చర్యసంతోషములనొంది యామెను గొనియాడిరి.

పిమ్మటం గోమటదేవి నాండు మార్గంబునం దాముపడినకష్టములను గుఱించియు, నడవిజాతులవారు తమ్ము దోచుకొనుటకై రాంగా బెద్దాసైని

తులు వారితోఁబోరి తఱుముటయుం, ఘోరమృగారావంబుల కంబాలిక భయ పడుటయుం మొదలగు వృత్తాంతము లెల్ల భీమసింగునకుఁ జెప్పెను. మఱియుఁ నంబాలిక తనకుఁ జేఁదోడువాదోడుగ నుండి యెల్లవేళలఁ దనయాజ్ఞానువర్తినియై తన కెంతయుం ముదంబుగూర్చుచున్న దనియుం, నామెసద్గుణంబులఁగూర్చి భీమ సింగునకుఁ దెలియఁ బల్కెను. మహారాణి తన్ను బొగడుట విని యంబాలిక "దేవీ! నీ వనవరతము నన్ను నిజపుత్రిగఁ దలంచి మన్నించి యాదరించు చుండ నీయాజ్ఞానువర్తినినై నీకుఁ బ్రియంబు గూర్చుకంటె నా కితర మెద్ది యుండును? ఇంతమాత్రమునకే నన్ను నుతించుటకు నీకు నాయం దుండెడి యపార ప్రేమయే కారణమైయున్న" దని మనోహరకంఠంబునఁ బల్కెను.

భీమసింగామరాళగమనయొక్క మృదుమృణాలసదృశంబులగు బాహు లతికల గాఢాలింగనసౌఖ్యం బొనగూడు టెన్నఁడోగదా? యని తలంపఁ జొచ్చెను.

ఇటులనే కొన్ని దినములు గడచెను. అంబాలిక లజ్జాసంభ్రమంబులఁ గొంతవఱకువీడి యప్పుడప్పుడు భీమసింగుతోఁ గొంత ముచ్చటించుచుండెను.

---

# పదియవ ప్రకరణము



## ప్రేయసీప్రియులు

అది పూర్ణిమారాత్రి. ఆకసము మేఘపటలవిరహితంబై సజ్జనహృదయంబుచందంబున నిర్మలంబై కాంతియుక్తంబై విరాజిల్లుచుండెను. వజ్రకణములభాతి మిణుకుమిణుకుమని తారకాగణంబు లాయాకసమునఁ బ్రకాశించుచుండెను. అంధకారమృగంబు నణఁచు సాహసంబునఁ గాలకిరాతుం డెత్తిన చక్రాయుధంబోయనఁ గలువలఱేఁడు షోడశకళాపరిపూర్ణుఁడై ప్రియురాలమనంబుల వికసింపఁజేయుచు జారచోరభయంకరుండై యుదయాద్రిశిఖరంబునఁ బ్రకాశించుచుండెను. మనోహరమగు చంద్రబింబంబుఁగని చకోరగణంబు లుబ్బి పైకెగసెను. కలువలు వికసించెను. కళాప్రపూర్ణుండైన నగుఁగాక, క్షీరాబ్ధియనుంగుకొమరుఁడైన నగుఁగాక, కలువలచేడియముద్దుతమ్ముఁడైన నగుఁగాక, శివునిశిరోభూషణంబైన నగుఁగాక, మత్ప్రియుండగు ప్రభాకరునిఁదక్క నీ నిశాకరుముఖావలోకనంబైనఁ జేయఁజాలమని పద్మినీసమూహంబు మొగిడ్చెను. పవనుండు నిర్మలజలతరంగడోలికలఁ గొంతతడవుయ్యెలలూగి యలసి, సమీపపుష్పోద్యానంబులందలి లతాకాంతలచెంగటఁ గొంత విశ్రమించి, మకరందంబుల మనసారఁ గ్రోలి, మందగమనంబునఁ జరించుచుండెను. నాఁటిరేయి వెన్నెల సర్వజనమనోరంజకంబై యొప్పెను.

నాఁడు కెల్వాకోటయందు రాజప్రాసాదమున నొక్కసౌధోపరిభాగంబున వెన్నెలలో నమర్పఁబడియుండు నాసనంబున గాంభీర్యఖనియు సకలమానినీమనోహరమూర్తియునగు భీమసింహుఁ డాసీనుఁడై యుండెను. అతని హృదయాకాశంబున సర్వజనసమాజంబగు భావనాపరంపరలు విద్యుల్లతలవలె

మెఱసిపోవుచుండెను.—"శీతకరా! నీకిరణంబు లతిశాంతంబులయ్యును
మాబోంట్లను బాధించుచున్నవికదా! నీవు పయోముఖవిషకుంభమువుమా!.
అహా! నే నిలువెడలి సుమా రిరువదిదినములయ్యెను, నిరువది నిముషముల
వలెనే కడచిపోయెనే? ఆయన్నులమిన్న సోయగమును దనివిదీరఁ గాంచినను
దృప్తిలేకున్నది.—కానిమ్ము! నిశాకరా! నీ కామదనుం డొకసహాయుఁడు
కాదా?—మదనా! నీయాటలు సాగునా? ఎంతో కాలములేదు. శీఘ్రం
బున నీ పుష్పబాణంబుల మన్మనోహారిణీనయనాపాంగవీక్షణబాణంబులచే
ఖండించి నిన్ను నిర్జించెద.—తండ్రిగారు రేపురమ్మనికదా వ్రాసియున్నారు?
తప్పకపోయిరేని తీరవలయును. కాని యాయువతికి నాపై నిశ్చయాను
రాగము గలిగియున్నదా? యాకోమలాంగి మనోభావమెట్టిది? ముఖ్యముగా
నది గమనించియేకదా నే నీకోటను విడువవలయును? ఆ మోహనాంగితో
నేకాంతముగఁ గలిసి మాటాడుటకుఁ దగినసమయమే లభింపకున్నది కదా?
నేనేమి చేయఁగలను? ఎట్లు నాసుందరాంగి నేకాంతంబున సందర్శించుట?
ఎట్లు నామెభావం బెఱుంగుట? ఈ విషయంబున నాకిచ్చట సాయంబు సేయువా
వా రెవ్వరు? హా!—దైవమా!—ఆ శృంగారగాత్రిని దర్శించి మనోభావం
బెఱింగిపోకుండుట తగునా? రానే వచ్చితిని. చల్లకై వచ్చి ముంతదాఁచి
నచోఁ గార్యభంగమగును. ఈతూరి యా కుసుమకోమలిం గాంచకున్న మఱల
నెప్పటికిట్టి తరుణము లభించును? లభింపఁజాలదు. ఎట్లైన నేనా కన్ని
యను సందర్శించితీరవలయును."

అని యాలోచనాసముద్రంబునఁ గ్రుంకులిడుచున్న భీమసింహుని
మనస్సొక్కపరి యుప్పొంగెను. దేహము గగుర్పాటునొందెను. ఇదివఱ
కాలోచనాసముద్రంబునఁ గ్రుంకులిడుచుండిన భీమసిం గిప్పు డానంద
సముద్రమున నోలలాడెను. ఎక్కడనుండియో? యొకగీత మతనికి వినఁ
బడెను. అనుపమానలావణ్యతారుణ్యముగల కలకంఠకంఠికంఠమునుండి విపంచీ
స్వరమున మేళవించి పంచమస్వరంబునఁ గర్ణానందమొనఁగూర్చి మనంబు

సాకర్షించిన యాగీతప్రభావం బెట్టిదోకదా ? అని యాతఁ డాశ్చర్యమగ్నుఁ డయ్యెను.

కఠినంబులగు పాషాణంబులసైతము నీరమువలెఁ గరఁగింపఁజాలుగాం ధర్వకళ మానవహృదయమును ద్రవింపఁజేయుటయం దాశ్చర్యమా ? అందు నను నవయౌవనాంగుఁడగు పురుషుఁడు, సర్వజనమనోరంజకుండగు చంద్రుని వినిర్మలకాంతిపుంజంబున నొంటరిగఁ గూర్చుండి మనోహారిణిని మనం బునఁ దలంచుసమయంబున నట్టిగీత మంతటిమార్పును గల్గించి భీమసింహుని మనంబు నాకర్షించుటలో వింతయేమున్నది ? ఒక్కతూరి యాతఁ డాకసము వంకఁ దిలకించెను.—"ఏమేమి ! తారకారమణా ! ఒంటరినగు, నన్నుఁ జూచి గారడంబుఁ జేసెదవా ? చూడుము. నిన్ను దిరస్కరించుకాలము రాఁ నేరదా ?" అని యనుకొనుచు భీమసింగు చరచర సౌధాంతర్భాగమును జేరి, యుపవనము నకుఁ బోవుత్రోవయం దమర్చిన సోపానముల నవతరణంబు సేసి, జలజలరాలి ఘుమఘుమయని పరిమళించుపువ్వులమీఁద మెల్లగ నడుగులిడి సంతసిం చుచు, నిరుపార్శ్వంబులఁ దగినరీతి వెదురుబద్దలచే వంచియుంచిన పొద రింటిపై నల్లిబిల్లిగ నల్లుకొన్న మల్లెతీవలను గాంచుచు, నాతఁడు వనాంతర్భా గముఁ జేరెను. అతఁ డావనమార్గమునఁ జనునంత సేపును లతాలలన లాతనిపైఁ గుసుమంపు సేసలఁ జల్లిరి.

అప్పటి యాసనరామణీయకం బేమని కొనియాడఁదగు ? అచ్చటి దృశ్య మతిమనోరంజకంబై సర్వజనసంతోషదాయకంబై యుండెను. ఆ యుద్యానవనమధ్యభాగంబున విశాలంబగు వృత్తాకారపుసమతలం బలరారు చుండెను. దానిచుట్టును వింతవింతరంగులతోఁ బువ్వునికుంజము లొప్పుచుం డెను. దానిలోపలఁ బలురకములపూలమొక్కలు నాటఁబడియుండెను. విశ్రాంతిగొనుటకు వీలుగనుండుటకై యక్కడక్కడఁ జలువరాతితిన్నె లమర్పఁబడియుండెను. పూలమొక్కలకు నీరుపోయుటకును వాహ్యాళి వెడలుట కును జిన్నచిన్నబాటలు చేయఁబడియుండెను. ఆ ప్రదేశమధ్యభాగంబున

నొక్కజలయంత్రమునుండి సంతతధారగా నీరము పైకిలేచి చుట్టును వర్షించు చుండెను. శ్వేతగిరిశిఖరంబుపై శీతకరునికిరణజాలంబు మెఱయుంకరణిఁ జంద్ర కళిలాశీకరకణంబులందుఁ బ్రసరింప మౌక్తికవర్షంబు గురియుచున్నట్లుండెను. దాని కొక్కింతదూరమున నొక్కలతాగృహము సొంపుకులుకుచుండెను. ఆ లతాగృహానికటంబున నొక్కస్ఫటికశిలావేదిక రాజిల్లుచుండెను.

చంద్రికామూర్తిభాతి, శుద్ధసౌందర్యంబు మూర్తీభవించినపోలిక, వసంతరామణీయకంబున కచ్చెరువంది విహారకౌతుకంబునఁ జనుదెంచిన శారదా సుందరివడువున నొక్కపూర్ణేందుబింబాస్య యాసీనయై బిసరుహనాళంబుల కైసేయఁ జేదోయియం దొకవీణియను ధరించి, కిసలయాంగుళుల దంత్రుల మీటుచు గాంధర్వవిద్యావినోదినియై తన్మయత్వంబున నొక్కప్రేమగీత మును బాడుచుండెను. ముక్తికాంతాసంగమాభిలాషియగు యోగీంద్రుఁడు నిర్గుణధ్యానపరవశుడై మనంబును బరబ్రహ్మమందుఁ జేర్చువిధమున నాకాంతామూర్తియందే తనమనోవృత్తులు లీనముకాఁగా భీమసింహుఁడు కొన్నినిమేషము లామెసౌందర్యమును దిలకించుచు నిలిచిపోయెను. మఱల కొంతవడికిఁ దెప్పిరిలి యాతఁడాలతానికుంజప్రాంతంబున కరిగెను.

ఆతనియాగమనము నచ్చటిశృంగారవతి గమనింపకపోలేదు. నిజ హృదయాంతర్వర్తియగు మనోనాథుఁ డత్తరుణమునఁ గన్పడినందుల కామె సంతసించెను. భీమసింగు నిర్వర్ణితయుం, నాతఁడు తనదాపునకు వచ్చుటయుం, మొదలగువానిని గమనించి యాకాంత కాంతాసహజంబగు భీరుత్వముచే లేచినిలుచుండెను. అప్పు డంబాలికాభీమసింహు లొకరినొకరు నాలో కించుచుఁ గొన్నినిముసము లట్లే నిలిచియుండిరి. అప్పటియాదృశ్యమును సరసులగుచదువరు లూహించుకొందురుగాక! ఇంతవఱకును నామెను దలచి యుండిన యాలోచనలెల్ల నొక్కపరి పలాయనమంత్రమును బఠించెను. కాని యవివాహితయగు తానొక్కరితయై తరుణవయస్కుఁడగు పరపురుషుని సామీప్యమున నుండుట సరికాదనియుఁ దనచరిత్ర నింద్యార్హమగునేమో

చునిచము నొక్కయాలోచన యామెహృదయాకాశమున తటిల్లతవలె మెఱసెను. అందుచే నామెమానసమున భయము సిగ్గు సంభ్రమము మున్నిరి గొన నటనుండి పొదమాటునకుఁ బోఁబోయెను. వెంటనే యామెమానసమున మఱియొక యాలోచన పొడమెను. "ఏమి! నాపూర్వజన్మఫలమా? ఏసుంద రాంగుని సందర్శనభాగ్యముకొఱకై యెల్ల వేళల నువ్విళ్లూరుచుంటినో, యాతనో వాఁడే నేఁడిట సాక్షాత్కరించియుండ నేత్రానందముగ నాపవిత్ర మూర్తిని సందర్శించి యర్చించి ధన్యతనొందుకంటె వేఱుసౌఖ్యముగలదా! నాయభిప్రాయమును దెల్పినచో నన్నాతఁడెన్నఁడైన వివాహమాడి యానంద దాబ్ధి నోలలాడింపకుండునా?" యని కొంతధైర్యం బవలంబించి యందే నిలచియుండెను. అప్పుడు భీమసింగిటునటు దిలకించి మెల్ల మెల్లన ముందు నకుం జని యాకరిరాజగమనకరంబును నిజకరంబునఁ బట్టుకొనఁబోయెను. అప్పు డాయబల భీతచిత్తయై యాతనికిఁ జిక్కక పొదమాటునకుఁబోయి మృదు మధురవాక్కుల నిట్లు పలికెను.

ప్రేయసి:—ఆర్యపుత్రా! సత్కులజాతను. శీలవతిని. కన్యకను. అగడంబున కరంబు గీలించుట మీబోఁటివారికిఁ దగునా?

ప్రియుఁడు:—చెలీ! పరకాంతవగుచో నీముఖారవిందసందర్శనంబున్నైతము చేసియుండను. ఏనాఁడు మనవీక్షణము లైక్యముఁ జెందినవో? నాఁడే నేను నీవాఁడనైతిని. నీవు నాదాననైతివని తలంచుచున్నాను. నీహృదయభావం బెఱుంగవలసియే నే నిప్పు డిటకు రావలసె.

ప్రే:—ఆర్యా! నాఁడు మొదలు మీపవిత్రరూపసందర్శనంబును మీచరణ సేవయుంగలుగునంతటిపుణ్యము లభించునా యని చింతించుదానను.

ప్రి:యుం:—కళ్యాణీ! అటులైన నేనెంతయు ధన్యుఁడ. నీవిట్లు నన్ను దూరము సేయుటెందుకు? రమ్ము. నీముఖారవిందసందర్శనసౌభాగ్యం బను గ్రహింపుము.

అని భీమసింగు మెల్లన బొడరింటినిసమీపించి యాకాంతదాపునంగల యొకచలువరాతితిన్నెపైఁ గూర్చుండెను. అతఁడు దన్ను సమీపింపఁగా నాకాంత సిగ్గున మోమువాంచి యొకటిరెండడుగులు వెనుకకువైచి యొక జాజితీఁగె నాధారముగఁగొని నిల్చుండెను. మఱలఁ బ్రియుం డిట్లు సంభాషింపఁదొడఁగెను.

ప్రియుః:—కాంతామణీ! నీవు నాయం దిట్టి పవిత్రప్రేమగలిగియుండుటకే నెంతయుం సంతసించితి; కృతజ్ఞుఁడనైతి.

ప్రే:—మనోహరా! మీపలుకుల కేనెంతయుం ధన్యవాదము లొసంగుచున్నాను. ప్రియా! ఏనాఁడు మీపవిత్రమూర్తిని సందర్శించితినో యానాఁడే నేను మీదాననైతిని.

ప్రియుః:—మనోహరీ! ఇప్పుడుగదా? నాజన్మము సఫలమయ్యెను. ఇంక నీవు నాదానవేయనుట కెట్టిసందియములేదుగదా?

ప్రే:—ఆర్యపుత్రా! ముందురానున్న విపత్పరంపరల నెఱుంగఁజాల కిట్లు సంతోషించుచున్నారు. నావంటినిర్భాగ్యురాలి కట్టిసౌఖ్య మనుభవించు పుణ్యమబ్బునా?

ప్రియుః:—(ఆశ్చర్యమున) ఆ! ఆ! ఏమేమి? నీమాటలు నాకేమియుం బోధపడుటలేదు. అట్టిసౌఖ్యమునకు నోఁచుకొనలేదా? కారణమేమి? మనోహారిణీ! నాపవిత్రప్రేమకుఁ గళంకముఁ దెల్పుచుంటివా? లేక నన్నుఁబరీక్షించుటకుఁ బల్కుచుంటివా? ప్రథమావలోకనంబుననే నామనంబు నపహరించితివి. ఆనాఁడే నీవు నాప్రేమ సామ్రాజ్యసింహాసనంబు నధిష్ఠించితివే. చెలీ! నాచిత్తసీమ సదా నీపవిత్రమూర్తియే తాండవ మాడుచున్నదే. నన్నను గ్రహింపుము. నాప్రేమను సంశయాస్పదంబుగావింపకుము. పరుషవాక్యంబుల నామనంబు నొప్పింపకుము.

ప్రే:—ఆర్యపుత్రా! మీరు పొరపడితిరి. మీప్రేమ నిశ్చలమైనదని నేనెఱుంగుదును. కాని ముందురానున్న విపత్పరంపరలఁ దలంచి యట్లంటిని.

ప్రియుం:—మనోహరి ! నీవిట్లు విపరీతభావంబుల మనంబునఁ బొగిలెదవేల ? నీవ్యథకుఁ గారణం బేమి? నీ ప్రియునకుఁ దెల్పకుండునంతటి రహస్యం బెద్ది? నేనుండ నీ కెట్టివిపత్తును రాదని గట్టిగ నమ్ముము. సర్వమును వినిపింపుము.

ప్రే:—ప్రాణప్రియా ! కారణంబు విన్న, నన్ను నిరాకరింతురేమో కదా?

ప్రియుం:—ప్రేయసీ ! నిన్ను విడనాడునంతటికారణం బేదియు నాకుఁ దోఁప కున్నది. నిక్కము బల్కుచున్నాను. వినుము. నా ప్రేమ నిష్కళంకం బనియు, నిన్నుదక్క మఱొక్కపూబోఁడిని మనంబునందైనఁ దలంప ననియు నిదే శపథము చేయుచున్నాను. ఇంకనైన నామాటల నమ్మితివా?

ప్రే:—(చిఱునవ్వున) ఆర్యపుత్రా ! మీపలుకులు నాకు సంతోషజనకంబు లయ్యు, మున్ముందు మనవివాహంబునకు రానున్నయంతరాయమును గూర్చి యాలోచించి యట్లంటిని.

ప్రియుం:—(ఆశ్చర్యసంభ్రమంబుల) ఏమేమి ? మనవివాహమున కంత రాయమా ? అంతరాయముఁ గల్గింప సాహసించువా రెవ్వరు ? నీపలుకులు నా కేమియుం బోధపడుటలేదు. వృత్తాంత మేదియో తెల్పుము.

ప్రే:—నేను జయపురాధీశ్వరుల కచ్వాలవంశసంభూతను. మా తెగవారు తమకన్యలను దురుష్కచక్రవర్తులకిచ్చి తమకులమును గలుషముగావించు కొనిరి. మీ తెగవా రట్లుగాక మీకులగౌరవంబుల నిలుపఁ బెట్టుకొనిరి. అందుచేఁ గచ్వాలవంశసంభూతనగు నన్ను వివాహం బాడుటకు సమ్మ తింతురా యని శంక జనించుచున్నది. అదియేగాక మీ రొకవేళ నన్ను వివాహమాడఁదలంచినను రాణా మొదలగువా రంతరాయములు గల్పింపక పోరు. దీనినిఁబట్టియే నామనంబు చింతాక్రాంతమై యున్నది. ప్రాణేశా ! చెప్పుచున్నాను వినుఁడు. మీ రొక్కవేళ కారణాంతరముల నన్ను వివాహ మాడకున్నను, నామనం బింకొకపురుషునియందుఁ జేర్పను. సర్వకాల సర్వావస్థలయందును, మీచరణయుగ్మధ్యానమే నా కాలంబుఁ గడుపు దానను.

ప్రియుఁ:—(చిఱునవ్వున) ప్రాణేశ్వరీ! ఇదియా నీరహస్యము? నీ చింతకు మూలము? ఇందులకై యింతసందేహింపవలయునా? నీవెంత భీరు కాలవు? ఇఁకమీఁద నీ వీసంతాపంబు మానుము. ఒక్కమాటనె చెప్పెద నాల కింపుము. నావివాహవిషయమున నెవ్వరుగాని జోక్యంబు గల్గించుకొనఁ జాలరు. వివాహవిషయంబుల వధూవరు లిష్టానుసారంబుగఁ బ్రవర్తించుట నా కెంతయు నిష్టము. సతీపురుషులయన్యోన్యప్రేమాదుల నభివృద్ధి నొందించువివాహంబులే వివాహంబు లనఁబడునుగాని తదితరములు నరక తుల్యములే. స్వయంవరములఁ గావించు టెందులకు? కులశీలవయోరూప విద్యాగుణగణంబులఁ దనకనుకూలుండగు పతిని వరించుటనేకదా? దంప తులసౌఖ్యజీవనమునకు మూలాధారమైనది ప్రేమ. ప్రేమపాశము భార్యా భర్తలమానసంబుల నొకటిగఁ గట్టివైచుచున్నది. అన్యోన్యప్రేమలేని భార్యాభర్తలజీవితము దుఃఖభాజనము. అంతకంటె వేఱు నరక మేల?— ప్రేయసీ! నాప్రేమసామ్రాజ్యలక్ష్మివగు నిన్ను విడనాడి, మఱియొక్కకల కంఠిని గ్రహింతునా? గ్రహింపఁజాలను. నీవే నాజీవితేశ్వరివి. నీమూర్తియే సదా నాహృత్పీఠంబునఁ దాండవమాడుచున్నది. ఎవ రేమన్న నేమి? ఎట్టియాటంకములు గల్గిన నేమి? ఎవ్వ రడ్డమువచ్చిన నేమి? నిన్నుమాత్రము వివాహమాడుట సత్యము. ముమ్మాటికిని సత్యము.

ప్రియుండు తన్నిట్లోదార్పఁ బ్రణయిని మోము వికసించెను. చంద్రుఁడు కలుషితుఁడగుటచే, నాసమయమున నామె మోమాతనిఁ దిరస్క రించెను. పాప మయ్యది గాంచి యేమో రేవతీరమణుండు సిగ్గుఁజెంది యంతనే పాసమీప జలధరంబుమాటున డాఁగఁబోయెను. అప్పు డాలావణ్యసుధారాశి యగు రమణీరత్నము పెదవులు మెల్లనఁ గదల్చి చూపుల బాదనఖంబుల మీఁదనిల్పి మందహాస సుందరవదనారవిందయై యిట్లనియె.

ప్రేః—మీయనురాగమున కే నెంతయుఁ గృతజ్ఞను. మీ రెన్నఁడిచ్చటి నుండి స్వగ్రామంబున కరిగెదరు?

ప్రియం:—రేపే పరుణోదయమునసే బయలుదేరి రమ్మని మాజనకునివ్రాసెనతి.

ప్రే:—ఏమి! రేపరుణోదయమునసే వెడలవలయునా? తండ్రిగారు మిమ్మింత త్వరలో రమ్మనివ్రాసిన దెందులకు?

ప్రియం:—మాయన్నగారు 'ముత్రా' యొద్దనున్న కృష్ణాలయమును మహమ్మదీయుల బారినుండి రక్షించి యాకృష్ణవిగ్రహమును గొనితెచ్చుటకై సైన్యమునుగొని దండయాత్ర వెడల నెంచి నాకొఱకు వేచియున్నారట.

ప్రే:—అటులైన మీరును యుద్ధమునకు వెడలెదరని తలంచుచున్నాను. ప్రియా! జయలక్ష్మి మిమ్ము నాదరింపఁగలదు.

ప్రియం:—లేదు. లేదు. నే నితరకార్యార్థమై యరుగవలయును.

ప్రే:—అకార్య మెద్దియో వినవచ్చునా?

ప్రియం:—మాతండ్రిగారు చక్రవర్తిగారి కొకలేఖను బంపుచున్నారు. నే నాలేఖను గొని ఢిల్లీ పురంబునకుఁ బోవలసియున్నది.

ప్రే:—అయిన మీరు రాయబారులుగ ఢిల్లీపురంబునకు వెడలెదరా?

ప్రియం:—అవును.

ప్రే:—ఆర్యా! ఈమాట విన్నప్పటినుండియు నామనంబునఁ గొంత భయము గలుగుచున్నది. ఔరంగజేబు పేరు విన్నంతనే మనంబున భయసంకటంబులు జనించుచున్నది. ఆకాలభుజంగము నామాతాపితల ప్రాణానిలంబుల హరించెను. నన్ను జెఱపెట్టఁ జూచెను. అక్రూరకర్ముఁ డెట్టి నీచకార్యములకైన వెనుదీయువాఁడు గాఁడు. మీరట్టివానిచెంతకుఁ బోవుచున్నారు. వాఁడు మిమ్మెట్టులైన మోసగించును. మీ రాతనియెడఁ గడుజాగరూకతతో మెలంగవలయును.

ప్రియం:—కాంతామణీ! నీవిందుల కేల భయ మందవలయును? నా కెట్టి యాపదలును రాఁజాలవు? నీవు నాకింతగఁ జెలుపవలయునా? ఔరంగ జేబు మాయోపాయంబుల నేఁ జక్కగ నెఱుంగుదును. అతని మాయోపాయంబులకు లోఁబడునంతటి బేలను గాను. అతఁ డెట్టివాఁడైన నగుఁ

గాక నేను మాత్రము తండ్రిగారి యాజ్ఞమేరకు ఢిల్లీపురంబునకుఁ బో
వలయును.

ప్రే:—మీరసమానులని నేనెఱుంగుదును గాని, యెల్లప్పుడు తమయోగక్షే
మముల నభిలషించు దాననగుటచేతను, నాజీవితమంతయుఁ దమకర్పిం
చుటచేతను, గాంతాసహజంబగు భీరుత్వము న న్నావరించుటచేతను,
మీకిట్లు నుడివితినిగాని వేరొండుగాదు. క్షమింపుడు.

ప్రియు:—మనోహరీ! క్షమించుట కిందు తప్పేమున్నది? చెప్పవలసినమాటనే
చెప్పితివి. ఇఁక భోజన సమయ మగుచున్నది. రాణిగారు నీకొఱకై
వేచియుందురు నేను రేపుదయముననే ప్రయాణము గావలసియున్నది.
చెలీ! మత్ప్రేమచిహ్నంబగు కరాంగుళీయక మిదిగో, కైకొమ్ము.

ప్రే:—ప్రాణప్రియా! మీయపారప్రేమాదరంబులు నన్ను నిజముగ నాక
ర్షించినవి. మీరిట్టియుత్కృష్టమైన బహుమాన మొసంగినందులకు
నేనెంతయుఁ గృతజ్ఞను. నన్ను బహూకరించినందులకు మిమ్ము గౌరవింప
కుండుటతగునా? ఇదిగో! గొనుఁడు. మత్ప్రేమచిహ్నంబగు నీయుంగుళీయ
కంబు. మీదాసురాలిని మఱవకుఁడు.

అని ప్రేమకళలుట్టిపడునట్టి మృదుమధుర వాక్యంబులఁ బలుకుచు
నమ్మీనలోచన తన యంగుళీయక మొసంగి కాంతుని పాదంబులవ్రాలి నమస్క
రించెను. ప్రియుండు ప్రియురాలి కరంబు నిజకరంబునఁబట్టి లేవఁదీసి యామె
దక్షిణ కరతలమును ముద్దుగొనియెను. పిమ్మట నయ్యళినీలాలక ప్రియునిఁ
గ్రేగంటఁజూచుచుఁ "ప్రియా! మీప్రయాణము సేమంబుగ జరుగుగాక!
సర్వేశ్వరుఁడైన రుక్మిణీ మనోహరుండు మీకు సర్వవిధములఁ దోడై
రక్షించుఁగాక! ఈదాసురాలిని మాత్రము మఱవకుఁ" డని ప్రియునితోఁ
బ్రియంబులాడి యాతని వీడ్కొని నిజసౌధ మార్గంబున వెడలెను. ప్రియుం
డామె యరిగిన దిక్కునే చూచుచు నిర్విణ్ణుఁడై కొంతసేపు నిలిచి పోయెను.
ఎప్పు డాతనిమానసము గూడ నాపుష్పంధయవేణి తోడనే వెడలి యుండెను.
తర్వాత కొంత తెప్పిఱిలి యాతఁ డావనమార్గంబునఁ జనియెను.

---

# పదునొకండవ ప్రకరణము

## ఢిల్లీపురము

భారతదేశమాతృకంఠప్రదేశమున నతిమనోహరంబుగఁ జూపట్టు పతకంబోయన నుత్తరహిందూస్థానంబున ఢిల్లీపట్టణంబు విలసిల్లుచుండెను. అప్పట్టణవాసుల సుకృత పరిపాకవశంబునఁ బవిత్రయమునానదీలలామం బాపట్టణముఁజుట్టి ప్రవహించుచుఁ దనపావనజలంబుల జలకంబులాడినవారి పాపజాలంబుల నిర్మూలనంబుఁ జేయుచుండెను. తొల్లి హస్తిరాజేంద్రనిర్మితంబై హస్తినాపట్టణంబని పేరెన్నికగాంచి కురుకులదీపకులగు రాజన్యులకెల్ల రాజధానియై సకలైశ్వర్యములతోఁ దులతూఁగిన దీఢిల్లీపురరాజ్యమే. యుగయుగంబులనుండి, భారతఖండమునకుఁ రాజధానియై ప్రఖ్యాతిగడించెను. మనకథాకాలంబున ఢిల్లీపట్టణశ్రేష్ఠంబు మొగలుకులోద్భవుండగు నౌరంగజేబు రాజ్యంబునకు ముఖ్యపట్టణంబై యుండెను. భీమసింగు కృతప్రయాణుండై సపరివారంబుగ ఢిల్లీపురమును సమీపించెను.

నగరబాహ్యప్రదేశమున రాజామయసింగాతని సగౌరవంబుగ నెదుర్కొని "భీమసింగుకుమారా! సర్వసామ్రాజ్యంబు సర్వాధికారంబునఁ బరిపాలించు మొగలుచక్రవర్తియగు నౌరంగజేబుగారి యాజ్ఞానుసారము మత్కులుండవగు నీకిదె సగౌరవంబున స్వాగతం బొసంగుచున్నా" నని పలికెను. భీమసింగాతనిస్వాగతంబునకు సంతసించి "రాజా! మీరు నన్నింతయు గౌరవించినందుల కేను కృతజ్ఞుఁడ" నని పల్కి సపరివారుఁడై యాతని వెంట జనుచుండెను.

భీమసింగు మితపరివారుండై వచ్చుటం గని మయసింహుఁ డాశ్చర్యమునందెను. కాని కింవదంతితో, ననుజసహితుండై ఢిల్లీచక్రవర్తికి కాను

కలుచెల్లింపవచ్చుచుండెనని తెలిసియుండెను. ప్రస్తుత విషయంబును దలంచి రాజాషయముసింగు భీమసింగును గాంచి "కుమారా! నీవిప్పుడు భయంకర దంష్ట్రాయుతంబగు మృగరాజవదనగహ్వరంబునఁ దలదూర్చుచున్నాఁడవు. నీవు గొనివచ్చిన లేఖం గాంచిన సౌరంగజేబు తోఁకద్రొక్కిన పామువలెఁ గోపానల దందహ్యమానమానసుండై నీతండ్రిని నిక్కంబుగ నుక్కడంప దాడివెడలును. మీతండ్రి పేరువిన్నంతనే యాతఁడు మండిపడుచుండును. ఔరంగజేబును సామాన్యునిగాఁ దలంపకుము. అతఁడు పయోముఖవిషకుంభమువంటివాఁడు. మాయోపాయంబుల నాతని కుద్దియగువాఁ డీజగంబున నొక్కఁడేనియుఁ గానరాఁడు. నీ కెట్టియనుమానమును గలుగకుండునట్లు నిన్నెక్కుడుగ గౌరవించి యాదరించువానివలెఁ గన్పట్టును గాని, యెల్లవేళల నీచేటునకై యత్నించుచుండును. కపటప్రేమంబున వర్తించుచు నిన్ను నిక్కంబుగ నిర్బంధమున నుంచును. నీవు మత్కులోద్భవుఁడవగుటంజేసియు, మీయందలి గౌరవంబునంజేసియుం, నింతవఱకుఁ జెల్పవలసివచ్చెను. నీ పటిజాగరూకతతో మెలంగవలయును. నే నింతకంటె నెక్కువసాయము సేయఁజాలను." అని తెల్పి భీమసింగు చిఱునవ్వున నిట్లనియెను.

"మహారాజా! మీరు నాహితవుగోరి నుడివిననుడువులకే నెంతయుఁ గృతజ్ఞుఁడ. తండ్రియాజ్ఞ నాఁదలధరించి నే నీచక్రవర్తిసన్నిధికి వచ్చియున్నాఁడను. తండ్రియాజ్ఞను నెఱవేర్చుట పుత్రునిధర్మమై యున్నది. చక్రవర్తి యెట్టివాఁడైన నగుఁగాక నాకార్యంబు నెఱవేర్చెద. నన్ను చక్రవర్తిగారు నిర్బంధవాసమున నుంచెదరని పలికితిరి. వారిమాయోపాయంబుల కంతసులువుగ దొరకునంతటియమాయకుఁడను గాను. అయ్యది మీరే గ్రహింపఁగలరు.

రాజా:—కుమారా! నీయాకార ముపలక్షించియే నీ వెట్టివాఁడవై నదియుఁ, గొంతవఱకు గ్రహించితిని. నీధైర్యసాహసంబులు ప్రశంసాపాత్రములు. అయినను నీ వటిజాగరూకతతో మెలంగవలయును. నేను నీ కితరసహాయ

మేమియుఁ జేయఁజాలకపోయినను నిచ్చటి పరిస్థితులనుగూర్చి వొచ్చ రించితిని. నేఁటిదినము మాయింట విం దారగించి పిమ్మటఁ జక్రవర్తిగారిం సన్నిధి కరుగుఁడు.

అని వారిరువు రచ్చటి వృత్తాంతములఁగూర్చి ముచ్చటించుచుఁ బోయి రాజవీథిని బ్రవేశించిరి. వా రావీథిమార్గంబునఁ గొంతద వ్వరుగునప్పటికి వారివామభాగంబున నరుణకాంతు లీనుచున్నట్టియు, రత్నఖచితసువర్ణకుడ్య విరాజితం బైనట్టియు, లోకుల కెల్ల నానందాశ్చర్యంబుల జనింపఁజేయు శిల్ప చాతుర్యాతిశయంబుల వేనోళ్లఁ జాటుచుండునట్టియు, జుమ్మామసీదు చిత్ర కేతనాలంకృతమై దృగ్గోచరం బయ్యెను. వా రామసీదును నేత్రపర్వంబుగఁ దిలకింప నెంచి యచ్చోటికి వెడలిరి. మసీదుయొక్క సింహద్వారంబున కిరుపార్శ్వంబుల గజారూఢులై యున్న పవిత్రరాజపుత్రవంశాబ్ధిసోములగు పట్టాజయమల్లువీరుల పాషాణప్రతిమలు ప్రతిష్ఠింపఁబడియుండెను. రాకొమ రుఁడును, దదితరులును నాప్రతిమలం గాంచి వారిపవిత్రమూర్తులకు మనంబుల వందనంబు గావించిరి. ఆహా! ఆమూర్తులకు భక్తివినయంబుల వందనంబు లాచరింపని రాజపుత్రుఁ డెవ్వఁడు?

మొగలువంశాబ్ధిచంద్రుఁ డగు నక్బరుసార్వభౌముఁడు చిత్తూరుకోటను ముట్టడించినప్పుడు పట్టాజయమల్లులు పరాక్రమించి గజతండంబుపై విజృం భించు హర్యక్షంబులభంగి రిపుయోధమత్తేభకుంభస్థలంబుల నిజనిశితకృపాణం బులఁ జీల్చి చెండాడి కదనరంగంబున వీరవిహారంబుసల్పి తుదకు జన్మభూసం రక్షణార్థమై యాహవరంగంబున బ్రాణంబులఁదొఱఁగి వీరస్వర్గంబుఁ జేరిరి. అక్బరు సార్వభౌముఁడు వారియపారబలశౌర్యధైర్యంబులకును రణవిద్యా ప్రవీణతకును మెచ్చి వారికీర్తి యాచంద్రతారకఁ బై వెలయునట్లువారివిగ్ర హంబులఁజెక్కించి యాగ్రాకోటసింహద్వారంబునఁ బ్రతిష్ఠించెను. తర్వాతషాజ, హానుకాలంబున నావిగ్రహంబులుఢిల్లీకిఁగొనిరాఁబడి యామసీదు గోపుర ద్వారంబునఁ బ్రతిష్ఠింపఁబడెను.

జయమల్లువిగ్రహమును రాకొమరునికిఁ జూపి రాజాజయమసిం గిట్లనియె. "రాకుమారా! ఈ రాజపుత్రయువకునిఁ జూచితివా? ఇట్టిదేశసేవాధురంధరుఁడు, ఇట్టిప్రభుభక్తితత్పరుఁడు, ఇట్టిరిపుభుజంగవైనతేయుఁడు మన కులంబున జనించినకతంబున రాజపుత్రులు కీర్తివంతులైరి. అభిమన్యుకుమారుం బోలి యావీరకుమారుఁడు ఘోరముగఁ బోరుసల్పి మృతుండయ్యె. ఆహా! ఆ వీరవరునిభార్యయు నతనికి సహాయురాలై పతిచెంతనే మృతిఁజెందెను. ఇట్టి వీరనారీరత్నంబులకు ఖనియైన రాజపుత్రస్థానమాహాత్మ్యం బేమని కొనియాడుదు? వివేచనానిపుణుండగు చక్రవర్తి యావీరకాంతాప్రతిమఁ బ్రతిష్ఠించియుండిన బాగుండెడిది." ఆపల్కులు వినఁగనే భీమసింగు చిత్తాకాశమునఁ బ్రేమాబాయి వీరమోహినీరూప మొక్కమాఱు విద్యుల్లతవలె మెఱసెను.

తదుపరి వారచ్చటివింతలఁ దిలకించి సంతోషించి మఱల నామార్గంబునఁ జని 'ఫాందీ' చౌకును జేరిరి. అందుఁ జిత్రవిచిత్రగతుల నలంకరించిన దుకాణములు, సౌధములు దిలకించుచుఁ జనిచని యాప్రదేశమున కుత్తరభాగంబుననుండు జయమసింగుభవనమును జేరిరి.

మఱునాఁడుదయమున రాజాజయమసింగును, భీమసింగును సశ్వారోహకులై యనుచరసహితముగ నౌరంగజేబుదర్బారునకు వెడలిరి. వారుకోటయొక్క సింహద్వారమును సమీపింపఁగనే తమయశ్వంబులనుండి డిగి పాదచారులై లోనికిఁ బ్రవేశించిరి. అక్కోటలోపలిప్రదేశములు మనోహరములై కన్పట్టుచుండెను. వారచ్చటివింతలం గాంచియానందాశ్చర్యములందుచు, హస్తివాజిశాలలం గడచి, రాచనగరున మ్రోగుచున్న మంగళధ్వనులవినుచు నక్కోటమధ్యభాగంబుఁ బ్రవేశించిరి.

ఆప్రదేశంబునఁ జాలవిశాలమై యుప్పరిగలచే విలసిల్లు రాజప్రాసాదము నేత్రపర్వంబుగఁ గన్పడెను. వారందుఁ బ్రవేశించి యానగరుమధ్యభాగంబునఁగల సభామంటపముం జేరిరి. చలువరాతిగోడలతోడను, వింతకంబ

ములతోడను, బలువన్నెలంగల తివాసులుపఱుపఁబడిన భూతలంబుతోడను, విచిత్రములగు తెరలతోడను, నలంకరింపఁబడి యాసభాస్థానం బింపుఁ గొలుపుచుండెను. అందొక్క ప్రదేశమున నమర్పఁబడిన మయూరాసనంబున మొగలచక్రవర్తియగు ఔరంగజేబాసీనుఁడై యుండెను. బంగరుజలతారు పనిచేయఁబడిన తెల్లనిపట్టుపుట్టంబుల నతఁడు ధరించియుండెను. నవరత్న ఖచితంబగు స్వర్ణపతకం బొక్కటి సూర్యునివలె నతనిమకుటముపైఁ బ్రకా శించుచుండెను. అమూల్యంబగు మంచిముత్తెములమాలిక యొక్కటి యాతని కంఠమందు వెలుఁగొందుచుండెను. అతని కిరుప్రక్కల నిరుపురుభటులు చామ రములు వేయుచుండిరి. మంత్రిసామంతులు, నవాబులు, మునసబుదారులు, కాయబారులు, రాజోద్యోగులు మొదలగువార లుచితస్థలంబుల నాసీనులై యుండిరి. ఆసభాస్థలము జనులచే క్రిక్కిరిసియుఁ బ్రశాంతమై యుండెను.

ఆసమయమున భీమసింగు రాజాసయమసింగు లాసభామంటపమును బ్రవేశించిరి. తోడనే వారు వినయవినమితోత్తమాంగులై సలాములఁ జేయుచు ముందునకువెడలి చక్రవర్తి చూపిన్న మేరకు నుచితాసనంబుల నాసీనులైరి. ఆ సభాస్థలమును బ్రవేశింపఁగనే భీమసింగు నాల్గుదిశలఁ బరికించి చూచెను. అతఁ డొక్కమా రాశ్చర్యసంభ్రమంబుల మునింగిపోయెను. మయూరాసనం బాతనిమనంబు నాకర్షించెను. జగద్విఖ్యాతిగాంచిన యాసింహాసనంబును గాంచి భీమసింగు తొలోన సంతసించుచుండెను.

ఆమ్మయూరంబు దేహంబు హేమమయంబు. దానిపాదంబుల నమూ ల్యంబులగురత్నంబులు ప్రకాశించుచుండెను. ఆమయూరగళంబున నొక్క ముత్యాలహారం బొప్పారుచుండెను. ఆమయూరాసనంబునకు నేత్రంబులుగ రెండింద్రనీలంబు లలరారుచుండెను. దానిపింఛము విశాలమై స్వర్ణమయమై మరకతమాణిక్యపుష్యరాగాద్యలంకృతమై చూపఱుల కనులు మిఱుమిట్లు గొలుపుచుండెను. దానిమీఁద రత్నఖచితంబగు కాంచనపీఠం బొండు మెఱయుచుండెను. అందుఁ జక్రవర్తి యాసీనుఁడై యుండెను. ఆ సింహాసన

మున కిరువంకల రత్నసంయుతంబులగు సువర్ణపుష్పసముదాయంబులచే నొప్పారు కుందనంపుఁదీవ లతిమనోహరంబుగఁ దీర్పఁబడి యుండెను.

ఇట్టియైశ్వర్యమునఁ దులతూగుచక్రవర్తికిఁ దానుగొనివచ్చిన కొంచెపుఁ గానుకల నిచ్చుటకు భీమసింగు సిగ్గొందెను. సభయంతయుం నిశ్శబ్దమై యుండెను. అప్పుడు రాజాజయమసింగు మెల్లన యాసనంబునుండి లేచి చక్రవర్తికి సలాములుచేసి భీమసింగును జూపి చక్రవర్తి నుద్దేశించి "హుజూర్! తమయాజ్ఞ శిరంబునఁ దాల్చి యుదయపురము రాజకొమారుని దమసన్నిధానంబునకుఁ గొనివచ్చినాఁడను. రాణా రాజసింహుఁడు తమసన్నిధానమునకు నొకలేఖయుం గొన్నికానుకలను గొమారునిమూలమునఁ బంపుకొన్నాఁడు. చక్రవర్తిగారు చిత్తగింపవలయును." అని నుడివి యాసీనుఁడయ్యెను.

భీమసిం గాత్రంబున లేచి వినయపురస్సరంబుగఁ జక్రవర్తికి సలాము లాచరించి జాబు నీఁబోవ నమీరుఁ డొక్కఁ డాలేఖం గొని భటునిచేతి కొసఁగ నతఁ డద్దానిని జక్రవర్తిసమ్ముఖంబున నుంచెను. చక్రవర్తియుం నాజాబు నతిప్రీతిం గొని ముద్రను జించి యామూలాగ్రముగ మనంబున జదువుకొనెను. ఆ లేఖను జదువను జదువను నతనిమనస్సు క్రోధపూరితంబై పోయెను. కాని, యతఁ డిసుమంతయైనఁ గోపంబు బయటికిఁ దోపనీక యొక్కవసంతసించినవానివలె నటించుచు రాజసింహుఁడుపంపిన కానుకలఁ దేనాజ్ఞాపించెను. తోడనే యిరువురు రాజపుత్రులు కానుకలపళ్లెరములను గొనివచ్చి చక్రవర్తిసన్నిధానమున నుంచిరి. రాకొమరుఁడు, వాని నొక్కొక్కటిగఁదీసి చక్రవర్తి కందిచ్చెను. చక్రవర్తియుం వానినన్నింటినిఁ గొని చక్కఁగఁ బరిశీలించి పరిపరివిధముల మెచ్చుకొనెను.

చక్రవర్తికనుసన్నమేర కిరువు రమీరులు ముందునకు వచ్చి రాయబారుల కప్పుడు జరుగవలసిన మర్యాదలమేరకుఁ జక్కనికాశ్మీరపుఁ బట్టుచే నమర్పఁబడిన నంగరకయును, జలతారుగల రుమాలయును, భీమసింగుచే

ఘటింపఁ జేసిరి. వెంటనె భీమసింగు ధరించియుండిన రుమాలును గాసుకలు గొని వచ్చిన రాజపుత్రులు గొని వెనుక వెనుకనే పోయి యా జనసమ్మర్దములో డాగిరి. జాబుచనిపినదాదిగఁ దనమనంబున రగుల్కొన్న కోపంబు నిసుమంతయు బయ టికిఁ దోఁపనీక కృత్రిమసంతోషంబునఁ దన్నాదరించు చక్రవర్తిం గాంచి 'ఆహా! ఈతఁడు నిశ్చయముగ జిత్తులమారియే" యని యనుకొనుచు భీమ సింగు రాజాజయసింగు ప్రక్కనఁ దనయాసనంబుపై నాసీనుఁడయ్యెను.

తరువాత రెండుగంటలు దర్బారు జరిగెను. అందు రాజ్యవిషయములు మతవిషయములు మొదలుగాఁగల విషయంబుల నన్నిఁటినిఁ జర్చించిరి. పిమ్మటఁ జక్రవర్తిగారు పరీక్షించుటకుఁగాను, నశ్వశాలయందలి కాశ్మీరాశ్వరాజంబులు బారులు బారులుగ నిలుపఁబడెను. తొలికారుమబ్బుల నపహసించు మేనికాంతు లతో నొప్పు మత్తేభంబులు, కంఠంబులఁగట్టిన రజితంపుఘంటలు ఘల్లుఘల్లు మనిమ్రోయ శృంగారంబుగ నలంకరింపఁబడి రాజపరీక్షకై తీసికొనిరాఁబడి యెను. ప్రతిగజంబును సింహాసనమున కెదురుగ వచ్చినపుడు మోకరించి పిఱికిఁ దొండంబుఁ జాచి ఘీంకారమును జేసెను. అటుపిమ్మట వినోదార్థమై యుంచఁబడిన చిఱుతలు పులులు జింకలు వేఁటకుక్కలు కాఱెనుబోతులు డేగలు మొదలగువానినెల్లఁ జక్రవర్తి పరీక్షించెను. తదుపరి సభముగింపఁ బడెను. ఔరంగజేబు సింహాసనమునుండిడిగి కుమారసహితుండై భటులు ముందునడువ నంగరక్షకవర్గము వెంటరాఁగ మెల్లన రత్నకంబళంబుల మీఁద నడచి యేకాంతగృహంబునకుఁ జనియెను. తోడనే సభ్యులందఱును లేచి వారివారినికేతనంబులకు వెడలిరి. రాజాజ్ఞమేర కొక్కయమీరుఁడు భీమ సింగు నాకోటయందలి యొకసౌధంబునకుఁ గొంపోయెను.

# పండ్రెండవ ప్రకరణము

## విమర్శనము

రాజసింహునిలేఖను జదివినది మొదలు దుర్భరకోపానలంబున మనంబు గలఁగిపోవఁ బ్రళయకాలరుద్రునిమాడ్కిఁ గినిసి యాకోపాగ్నిచే రాజపుత్ర వంశమహావృక్షంబును సమూలముగ దహింపవలెనని చక్రవర్తి పరిపరివిధంబులఁ దలంచుచుండెను. "గోరుచుట్టుపై రోకటిపోటన్నట్లు" ఆసమయమున మథురా నుండి శ్రీకృష్ణవిగ్రహమును రథసహితంబుగఁ దమబారినుండి తప్పించి యుదయపురంబునకు రాజపుత్రులు కొనిపోయిరని మథురా (మాథుర) సుబేదార్ వర్తమానమంపెను. రగుల్కొన్నయగ్ని కింధనమువలె నాసమాచారము చక్రవర్తి కోపమును మఱింత యభివృద్ధినొందించెను.

ఔరంగజేబొక యేకాంతగృహంబున నటునిటుఁ బచారుసేయుచు నెవరికొఱకో నిరీక్షించుచున్నవానివలెఁ గన్పట్టెను. కొంతతడవ పట్టు పఱుపు పఱచి యొకమృదుతల్పంబున నాసీనుఁ డయ్యెను. వేగిరపాటును గోపంబును నాతనిముఖంబున గన్పట్టుచుండెను. మఱికొంతసేపటి కొకయువకుఁడు లోనికిఁ బ్రవేశించి చక్రవర్తికి వినయంబున మ్రొక్కి నిల్చుండెను. చక్రవర్తి యాతని గాంచి "అక్బర్! ఇంత యాలస్యమేలయైనది? ఇంతవఱకు నీకొఱకు వేచి యుంటిని. నేఁడు నీతో నొక రహస్యవృత్తాంతమును గూర్చి ముచ్చటింపవలసి యున్నను. ఇచ్చట గూర్చుండుమనియెను. తండ్రియాజ్ఞమేర కాతఁడు ప్రక్కనున్న యాసనంబున నుపవిష్టుఁడయ్యెను.

పిమ్మట నౌరంగజేబు రాజసింహుఁ డంపిన లేఖను బయటికిఁ దీసి వెల్లడిగ నిట్లు చెప్పఁదొడఁగెను. "అక్బర్! చూచితివా? రాజపుత్రులు చే

రేఁగి మితిమీరుచున్నారు. వారికందఱకావర మణఁగింపకున్నఁ దప్పక ముప్పు వాటిల్లును. మొగలుసామ్రాజ్యచక్రవర్తి సామాన్యుఁడని తలంచిరికాఁబోలు? కోపాతిరేకంబున భయంకరాకృతిఁ జెలరేఁగుమృగేంద్రుని శశకంబు ఢీకొన్న చందంబునఁ, బ్రచండప్రతాపుండగు నీఢిల్లీశ్వరుని మిన్నుమన్నుగానక మదోన్మత్తులై రాజపుత్రు లెదిరింపఁ జూచుచున్నారు. వైరివర్గంబు చెలరేఁగి యుండ వారిని నిర్మూలనంబుసేయకున్న ప్రజాసంక్షోభంబగు. మీఁదుమిక్కిలి యది రాజనీతివిరుద్ధంబు. శత్రుఋణశేషము లుండఁగూడదని పెద్దలు నుడువుదురు. మొదట శత్రువుల కవకాశమిచ్చి వారు ప్రబలినతర్వాతఁ జంపించుట ప్రాజ్ఞులలక్షణముగాదు. బుద్ధిమంతుఁ డవియోచించి మొదటనే జాగరూకుఁడై యుండవలయును. కాన మన మిప్పు డుపేక్షసేయరాదు. రాజపుత్రులు ప్రతిఘటించియున్నారు. అక్బర్! వింటివా? ముత్రాసుల్తానును మోసగించి యొకనాఁటినిశాసమయంబున శ్రీకృష్ణవిగ్రహమును దొంగిలించుకొనిపోయిరఁట. సేనాదేవళంబును నిర్మూలింప సమకట్టియుండ వారు నాకోర్కె నిష్ఫలంబగునట్టు సేసిరి. రాజసింహుఁడు మదించి యుక్తాయుక్తము లెఱుంగక తానే మేటిమగండని యెంచి, చక్రవర్తినగు నాకు నీతినిఁ గఱపుచున్నాఁడు. నాపరిపాలనము నింద్య మనుచున్నాఁడు. వాని కింత పొగరా? హనుమంతుని ముందటనా కుప్పిగంతులు. ఓరీ! రాజసింహా! గర్వాంధకారంబున కన్నుగానకుంటివి కాఁబోలు. శీఘ్రంబుననే నీకందఱకావర మణఁగింతును." అని చక్రవర్తి సమస్తభువనము లొక్కుమ్మడి భస్మీభూతంబులుగఁ జేయు ప్రళయకాలరుద్రునిమాడ్కి మండిపడుచు నాజాబు నక్బరున కందించి 'దీని నామూలాగ్రముగఁ జదువుము. సర్వము నీకే విశదమగు' ననియెను. ఇంత కోపకారణంబైన యాలేఖయందలి విషయంబు లెవ్వియో? యని మనంబునఁ దలంచుచు మాఱుమాటాడక యాక్షణమ్మ నక్బ రిట్లు చదువఁ దొడఁగె.

తురుష్కసామ్రాజ్యచక్రవర్తియగు నౌరంగజేబు పాదుషా గారికి:—

సర్వేశ్వరుం డాయురారోగ్యైశ్వర్యాభివృద్ధిం గలుగంజేయుంగాక! నేను దమ కిదివఱకుఁ బ్రతిద్వంద్వినై తమకార్యంబులకు విఘాతంబు గల్పించితినని నాయం దసూయాకోపంబులు మీకు జనించియుండును. కాని నిజ మారసిచూచిన నేను దమశ్రేయోభిలాషినే గాని వేఱు కాదు. ప్రజలకష్టనష్టములంగూర్చియు, రాజ్యకార్యతంత్రములం గూర్చియు, బ్రస్తుతపరిస్థితులను గూర్చియుం, దమసన్నిధానమున కొకలేఖను బంపుకొన్నాఁడను. అందలి విషయంబుల గ్రహించి తగురీతిం బ్రవర్తింతురుగాక.

నాదౌర్జన్యము నాపుటకై తా మమితద్రవ్యంబు కోశాగారంబునుండి వెచ్చించితి రనియుం, గొఱవడిన కోశాగారంబు నింపదలంచి పేదలగు హిందువులపైఁ గనికర మొక్కింతలేక పన్నుల నెక్కుడుగ విధించుచున్నారనియు, నెఱుంగుదును. తమ పితృపితామహప్రపితామహులు హైందవుల నెంతయు నాదరించి కులభేదము లెంచక నిష్పక్షపాతంబుగ నేకచ్ఛత్రాధిపత్యంబున ధరాపాలనంబు సల్పి చిరకీర్తిగడించి దివంబు నలంకరించిరి.

తమప్రపితామహుండును, మొగలువంశాబ్ధిపూర్ణచంద్రుండును, శమదమాదిగుణుండును, నగు జలాలుద్దీ నక్బరు సార్వభౌముం డుదారుండై సర్వమతములవారి నేకరీతిగఁ బోషించుచు నేబది రెండేడులు నిరంకుశంబున భూచక్రంబేలి దిగంతయశోవిరాజితుండై దివంబు నలంకరించెను. ఆమ్మహాశయునికాలంబున హిందూమహమ్మదీయకులంబు లన్యోన్యమైత్రిఁగలిగి సుఖంబుండెను. చక్రవర్తియు హిందూమహమ్మదీయుల సఖ్యంబునకై యహర్నిశంబును బాటుపడుచుండెను. అందులకు హిందూవనితలఁ బెండ్లియాడెను. తన యాస్థానమున హిందువులయోగ్యతాయోగ్యతలఁబట్టి గొప్పగొప్పయుద్యోగములనిచ్చి గౌరవించియుండెను. హిందూమతమును నిర్మూలింప సమకట్టలేదు.

హిందువులను మహమ్మదీయులుగండని నిర్బంధింపలేదు. హింసలఁబెట్టలేదు. హిందూవనితలఁ జెఱపలేదు. హిందువులదేవళంబులను విగ్రహంబులను నిర్మూలింపలేదు. అనవసరములగుపన్నుల విధింపలేదు ఆమహాత్ముఁడు ప్రజలను బిడ్డలవలెఁ బ్రోచుచు వారికష్టముల నెల్లవేళలఁ బాపుచు ధర్మసమ్మతంబుగ రాజ్యంబుఁ బాలింపుచుండ జారచోరభయంబులేక కనుపుఁగోనిచల్ల కదలకుండ రాత్రులందుఁ దమయిండ్లయందుఁ గరంబులిడి ప్రజలు హాయిగ నిద్రించుచుండిరి. అందుచే నాతఁడు 'మానవరక్షకుఁడనియు, ఘనుఁడై నయక్బరనియుఁ బేరొందెను కీర్తికాంతకరంబుఁ జేపట్టెను.

తర్వాతఁ దమపితామహుఁడగు జహాంగీరుసార్వభౌముఁడు, తనతండ్రివలెనే సకలహైందవ్యుల నాదరించుచు, వారికి గొప్పగొప్పయుద్యోగముల నొసంగుచు, నిర్హేతుకములగు పన్నులవిధింపక సర్వజనసమ్మతంబుగ నిరువది రెండేండ్లు ధరాపాలనంబు సల్పెను. సర్వరాజపుత్రనాయకు లాతని యాజ్ఞల నెఱవేర్చుచుండిరి.

అటుపిమ్మటఁ దమతండ్రిగారగు షాజహానుచక్రవర్తి తండ్రితాతలవలె నోర్పు దయ నిష్పక్షపాతము మొదలుగాఁగలసద్గుణములుకల్గి, హిందువులు మహమ్మదీయుల భేదములులేక యెల్లర నేకరీతిగ నాదరించుచు, ముప్పదిరెండుసంవత్సరంబులు నిరంతరంబున భూవలయం బేలి శాశ్వతకీర్తిప్రతిష్ఠలం గాంచెను. న్యాయంబుగ భూపతిపాలనంబుఁ జేయుటం జేసి సర్వ రాజపుత్రులాతనియాజ్ఞలకు లోఁబడి స్వామికార్యములు భక్తిశ్రద్ధలతో నెఱవేర్చుచుండిరి. కేవలము భారతీయులేగాక విదేశీయులుగూడ వారిధర్మపరిపాలనంబును వేనోళ్లఁ గీర్తించుచుండిరి. పైనుదహరించిన చక్రవర్తులు ప్రేమయనెడి పాశంబున సర్వజనులఁ దమవశవర్తులుగఁ జేసికొనియుండిరి.

ఇంకఁ దమపరిపాలనమునందలి పరిస్థితులను గొంతవఱకుఁ జర్చింతము. నేవ్రాయువిషయంబులకు మీరు కోపగింపనక్కరలేదు. మీరు రాజ్యకాంక్షచేఁ

దొలఁగొల్తిఁ దండ్రిగారిని జెఱఁబెట్టితిరి. తర్వాత నన్నదమ్ములను యమసద
నంబున కనిపి మీజీవితమును నిష్కంటకముగ నొనర్చుకొంటిరి. మీ రెట్టి
ముహూర్తమున సింహాసన మెక్కితిరో గాని యప్పటినుండియుం గల్లకల్లోల
ములు దేశమంతటను వ్యాపించియున్నవి. అన్యమతసహనము కొంచెమైనను
మీయందుఁ గానిపింపకున్నది. హైందవుల నకారణంబుగ బాధించుచున్నారు.
తమదౌర్జన్యములకుఁ దాళఁజాలక రాజపుత్రులు తమకొలువును జాలించుకొనిరి.
దోపిడులు ప్రబలినవి. గోస్త్రీశిశుహత్యలు మెండైనవి. జారచోరకృత్యము
లెక్కువైనవి. "యథారాజా తథాప్రజా" యనునార్యోక్తిప్రకారము తమ
మతస్థులు హిందువులను బడరానిబాధల నొందించుచున్నారు. హిందువులఁ
దమమతమునఁ గలుపఁ బ్రయత్నించుచున్నారు. లోఁబడనివారినిఁ గొట్టి
వారియాస్తుల దోచుకొని భార్యాదుల జెఱచి యనేకరీతుల బాధించు
చున్నారు. మీ దుమిక్కిలి దుష్టవర్తనమునకే మీరును బ్రోత్సహించు
చున్నారు. "దుర్భిక్షములో నధికమాస" మన్నట్లు తిండిలేక మలమలమాడు
హిందువులపై గొప్పపన్నులు విధించియున్నారు. పన్నులు చెల్లింపనివారిని
బలురీతులఁ బాధించుచున్నారు. మీవింత ప్రవర్తనము ధర్మవిరుద్ధమని బుద్ధి
మంతులకెల్ల విదిత మగుచున్నది. కేవలము హిందువులయందే గాక ధర్మబుద్ధి
గలమహమ్మదీయులయందుఁగూడ నతృప్తిఁ జూపించుచున్నారు. మీ రాజ్య
మందలి ప్రజలయం దొక్కనికైనను మనశ్శాంతి లేకున్నది.

మఱియును మీరుచేయు కుతంత్రములు లోకమునకుఁ దెలియవనుకొం
టిరి కాఁబోలును? పాపము! పిల్లి కన్నులు మూసికొని పాలు త్రాగుచుఁ
దన్నెవ్వరును జూడలేదని తలంచువిధమున మీరుగూడఁ బరమకార్యము
లితరులకుఁ దెలియరావని సంతసించుచున్నారు. జోధ్పురాధీశ్వరుఁడగు
జస్వంతసింహుని నంబరుజయసింహుని మాయోపాయంబుల రూపుమాపితి
రన్నవిషయ మిదివఱకే దేశమంతటను వ్యాపించినది. రాజునకుఁ దనరాజ్య
మందలి ప్రజలను దనబిడ్డలవలెఁ గాపాడుట కర్తవ్యముగాని పలుతెఱగులఁ

హింసించుటకాదు. అట్టిరాజు రాజాధముఁడని యెన్నఁబడుచున్నాఁడు. అట్టి వాఁడు రౌరవాదినరకంబులఁ బొందుట నిక్కము. నిరపరాధులగుబ్రాహ్మణులు సన్యాసులు భక్తులు మొదలగువారిని దయాశూన్యుఁడై హింసించుట రాజ నీతిదూషిత మనియు నపయశస్సునకు హేతువనియు, మీఁదుమిక్కిలి నరక మూలమనియుఁ జక్రవర్తిగా రెఱుంగకుండుట చాలశోచనీయము.

తమరు మహమ్మదీయమతోద్ధరణకై బద్ధకంకణులై తిరని నేనెఱుంగుదును. అందుల కెంతయు సంతోషముకాని తమమతౌన్నత్యముకొఱ కితరమత నిర్మూలనంబొనర్చు టేటినీతియో నాకుఁ దెలియకున్నది. చక్రవర్తులగు మీరు సర్వమతములవారిని నేకదృష్టితోఁ బోషింపవలయును. సర్వవాహినీసముద్రంబునకు గమ్యస్థానం బొక్కటియె యగురీతి సర్వమతస్థులకును దేవుఁడొక్కఁడే యని తలంపవలయును. ఆదేవుఁ డందఱియందును, నన్నిచోటులను వ్యాపించియున్నాఁడు. ఆదేవునే హిందువులు రామకృష్ణనారాయణాది నామములచేతను, బౌద్ధులు బుద్ధభగవానుఁ డనియును, మహమ్మదీయు లల్లా యనియును, క్రైస్తవులు యహోవాయనియును నారాధించుచున్నారు. దేవుఁ డొక్కఁడేయనియు నతనిదృష్టి కందఱును సమానులనియుఁ, సర్వమతములసారమై యొప్పుచున్నది. తమ రిఁక మీఁదటనైనఁ దగురీతిఁ బ్రవర్తింపవలయు నని కోరుచున్నాను.

మీరు ప్రస్తుతము, పేదలగు హిందువులపైఁ బన్నులవిధించుట మంచిది కాదు. మీరు వారిపై దౌర్జన్యముచూపుట 'పిచ్చుకపై బ్రహ్మాస్త్రమును బ్రయోగించు' నట్లున్నది. సర్వజనసమ్మతంబుగ ధరాపాలనంబుఁ జేయుదురుగాక! నాయీసాహసంబునకు క్షమింతురుగాక.

ఇట్లు<br>
తమశ్రేయోభిలాషి,<br>
రాణారాజసింహుఁడు.

ఇటు లాలేఖను సాంతముగ జదివి యక్బరేమియు మాటాడక యూరకుండెను. అప్పు డౌరంగజేబు "అక్బర్! తెలిసినదా? రాజసింహుని కండకావరము. నాతోఁ గయ్యమునకుఁ గాలుద్రవ్వుచున్నాఁడు. పవిత్రమగు మహమ్మదీయమతమును నిరసించుచున్నాఁడు. ఎక్కుడ తెలిసినవానివలె నీతులు గఱపుచున్నాఁడు.—అక్బర్! చూచితివా? ఈకరవాలసహితంబగు ముద్ర. రాజసింహుఁడు నన్ను బెదరించునట్లు తోఁచుచున్నది. కానిమ్ము. ఔరంగజేబుపరాక్రమము శీఘ్రముగ నెఱుంగుఁగాక!" యని నుడివెను.

తండ్రివాక్యము లాలించి యక్బరు మెల్లన నిట్లనియెను. "తండ్రీ! కరవాలచిహ్నాంబగు నీముద్ర మిమ్ము బెదరించుటకుఁగాదు. అది వారియాచారమై యుండును. నేను గొంతవఱకు వారియాచారవ్యవహారముల నెఱింగి యుండుటచే నాకది బెదరింపుగఁ దోఁచుటలేదు."

ఔరంగజేబు:—ఎటులైనఁ గానిమ్ము. రాజపుత్రులగర్వ మడంపవలయును. అక్బర్! నేను రాజపుత్రుల నెంతయు గౌరవించితిని. గొప్పగొప్ప యుద్యోగముల నొసంగితిని. తుదకువారు మదించి కన్నుగానక నన్నే యెదిరింపఁదొడఁగిరి. ఇట్టి కృతఘ్నుల నింకెట్లునమ్ముట? నీ వేచెప్పుము? ఒకరి ననసేల? నా యవివేకమే నన్నింతదనకుఁ దెచ్చినది. ఇంతవఱకు నోర్చియుంటిని. ఇఁక నోర్వఁజాలను. సర్వరాజపుత్రుల నుక్కడంప నేఁటినుండియే బద్ధకంకణుండనయ్యెద. నన్నెదిరించువాఁ డెవ్వఁడో? చూచెదఁగాక!

అని వీరావేశంబునఁ బలుకువాక్యంబుల నాలకించి యక్బరు నిశ్చేష్టుఁడైపోయెను. నేఁడు పొందినకోపము నౌరంగజే బెన్నఁడునుఁ బొంది యుండలేదు. అతనికోపమును జల్లార్చుట కక్బరు సాహసింపఁ జాలఁడయ్యెను. ఎట్టకేల కతఁడు దనకోపమును గొంతవఱకుఁ జల్లార్చుకొని మఱల నిట్లు చెప్పఁ దొడంగెను. "అక్బర్! ఇంకొకమాట చెప్ప మఱచితిని. ప్రస్తుతము రాజసింహునికొమరుఁడు మనచేఁ జిక్కియున్నాఁడు. వాఁడు లోకజ్ఞాన మెక్కు-

వగ లేనివానివలెఁ గన్పట్టుచున్నాఁడు. నీవు మెల్లన నతనితో సఖ్యంబు నెఱపి యుక్తియుక్తముగ వానినుండి వారిరహస్యముల నెఱుంగవలయును. మన యందు వాని కెట్టియనుమానమును గలుగకుండునట్లు ప్రవర్తింపవలయును. తిరిగి వాఁడు తప్పించుకొని పోకుండునటుల నేర్పాటుచేయవలయును. వాని తండ్రిదుండగములకు వాఁడు నిర్బంధవాసశిక్ష ననుభవింపవలయును. మన మతని నిర్బంధమున నుంచిన ట్లతఁడు తెలిసికొనఁ గూడదు. అతనికి కావలసిన సౌఖ్యము లన్నియు నొసంగి వానిబుద్ధి మాఱునట్లు చేయుదము. వాఁడొక వేళఁ దప్పించుకొనఁ జూచెనా? మాయోపాయంబున రూపుమాపుదము. నీవు మాత్ర మతిజాగరూకుఁడవై వారిరహస్యములనెల్ల నెఱుంగవలయును. నా కావిషయంబుల నప్పటి కప్పుడే తెల్పుచుండుము. నీవింక పొ”మ్మని యాతఁ డటనుండి వెడలిపోయెను. అక్బరును దండ్రినుడివినవిషయములనుగూర్చి మనంబునఁ బరిపరివిధంబుల నాలోచించుచుఁ దనదారినిఁబోయెను.

---

# పదుమూఁడవ ప్రకరణము

## హృదయోద్వేగము.

ఇది వసంతసమయము. తన కెంపలయిన ముదంబుఁగూర్చు వసంతాగమనంబున నుద్భవించిన యానందమహాపారావారతరంగడోలికల మనం బుయ్యాలలూగఁ బతులమనంబు లశ్రాంతంబు రంజిల్లఁజేయు సతులవోలికఁ బ్రకృతికాంత త్రిజగన్మోహనాకారంబుగ, వివిధ చిత్రవర్ణములచేఁ జిత్రింపఁబడిన పచ్చనిపట్టుపుట్టంబు ధరియించి సకలాభరణభూషితయై నవయౌవనావిర్భావంబున జనించిన మందహాసవిలాసంబుల వసంతునకు స్వాగతం బొసంగుచున్నదో యన నెటుఁజూచినను లేఁబచ్చికబయళ్లతోడను, సువాసనాయుతంబులగు కుసుమంబులతో నలరారు పూఁబొదరిండ్లతోడను, జిగిర్చి పుష్పించి ఫలించి యాభారంబున నమ్రతవహించిన శాఖాసమూహంబులతో నొప్పు తరులతోడను, నానావిధవిహంగకలకలరావంబులతోడను భూతలంబెల్ల నొప్పారుచుండెను. క్రొమ్మావిచిగుళ్లఁ గడుపార మెక్కి మత్తిల్లి ముదంబునఁ దమప్రియమిత్రులగు మన్మథవసంతాదుల గుణగణంబులఁ బ్రస్తుతించుచున్నదో యన గండుఁగోయిలలు పంచమస్వరంబున శ్రవణపర్వంబుగ గానంబులు సల్పుచుండెను. తన మిత్రుఁడగు వసంతు ననుకరించి గంధవహుండు నానావిధపుష్పసౌరభంబుల నాస్వాదించి మందగమనంబున వీచుచుఁ బథికుల శ్రమంబుఁ బాపుచుండెను. కుసుమసాయకుండు తన చెఱకువింటఁ బూవుటమ్ముల ధరియించి వసంతమలయానిలులు వెంటరా శుకపికశారికామయూరపంక్తులు తన్నుఁగూర్చి గీతంబులఁ బాడుచుండఁ బాంథజనంబుల మనంబులఁ దనబాణంబుల నొవ్వఁజేయుచు విహారంబు సల్పుచుండెను.

ఇట్టి మనోహరవసంతకాలంబున నొక్కనాఁటి సాయంసమయమున వసంతసుందరోద్యానంబునఁ గొందఱు గజగమనలు వినోదంబున విహారంబులు సల్పుచు, వివిధపరిమళకుసుమంబుల సేకరించుచు, వానిసువాసనల నాఘ్రాణించుచు, విహంగకలకూజితంబుల వినుచు, నొండొరులఁ బ్రేమంబునఁ బిలిచికొనుచు, విశాలతరుచ్ఛాయల విశ్రమించుచు, రమ్యముగఁ బాడుచు, మలయానిలస్పర్శంబున జారెడి పయ్యెదల సవరించుకొనుచు, మందగమనంబున సంచరించుచుండిరి. అట్లు వారెల్లరు విహారంబులఁ జల్పుచుండ నందొక్కచంద్రసన్నిభముఖి చెలులవిడిచి వారికిఁ దెలియకుండునట్లుగ నావనంబునంగల యొక్కకాసారంబు సమీపించి స్ఫటికశిలానిర్మితంబులగు నాసరోవరసోపానములపై నాసీనయై యాసారసాకరంబునందలి బిసరుహనాళంబుల ముదంబున భక్షించి కలకలరావంబులుగావించుచు వారివిహారంబులుసల్పు మరాళంబులఁ గాంచుచు శీతలవారికణంబులం గ్రోలి పద్మసౌరభంబుల గ్రహించుచు మత్తిల్లి మెల్ల మెల్లనవీచు మలయపవనంబుచే విహారశ్రమంబుఁబాపుకొనుచు వసుమతీ వసంతుల యన్యోన్యప్రేమమును నేత్రానందముగఁ దిలకించుచుండెను.

అప్పు డమ్మత్తద్విరేఫాలకమనంబున నేమియో యాలోచించుచున్నట్లు పొడగట్టెను. అప్పూఁబోఁడి కొంతతడ వట్టుండి "యహా! ప్రకృతికాంత నేఁడెట్టి మనోజ్ఞాకారమును ధరించియున్నది? ప్రియాగమనంబున నెంతసంతసిల్లుచున్నది? ప్రియుండొసఁగిన యాభరణజాలంబు నెంతసొగసుగ ధరించి ముదంబుఁగూర్చుచున్నది? ప్రియులదాపునంజేరి వారిమనంబుల రంజిల్లఁజేసి వారిమన్ననలఁబడసి వారిప్రేమసింహాసనాధిష్ఠితలగు కాంతలజన్మమే జన్మము.—హా! ఇట్టిదృశ్యంబులు మనోరంజకంబులయ్యు నాకేలనో సంతాపజనకంబు లగుచున్నవి. హా! హతవిధీ! ప్రియుండు దాపునలేనికాంతల ననాథలఁ బీడింపఁబాడియే?—

నామనోహరుఁడగు పురుషపుంగవునిఁ గాంచి చాలదినములయ్యెను గదా! ఆనవమోహనాంగుఁ జూచినప్పటినుండియుఁ బూర్తిగ నాహృదయం

బాతనియందుఁ జిక్కునది. అన్యోన్యకటాక్షవీక్షణపాశంబులచే మాహృదయంబులు రెండు నొకటిగఁగట్టివైవఁబడెను.—హా! ఇదియేమి? ఒక్కొక్కపరి లజ్జాభయంబులు నన్నాక్రమించుచున్నవి. ఒక్కొక్కతఱి మనం బిట్లుద్ఘోషించుచున్నది. 'ఓయబలా! నీకింతసాహసమా! పరపురుషునిం గాంచినతోడనే చంచలచిత్తవై యాతని వరించితివి. నీవు మహారాణియధీనవు గదా? నీవివాహభారమంతయు నామెదియ. మహారాణియుం నీశ్రేయోభిలాషిణియై కులశీలవయోరూపవిద్యాదుల నీకెనయగు రాకొమరునకు నిన్నుఁ బాణిగ్రహణంబు సేయునుగదా?'—

నేను రాచకన్నియనుగానా? రాచకన్నియలకు స్వయంవరంబు విహితంబేకదా? నామనంబునకు నచ్చిన రాకొమరుని వరించితిని. ఇందుఁ దప్పేమున్నది? మనోవాక్కాయకర్మంబుల నా కాతఁడే భర్త. నవవికచాంబుజసన్నిభంబగు ప్రియుని నగుమొగంబు నామనోవీథి సాక్షాత్కరించుచున్నది. అహా! ఆసుందరాంగుని వీక్షించుటచే నానేత్రములు పవిత్రములయ్యె. పూర్ణిమా రాత్రి నన్ను విడిచిచనునప్పుడు ,"ప్రేయసీ! అన్నులమిన్నా! సుగుణపుంజమా! నేను నీదాసుండ. నన్నేలుకొమ్ము. నీయాలింగన సౌఖ్యము నొసంగి పాలింపుము." అని నాచేదోయిఁ గరంబున గీలించి, కరంబు ముద్దుగొని ప్రేమామృతధారలం గురియనాడినవాక్యంబు లెట్లు మఱతును? ఆ మృదుమధురవాక్యంబు లిప్పటికిని నాకర్ణరంధ్రంబుల మాఱుమ్రోగుచున్నవి.—

ప్రియుండు తానువెడలునప్పుడు రాజకార్యార్థమై ఢిల్లీపురంబునకు వెడలుచున్నాననియుఁ దనక్షేమోదంతము లప్పుడప్పుడు రాణిగారి కెఱింగించుచుందుననియుం వాక్రుచ్చియుండెె. కాని యిదివఱకును వర్తమాన మెద్దియుంను దెలియదాయె. ఆతనిక్షేమంబువిన మనం బువ్విళ్లూరుచున్నది.—ఒకవేళ నన్నతఁడు మఱచియుండునా? రాజులు నూతనప్రియులు గారా? పురుషులమనం బెవ్వరెఱుంగుదురు?— ఛీ! మనమా! ఏల నిర్హేతుకంబుగఁ బ్రియునివిషయమున సందేహించెదవు? అతఁడు నన్నుదక్క. నొరుల వీక్షింప

నైన వీక్షింపఁడు. అతఁడు నన్నెన్నటికిని మఱచువాఁడుగాఁడు. కార్యభారంబున మఱచియుండనోపు పోనిమ్ము; లేని పోనిసందేహము లేల పెట్టుకొనవలయును."

అని మనంబునఁ దలపోయుచుండఁ దటాలున నెవ్వరో యామె నేత్రద్వయంబును గరంబుల మూసివైచిరి. ఆముగ్ధ భయభ్రాంతయై విడిపించుకొనఁ జూచెను గాని యాయాగతవ్యక్తి మందహాసము చేయుచు "అమ్మా! అంబాలికా! నే నెవ్వరో చెప్పుము. చేతులఁ దీసెదను." అని మృదుమధురంబుగఁ బల్కెను. ఆమాటలసవ్వడినిఁబట్టి యాయాగతవ్యక్తి చంద్రరేఖయని గ్రహించి "చంద్రరేఖా! విడువుమమ్మా; విడువుము" అని యాహరిణాక్షి మధురంబుగఁ బల్కెను. చంద్రరేఖయుఁ దనకరంబులఁ దీసివేసెను. వారిరువు రొకరినొకరు మందహాసముగావించుకొనుచు నాస్ఫటికశిలాతలంబున నెదురెదురుగ నాసీనలై యిట్లు మాటాడఁదొడఁగిరి.

చంద్ర:— అమ్మా! అంబాలికా! నీవు రాచబిడ్డవు. మేము తక్కువవారము. మీరు మాతో సఖ్యంబు నెఱపుదురా? మమ్ము పలుకరింపనైనఁ బలుకరింతురా? మాతో సుందరోద్యానముల విహరింతురా? మీరు మమ్ము లెక్క సేయకపోయినను, మేము మిమ్మాశ్రయింప వలయునుగదా? చాలసేపటి నుండియు మిమ్ముగానక యీవన నికుంజపుంజంబుల నందందు వెదకి వెదకి తుద కిచ్చోటఁ గాంచితిని.

అంబా:— చంద్రరేఖా! ఊర కిట్టి నిష్ఠురోక్తులాడెదవేల? ఇవ్వనవిహారజనితాయాసం బీశీతలవాతపోతంబుల నపనయింపుకొన నిచ్చోఁ జేరితిని గాని వేఱొండుగాదుసుమా.

చంద్ర:— అక్కా! అంబాలికా! నీవు కొలఁదికాలమునుండియు నాతో సరిగ మాటాడుటలేదు. ఎల్లప్పుడు మనంబున నేదియో తలంచుచుందువు. కొన్నిసమయములం దానందించుచుందువు. మఱికొన్నిసమయములందు విషణ్ణచిత్తవై యుందువు. కారణమేమియో తెలియదు. నాకు నామనంబున

నొకయూహ పుట్టుచున్నది. అదియె నీచింతకుఁ గారణం బైయుండునని తోఁచెడిని. చెప్పుదునా?

అంబా:—చెప్పవలయు మాతము.

చంద్ర:—చెప్పినఁ గోపపడెదవేమో యని భయమగుచున్నది.

అంబా:—పాపము! ఎంతనంగనాచివి. ముక్కుపచ్చలారని పసిదానవు గనుక చాలభయపడుచుంటివి కాఁబోలు.

చంద్ర:—అటులైనఁ జెప్పెదవినుము. రాకాసుధాకరు నమృతకిరణాస్వాదన కుతూహలాయత్తచిత్తంబునఁ దత్తరంబొందు చకోరాంగనవోలె నీ చిత్తంబిప్పుడు ప్రియుని వదనేందుకళలఁ ద్వన్నేత్రచకోరంబులపానంబుఁ జేయ నువ్విళ్లూరుచున్నదికదా?—అవు నవును. ఇందుఁ దప్పేమున్నది? నీవా? నవయౌవనాంగివి. ప్రియుఁడా? కంతుజయంత వసంతాదుల కెన యైనవాఁడు. సమయమా? వసంతసమయము. మన్మథేక్షుకోదండ వినిర్గతంబులగు పుష్పనారాచంబుల నెవ్వరి మనంబులు భేదింపఁబడవు? నీకోరికయుం స్త్రీసహజం బైనదియే గదా? అల్లదే! ఆమల్లికాలతానికుంజము చాటున నొక్కవిహంగమిథునం బెంత యానందమున విహరించుచున్నదో వీక్షింపుము.

అంబా:—(కోపమున) చంద్రరేఖా! నీవుమిగులధూర్తవు. నీకుఁ దగినశాస్తిఁ జేసెదను. చూడుము. (అని తనమృదుపాణితలంబునఁ జంద్రరేఖ చెక్కిలిపై నొకచిన్న ప్రేటువేసెను.)

చంద్ర:—అవునమ్మా! మంచిబహుమాన మొసఁగితివి. "యథార్థవాదీ లోకవిరోధి" యనెడిమాట సార్థకమైనది. నీమనంబునఁగల రహస్యంబు వెల్లడించినందులకా నాకీశిక్ష? ఇంతటికే నాకింత శిక్ష విధించితివి. నీప్రియుం డిన్నిదినంబులనుండి నీసందర్శనంబునకు రానందుల కాతని నెట్లు శిక్షించెదవో? ప్రియుండు రాఁగనే నీబాహుపంజరంబున నాతనిఁ గట్టివైచి గాసిల్లఁజేసెదవని తోఁచెడిని. ఇది నిజముగఁ దగినశిక్షయే.

అంబా:—చంద్రరేఖా! మితిమీఱి పోవుచున్నావు. చాలుచాలు కోప మూకొనుము. నాయొద్ద నింక నిట్టిప్రసంగము తెత్తకుము.

చంద్ర:—(చిఱునవ్వున) అక్కా! కోపగించెద వేల? ఇఁకమీఁద నిట్టిమాట లాడనులే పోనిమ్ము.—నేను నీకాప్తసఖినిగదా? నీమనోభావము లిట్టివని నేనెఱుంగఁగూడదా? దయయుంచి నాకెఱుంగఁజెప్పుము. వీలున నీమనోభీష్టసిద్ధికై పాటుపడెదను.

అంబా:—చెలీ! నిక్కముగఁ బల్కుచుంటివా? లేక హాస్యమునకుఁ బలుకుచుంటివా?

చంద్ర:—నిశ్చయముగనే పల్కుచుంటిని. నీతోఁ బరిహాసము లాడుదునా?

అంబా:—అటులైన నీయూహ నిశ్చయమనియే తెల్పుచున్నాను.

చంద్ర:—(నవ్వుచు) సెబాస్! సెబాస్! ఎంతగట్టిదానవమ్మా!

అంబా:—చెలీ! నీపరిహాసవాక్యంబుల నన్నేల నొప్పించెదవు? నాకాప్తురాల వగు నీవే యిట్లు చేయ నే నింకెవ్వరితో మొఱపెట్టుకొందును?

చంద్ర:—అంబాలికా! ఎంత పిచ్చిదానవమ్మా! ఇంతమాత్రమునకే ఖిన్నత నందుదువా? ఉల్లాసంబున నుండుము.

అంబా:—చెలీ! సమాచారము లేమైనఁ దెలియవచ్చినవా?

చంద్ర:—క్రొత్తసమాచారము లే మున్నవమ్మా. ఉదయనగరమునుండి రాణి గారి కొకలేఖ వచ్చియుండుటఁ గాంచితిని.

అంబా:—(సంభ్రమమున) ఆ! ఏమేమి? ఉదయనగరంబునుండియా?

చంద్ర:—చెప్పెదను వినుము. భీమసింహుఁడు ఢిల్లీపురంబునకు వెడలి యనేకమాసములు గావచ్చుచున్నదనియుం, రాకపోకలవిషయమైగాని, యతనియనుచరులవిషయమైగాని యిదివఱకు కణంమాత్రమైనఁ దెలియలేదనియుం, ఔరంగజేబుతో సంగరము గానున్నదనియుం, సర్వరాజపుత్రసేనల నాయత్తపఱుపవలయుననియుం, రాణా రాజసింహునకు లేఖవంపియున్నాఁడఁట.

అంబా:—ఏమేమి? ఆర్యపుత్రునివృత్తాంత మేమియుఁ దెలియుటలేదా? ప్రియసఖీ! చంద్రరేఖా! నామనం బేలకో భయంబు నొందుచున్నది.

చంద్ర:—సహజమే గదమ్మా.

అంబా:—చంద్రరేఖా! నన్ను బరిహాసింపకుము. నిశ్చయముగ నాకేమియుఁ దోఁచుటలేదు. ఓదీనజనరక్షకా! ఓకరిరాజవరదా! ఓరమావల్లభా! నాప్రియున కెట్టియాపదలు లేకుండఁ గాపాడుము. సర్వమునిబృందారకాదిసంసేవ్యంబగు నీపవిత్రచరణకంజంబుల కిదె మ్రొక్కెదాను. రక్షింపుము. రక్షింపుము.

చంద్ర:—అంబాలికా! భయ మందవలదు. నీప్రియున కేయపాయంబును బొడమదు. అతఁడు చక్రవర్తిమాయోపాయంబులకు లోఁబడువాఁడు గాఁడు. అతఁడు శీఘ్రముగ రాఁగలండు. నీవు చింతదక్కియుండుము.

అంబా:—చంద్రరేఖా! యుపశమనవాక్యంబులఁబల్కి ధైర్యంబు గల్పించుదానవు నీవొక్కతెవేసుమా. నీవంటినెచ్చెలినిఁ బొందఁగల్గినందుల కే నెంతయుం ధన్యను.

చంద్ర:—(చిఱునవ్వున) సఖీ! నీకెంతయుం ధన్యవాదములు. ఇంకొకవిషయమును జెప్పమఱచితిని.

అంబా:—ఏవిషయమును జెప్పమఱచితివి?

చంద్ర:—నీవిషయమే. నీవివాహవిషయము. నిన్నొక్కరాకొమరున కిచ్చి వివాహంబుసేయ మహారాణి తలంచుచుండెను.

అంబా:—ఏమేమి? నావివాహవిషయమా? హా! నావంటిమందభాగ్య కలదా? 'ఖారిద్రైవోపహతుండు పోవుకడకుం బోవుంగదా యాపదల్.' అనురీతి నాపద లన్నియుం నొక్కుమ్మడి నన్నావరించినట్లు తోఁచెడిని. నాహృదయము మిడిపఱకే యొక్కరాకొమరునికి దత్తం బయ్యెనని రాణి యెఱుంగదు కాఁబోలు. నే నావిషయము రాణిగారితోఁ దెల్పగలనా? నిశ్చయముగ

చెల్పఁజాలను. చంద్రరేఖా! చంద్రరేఖా! నన్నిప్పుడు రక్షించువా రెవ్వరు? నన్నీవిపత్సముద్రమునుండి దరిఁ జేర్చి నాప్రాణప్రియునిఁ గలిసి కొనున ట్లనుగ్రహింపుము.

చంద్ర:—అక్కా! అంబాలికా! శోకింపకుము. నీవివాహవిషయ మిప్పు డాపఁబడినది. ప్రస్తుత మారంగజేబుతోఁ గయ్యమునకు సంసిద్ధులగుచుండ నిపుడు పెండ్లిగోడవ యెక్కడ? ఇంతలో నీప్రియుండు తప్పక తిరిగి రాఁగలఁడు. నిన్నెట్టులైన వివాహ మాడఁగలఁడు. అంతదనుక ధైర్యంబుఁ జిక్కఁబట్టుము. నేనుండ నీకేవిపత్తును రాదని నమ్ముము. ఊరకడిల్లుకుము చుచను నీకు శుభమే చేకూరునని నమ్మెదను. పోవుదము రమ్ము.

అని యనుకొనుచు వారావనమార్గంబు నిర్గమించి వెడలిరి.



# పదునాల్గవ ప్రకరణము.



## గోకులదాసు

మనకథాకాలంబున రాజపుత్రస్థానమంతయు నొక్కటిజేసి పాలనం బునంగాక కొన్నిరాజ్యములుగ నేర్పడి, బలశౌర్యసాహసధైర్యయుక్తులుగా ప్రసిద్ధి గాంచిన పలువురు రాజపుత్రప్రభువులచే బాలింపబడుచుండెను. అట్లేర్ప డినరాజ్యములకెల్ల మేవారురాజ్యము ప్రమానికము వంటిది. రాణారాజ సింహులు నారాజ్యమున కొడయుండని మన మిదివఱకే యెఱింగియున్నాము. ఈరాజ్యమునకు బదునాఱుసామంతరాజ్యములు చేరియుండెను. అట్టిసామంత రాజ్యములలో 'బికనీర్' రాజ్య మొకటి. బలశౌర్యధీయుక్తులును, ప్రభుభక్తి పరాయణులును న్యాయశీలురును నగు ప్రభువు లాసంస్థానమును బాలించిరి.

బికనీరురాజ్యము మంచిస్థితియందుండెను. రాటూరువంశభూషణుం డగు థాకూరుగోకులదాసు సంస్థానము నిప్పుడు పాలించుచుండెడివాఁడు. బిక నీరునగరముచుట్టును, నున్నతంబగు కోటగోడ శత్రురాజుల కభేద్యమై విల సిల్లుచుండెను. ఆకోటసింహద్వారమున నిశితకృపాణపాణులగు రక్షక భటులు కావలిగాయుచుండిరి. లోనున్న చక్కనిరాజసౌధంబు నేత్రపర్వం బొనర్చుచుండెను. ఆనగరుచుట్టును బాషాణనిర్మితంబగు నున్నతప్రాకారంబు విరాజిల్లుచుండెను. ఆనగ రెప్పుడును రక్షకభటసేవితంబై యొప్పుచుండెను. మధ్యభాగంబున విశాలంబగు సభామంటపంబును దాని కొకప్రక్కన నార్ చనాగారంబును మఱియొకవంక నుద్యోగశాలయును వేఱొకవంక శయనా గారంబులు నింకొకయెడ నంతిపురంబులు మఱియొకచో విలాసభవనంబులు మొదలుగాఁగల రమ్యప్రదేశంబులుకల్గి రాజసౌధము విరాజిల్లుచుండె.

అం దొక్క విశాలభవనం బతిరమ్యంబుగ నలంకరింపఁబడి యుండెను. స్ఫటికకుడ్యంబుల నతిమనోహరంబుగ సమర్పఁబడిన దర్పణంబు లాగృహ వైభవంబులఁ బ్రతిఫలింపఁజేయుచుండెను. ప్రణయినీప్రణయచిత్రంబు లందం దమర్పఁబడియుండెను. చిత్రవిచిత్రములగు జవనికలందందు వ్రేలాడుచుండెను. మృదులాసనము లక్కడక్కడ వేయఁబడియుండెను. అం దొక్క హంసతూలికాతల్పంబున నొక్క పురుషుం డాసీనుఁడైయుండెను.

ఆతనివయస్సు దాదాపిరువదియైదేఁడు లుండవచ్చును. ఆతని నుపలక్షించిన సుందరాకారుండని చెప్పక తప్పదు. గంభీరవదనము నూతనప్రాదుర్భావంబగు మిసమిసని పసలుదేరు నల్లనిమీసంబులును, సున్నితశీర్షకంబును కర్ణకుండలకాంతిజాలంబుతో నెకసక్కెంబులాడఁజాలు నెగుభుజంబులును, బలిష్ఠకాయంబును నాతనిశక్తిసామర్థ్యతేజోవిశేషంబులఁ దెల్పుచుండెను. అప్పటియాతని వేషమును బరిసరప్రదేశమును జట్టిచూడ నాతఁడు కొంత వఱకు విలాసపురుషుం డని తెలియవచ్చును. ఆతఁ డొక్కింతమధుపదార్థముల సేవించుచు 'రామా' యనిపిలువఁగనే సేవకుఁ డొకఁడు లోని కరుదెంచి వినయంబున నాతనికి మ్రొక్కి ప్రభునాజ్ఞకై వేచియుండ నపుఁ డిట్లనియెను.

పురు:—రామా! తాంబూలమును హుక్కాయును మందుబిరడాయును
గొనిరమ్ము. త్వరగరమ్ము.

రాము:—చిత్తము.

అని యాసేవకుఁడు లోనికరిగి కొంతసేపటికొక రంగులీను బంగరు పళ్లెరంబునఁ గర్పూరతాంబూలంబును, హుక్కాయును మందుబిరడాయును గొనివచ్చి ప్రభుసన్నిధి నునిచి వెడలెను. అయ్యువకుఁడు కొంతవఱకు హుక్కాను బీల్చి యొకగుళికమందును సేవించి తర్వాతఁ దాంబూలచర్వణంబుఁగావించి, యమ్మృదుతల్పంబునఁబరుండి ప్రక్కనున్నపుస్తకముల బీరువానుండి శృంగారరసప్రధానంబగు ప్రబంధం బొండుగొని పఠనంబునఁ

చదువఁబోఁడగెను. గ్రంథమును జదువఁజదువ నాతఁడానందసాగరంబున
నోలలాడుచుండెను. పొత్తమునందే మనంబు లీనమగుటంజేసి నిద్రయు
నాతని నావరింప దయ్యెను. కొంతవడి కతఁడు పొత్తము మూసి యిట్లు
తలంచె.

"ఆహా! పుండ్రేక్షుచాపనిర్గతనిశితపుష్పనారాచప్రఘాతముల కెవ
రుఁగు పుష్పైకంటుల యపాంగదృగ్బాణజాలప్రహారము లెవ్వనిహృదయం
బును జిల్లులఁబఱచి చాంచల్యంబు నందఁజేయవు? దిట్టతనంబున దట్టిబిగించి
బింకంబునఁ బంకజాసను బ్రార్థనంబుసల్పు గాధిపట్టిపట్టాతపము నిమిషంబునఁ
బటాపంచలగునట్లు చేసిన దొక్క హరిణాక్షి కటాక్షవీక్షణజాలంబు లేగదా!
ఎట్టియింద్రియనిగ్రహుండైన నిందీవరాక్షుల రూపరేఖావిలాసవిభ్రమంబులం
[illegible]నే వారియిండ్లబందాలు గావలసినదే కదా? —మన్మథా! నీశర
ములు [illegible]యెంత బాధాకరంబులు? పద్మోమావాణీపతులే
నీపుష్పబాణంబుల దెబ్బపడియుండ మే మెంతవారము? —

చెలజవ్వనుల పొందుగసుఖించుభాగ్య మెంతటిపుణ్యవంతులకో కదా?
నవమోహనాంగుల లావణ్యతారుణ్యవిభ్రమవిలాసంబులఁ దిలకింపని నేత్ర
సౌభాగ్యం బెందులకు? మృదుమృణాళఖండములు ముదమార మెసవి
ముదంబునం బలుకు మరాళకూజితంబులకును, గ్రొమ్మావిచిగుళ్ల మనసారభక్షించి
గానంబులు సలుపు గండుఁగోయిలల కలకలారావంబులకును సాటియనందగు
కీరవాణులమృదుమధురప్రియాలాపానుశ్రవణమునఁ బవిత్రంబుగాని శ్రో
త్రంబు లెందులకు? అలివేణుల దాపునంజేరి నిండారుప్రేమంబున మెలఁగి
దన్మయత్వంబు నొందనివానిజన్మ మేల? మానవు నైహికాముష్మికసుఖంబు
నకు స్త్రీ లేకదా ఆధారము. వివిధాధ్వరజపానుష్ఠానహోమాదులం జేయుట
నాకంబున రంభాదులంగూడి సుఖించుటకే కదా?" యనుకొనుచుఁ జిత్త
రువులం గని, "అల్లదే! యాచిత్రపటంబున నొకగోపకామిని కామినీచిత్త

చోరుండగు కృష్ణునిఁ గౌఁగిట బంధించి యెట్టధరపానంబు గావించుచున్నది?
మఱియొకయెడ నొక ప్రౌఢవనిత మందస్మితాననయై విశాలనేత్రాంచలంబులఁ
బ్రణయావలోకనకాంతుల నెట్లు ప్రియునిపై గురిపించుచున్నది! ఇంకొకచోఁ
బ్రియుండు ప్రియురాలిఁగూడి సరోవరతీరంబున, శశికాంతమణివేదికలుగల
పూఁబొదరిండ్ల నిబిడచ్ఛాయల నెట్లు విహరించుచున్నాఁడు?

ఆహా! ఈదృశ్యములను గాంచినకొలఁది మరుండు నిర్దయుండై పుష్ప
శిలీముఖంబుల నాహృత్పద్మంబును భేదించుచున్నాఁడు. ప్రియురాలితోడి
సౌఖ్యంబులఁ బొందనివాని జన్మమేల? ఇంతవఱకు నవివాహితుండనై
యున్నదిచాలును. ఎంతయు ననుకూలవతియగు కాంతాలలామంబును గూడి
యుండని నాకేసంపదలేల? రాజ్యమేల? జీవితమేల? కులరూపవిద్యాశీలముల
నసమానయగు కాంతారత్నంబు నరయ భూసురులం బుత్తెంచెద. కమలహీనం
బగు కమలాకరంబుచాడ్పున, విమలవిజ్ఞానంబులేని విరాగిచందంబున, హిమ
ధాముఁడు లేనిరాత్రిచొప్పున, సౌశీల్యంబులేని చెలువపోలుపునఁ, బరిమళ
రహితంబగు పుష్పంబుభాతి, నమాత్యహీనంబగు రాజ్యంబువోలె, యౌవన
వతియు, రూపవతియు, సుశీలయు, విద్యావతియుఁ, గులీనయు, ననుకూల
వతియునగు నర్ధాంగినిఁ బడయనివానిధనంబు యౌవనంబు రూపంబు జీవి
తంబు నివి యది యననేల సర్వంబు వ్యర్థంబు.

ఆ! జ్ఞప్తికివచ్చినది. మహారాణి పోషణయం దొకరాకొమరిత యున్న
దనియు నామె కెనయగు సుందరాంగు లీజగంబున లేరనియుఁ, గళంకితచంద్ర
బింబంబుఁ గాంచి యబ్బాలవదనేందుబింబం బపహాసించు ననియు, నమ్మది
రాక్షి మేనికాంతికి సాటిగాక బంగారంబు పంచాగ్నిమధ్యంబునఁ దపంబు
గావించి పవిత్రంబు నొందుచున్న దనియు, ననన్యరూపరేఖావిలాసంబుల
నమరకాంతారత్నంబులఁ గ్రిందుసేయుననియు వినియున్నవాఁడను. కాని
మంచిసమయము లభింపకున్నది. యుద్ధసమయంబులఁ గొంచెమైనఁదీరిక

లేకున్నది. త్వరలో మహారాణి సందర్శనార్థమై పోవలయును. అప్పుడు నాకోర్కె నెఱవేఱఁగలదు.”

అని యతఁ డిట్లు మనంబునఁ దలపోయుచుండ రాముఁడు లోనికరుదెంచి బద్ధాంజలియై వినయంబున నిట్లు పల్కె. “మహాప్రభూ! నూతన పురుషుం డొకఁడు తమదర్శనార్థమైవచ్చి బయట వేచియున్నాఁడు. తాను జోధ్పురమహారాణిగారియొద్దనుండి వచ్చియున్నాననియుఁ దక్షణమే తమ్ముఁ దర్శింపవలయు ననియుఁ గోరుచున్నాఁడు. దేవరవారియనుజ్ఞ యైన లోనికిఁగొనివచ్చెద.”

ఆపల్కు లాలించి “ఆ! ఏమిది? మహారాణిగారు మనిషిఁ బంపిరా? ఏమికార్యార్థమైయుండును? రామ! వెంటనే యానూతనపురుషుని గొని రమ్ము. పో”మ్మని నుడివెను.

రాముఁడును దక్షణమే వెడలి యానూతనపురుషుని ప్రభుసన్నిధికిఁ గొనివచ్చెను. ఆనూతనపురుషుఁడు లోనికరుదెంచి వినయపూర్వకముగ వందనంబు లాచరించి ముకుళితకరుండై “మహాప్రభూ! నేను జోధ్పురమహారాణిగారి భృత్యుఁడను. మహారాణిగారు తమ కొకలేఖను బంపియున్నారు” అని యొకపత్రమ్ము నాయువకుని సన్నిధానమున నునిచి యొకమూల నిలుచుకొని యుండెను.

ఆయువకుఁ డాలేఖఁగొని మనంబున నిట్లు చదువఁదొడఁగెను.

“రాటూరువంశ భూషణుండును, సామంతరాజకులాలంకారుండునునగు ధారూరు గోకుల దాసుగారికి జోధ్పూర్ మహారాణి వ్రాయు లేఖ:——

ఆర్యా! రాణారాజసింహుఁడు, తనకొమారుఁడగు భీమసింగు ఢిల్లీపురంబు నకువెళ్లి దాదా పాఱుమాసములు గావచ్చుచున్నదనియు, నాతనియొక్క గాని నాతనియనుచరులయొక్క గాని వృత్తాంతమేమియుఁ దెలియలేదనియుఁ, దనలేఖంగాంచి చక్రవర్తి కుపితుండై త్వరితంబున మనపై దాడివెడల

నున్నాఁడని చారులవలన వినవచ్చుచున్నదనియుం, నందుచే సర్వరాజపుత్ర సామంతరాజులు వారివారిబలంబుల నేకరించుకొని సాయమొనర్ప వేగంబున రావలయునని యు, నాజ్ఞాపత్రమును బంపినాఁడు. ఆయాజ్ఞాపత్రమునుకూడ నిందు వెంటఁ బంపియున్నాను. కాన మీరు తత్క్షణమే మీబలములఁ గొని యుచ్చోటునకు వచ్చి చేరవలయును."

ఇట్లు
కొమరుదేవి (జోద్పురమహారాణి).

జాబును సాంతముగఁ జదివి యామొదవకుఁడు "రాణిగారియాజ్ఞ మేరకే చేసెద న"ని యాసేవకునిఁ బంపివేసి మనంబున నిట్లు తలంపఁ జొచ్చెను. "ఆహా! అడఁబోయిన తీగ్గ యెదురైనట్లు రాణిగారినిఁజూడ నభిలషించు నాకు రాణిగారి నుండియే యిట్టిలేఖవచ్చుట కార్యానుకూలమగుటకు ముఖ్యము. మంత్రులకు దండనాయకులకు నీవృత్తాంతంబు నెఱింగించి వారియాలోచనంగొని సత్వరంబున రాణిగారిని దర్శింపఁబోయెద. అప్పుడు నాచిత్త మపహరించిన యచ్చంచలాక్షిని బొడగాంచు భాగ్య మబ్బఁగలదు. సమరంబున జయలక్ష్మితోపాటు నాకన్యాలక్ష్మిని నైతము, వరించివచ్చెద"నని పరిపరివిధంబుల సంతసించుచు శృంగారాగారంబు విడిచి యాతఁ డెచ్చటికో వెడలెను.

# పదునేనవ ప్రకరణము

## నిర్బంధము

"సుల్తాన్! నేనెంతయుం ధన్యుఁడను. కలవని తలంపుగ మొగలు సామ్రాజ్యంబున నాకింతటి గౌరవైశ్వర్యంబులు లభించినందుల కే నెంతయుం సంతసించుచున్నాను. నాసుకృతమున కేమందును? మీవంటియుదారుల స్నేహ మొదఁగూడినది. ఆహా! చక్రవర్తిగా రెంత యుదారహృదయులు! వారికి రాజపుత్రులయెడ ద్వేష మెక్కుడని విని యుంటినిగాని నాకిప్పు డది కల్లగఁ దోఁచుచున్నది. నేనెక్కడ? ఈయఖండసామ్రాజ్యాధీశ్వరుండగు నౌరంగజేబుపాదుషాగా రెక్కడ? ఇట్టిసమాదరణ మెక్కడ? అక్బరుమహా శయా! నేను వారి కెంతయుఁ గృతజ్ఞుఁడను." అని యొకనాఁటి యంద యమున నొక్కసౌధంబున నాసీనుఁడై యున్న యువకుఁడు దనప్రక్కనఁ గూర్చుండియున్న మఱియొక యువకుని సంబోధించి పలుకుచుండెను.

అక్బరు:— భీమసింహా! నీవు రాయబారివై వచ్చియున్నావు. రాయబారులు సర్వవిధముల గౌరవనీయులు. వారి నాదరించుట రాజధర్మము. ఆలంగీరుపాదుషా పాత్రాపాత్రావివేచనానిపుణుఁడు. మీఁదుమిక్కిలి రాజనీతి తంత్రజ్ఞుఁడు. అందుచేత నీవింతగ గౌరవింపఁబడుచున్నావు.

భీమ:—మహాశయా! మీరు సత్యమును బలికితిరి. అంసులకుఁ జక్రవర్తిగారొసంగిన యీయమూల్యపారితోషకంబులే నిదర్శనములు. ఇటుచూడుఁడు. కడచినదినమునఁ జక్రవర్తిగారు నా కీవజ్రపుటుంగరమును, నీరతనాల హారమును బహుమానముగఁబంపిరి. వారియాదరణము కేవలము నన్ను వశునిగఁజేసివైచినది.

అక్బర్:—భీమసింగ్! నిన్ను జూచినదాదిగ నీయందుఁ జక్రవర్తిగారి
కమిత ప్రేమ జనించినది. తనకు గర్భశత్రు వగు రాజసింహునిపుత్త్రుఁడవైనను
నీయందాతనికిఁ బ్రేమయని తెల్పుటకీ యుపాయనములే సాక్షులు.

ఆని వా రిటులమాటలాడుచుండ భటుఁ డొకఁడులోనికరుదెంచి
యక్బరుభీమసింగులను వినయపురస్సరంబుగ వందనంబు లాచరించి, భీమసింగు
నుద్దేశించి "మహాప్రభూ! నేటిదినము చక్రవర్తిగారు తమ కీకానుకలఁబంపి
యున్నారు." అని కొన్నిపట్టుపుట్టంబుల నునిచిన యొకపళ్లెరంబు నాతనిముం
దుంచెను. భీమసింగా కానుకలను గృతజ్ఞతాపూర్వకముగ నందుకొని యాసే
వకునిఁబంపి యక్బరును సంబోధించి "మహాశయా! చూచితిరా? చక్రవర్తి
గారియాదరణము. ఇందులకుఁ దగురీతి నేనెట్లు వారిని బహూకరింపవల
యునో యెఱుంగఁజాలకున్నాను.?

అక్బరు:—భీమసింగ్! ఆలంగీర్ పాదుషాగారి సద్గుణంబుల నీవిప్పుడు
చక్కఁగ నెఱింగితివి. నేను జాలసంతసించితిని. భీమసింగ్! నీకొక్కసంతో
షవృత్తాంతమును జెప్ప మఱచితిని. ఇప్పుడు జ్ఞప్తికి వచ్చినది. చక్ర
వర్తిగారు నిన్నింకనుఁ గొన్నిదినంబు లిందే యుంచుకొని తగురీతి గౌర
వించి పంపఁదలంచియున్నారు. చక్రవర్తిగారికి నీయందుఁగల్గిన యపార
ప్రేమయే యిందులకుఁ గారణము.

భీమ:—అక్బర్ సుల్తాన్ గారూ! చెప్పుచున్నాను వినుఁడు. నే నుదయనగరం
బున నుండినప్పుడైన నిట్టిగౌరవాదులఁ బొందియుండలేదు. చక్రవర్తి
గారు మీ రన్నట్లు పాత్రాపాత్ర వివేచనా నిపుణుఁడగుటం జేసి, నన్ని
విధముల సత్కరించుచున్నాఁడు. చక్రవర్తిగారు ప్రశంసాపాత్రులు.
వారు నన్నొక్కింతకాల మిచట నిల్ప నిచ్చగించుచుండ సేవలవను
వాఁడనా? నిశ్చయముగ వారియాజ్ఞానుసారమే యుండెద నాకింతకంటె
వేఱెద్దికావలయు? 'సిరి రా మోకాలొడ్డువాఁ డుండునే?' చక్రవర్తిగారి

యాజ్ఞల శిరసావహించి నెఱవేర్ప నెల్లవేళల వేచియుండుదునని నానూ
టగా చక్రవర్తిగారితో నుడువుడు.

అక్బరు:—భీమసింగ్! చాలసంతోషము. అటులనే తెల్పెదను. కాల మతి
క్రమించుచున్నది. కొన్నితొందర పనులుండుటచే వెళ్లవలసియున్నది.
రేపటిదినము మఱల జూడవచ్చెదను. ప్రస్తుతము సెలవుగొందును.

అని యక్బరు సౌధంబువెడలి చనియెను. భీమసింగు గతిఁదలంచెను.
ఉదయపునగర రాజ్యమునకును, దనతండ్రికిని గన్నశత్రువగు సామ్రాట్టేయు
తన్నిట్లు గౌరవించుటంజూడ నాతని కాశ్చర్యం బయ్యెను. వెంటనే యాతని
కందళిభావము స్ఫురించెను. రాజామానుసింగు మాటలు జ్ఞప్తికి వచ్చెను.
తన్ను మోసగింప నాతఁడిట్లు కృత్రిమాదరణము చూపుచున్నాఁడని యతఁడు
గనుఁగొనెను. చక్రవర్తి తన్నెంతయు నపాయకుఁడని తలంచుట తనకెం
తయుం మేలని భీమసింగు తలంచెను. తనపైఁ జక్రవర్తికిఁగల యుద్ద్వేష్యము
మఱింత వృద్ధిపఱచుటకై వైనుపహరించిన తెఱంగున నక్బరుతోఁ గృతజ్ఞతా
వాక్యంబుల నాతఁడు పల్కియుండెను.

అక్బరుసుల్తాన్, తండ్రివంటివాఁడుకాఁడు. నిష్కల్మషహృదయుఁడు.
ధైర్యబలసాహసవంతుఁడు. స్నేహపాత్రుఁడు. ఉదారుఁడు. సజ్జనప్రియుఁడు.
అతనిమాత, రాజపుత్రవనిత. అందుచే నతనికి హిందూమతమందుఁ గొంత
యభిమానము. హిందూమహమ్మదీయులసఖ్యంబు నాతఁడెప్పుడును గోరు
చుండెను. తొలుదొల్తఁ దండ్రియాజ్ఞానువర్తియై యాతఁడు భీమసింగుతోఁ
గృత్రిమసఖ్యంబుఁ గావించెను. తన్మూలమున రాజపుత్రులరహస్యముల నెఱుంగఁ
గోరెను. కాని భీమసింగువివేకము, నిర్మలహృదయము, స్నేహము మొదలు
గాఁగలసద్గుణంబులఁ గాంచి యతనితోఁ గృత్రిమస్నేహంబు సేయఁజాలఁ
డయ్యెను. చంప నరుదెంచిన శత్రువైనను సజ్జనశ్రేష్ఠులముఖారవిందసందర్శనం
బుననే తనఘోరకార్యంబులకు లజ్జించి పశ్చాత్తాపంబు నొందునుగదా?
సత్పురుషసాంగత్యము, వారిదర్శనము శుభదాయకంబులుకదా? భీమసింగు

వంటి సజ్జనపురుషుని గాంచగనే యక్బరు కపటస్నేహము మాయ మయ్యెను. అనుదినము భీమసింగునుసంపర్కసార్థమై యక్బరేతెంచుచుండెను. కాలము గడచినకొలఁదిని వారిస్నేహము శుక్లపక్షశశాకరునిమాడ్కి నభివృద్ధియగుచుండెను.

ఆగావుండవలె లిరువురు నిష్టకథలఁ గాలంబుఁబుచ్చుచుండిరి. అప్పుడప్పుడు రాజ్యాంగవిషయములనుగూర్చి చర్చించుచుండెడివారు. భీమసింగు చక్రవర్తియొంపారసుణముచు బలుమఱుఁ బొగడుచుండెడివాఁడు. వారు వేఁటలను గుఱించి ముచ్చటించుచుండిరి. భీమసింగు తాను వేఁటయందు నొప్పవరాహంబునుఁ బరిమార్చినవిధంబును విశదముగ నక్బరునకుఁ దెలియఁజేసెను. అక్బరు తానొక్కపరి, మదోద్రేకంబునఁ జెలరేఁగి స్వేచ్ఛావిహారంబునల్పుచు నడ్డమువచ్చిన వారినెల్ల మృతిబొందించుచుండిన దంతావళంబుతోడఁ బోరి దానిదర్పంబుఁ దనదోర్బలంబున రూపుమాపుటయుం, నింకొకసమయంబున విజృంభించి పైకుఱికి తన్ను జీల్చి చెండాడనుంకించుచుండిన యొద్దాండపుండరీకంబును స్వకీయని నిశితకృపాణంబున మృతిఁజెందించినదియుం, భీమసింగునకుఁ జెప్పెను. అక్బరు శక్తిసామర్థ్యంబులను విన్నప్పుడు భీమసింగుదేహ మువొంగుచుండెను. తానుగూడ నాతనివలెఁ దనశక్తిసామర్థ్యంబులఁ జూపుకాలమెన్నడువచ్చునా? యని చింతించుచుండువాఁడు.

భీమసింగీరీతి మొగలురాజ్యంబునఁ గాలముఁగడపుచుండెను. భీమసింగు కడుచతురుఁడు. చక్రవర్తి తన్నుమాయకుఁడని తలంచుచున్నాఁడని చక్రవర్తియభిప్రాయమును మఱింత యభివృద్ధినొందించుటకై యాతఁడేమియు నెఱుంగనివానిపోలిక నటించుచుండెను. చక్రవర్తి యని గాంచి, భీమసింగులోకానుభవములేనివాఁడని యాతని బుజ్జగించి, గౌరవించి, యాతని నుండి రాజపుత్రుల రహస్యముల నెఱుఁగఁదలంచెను. మోసగానిని మోసమున నే జయింపవలయునని తలచి భీమసింగుగూడ తగినయుక్తిఁ బన్నుచుండెను.

ఆహా! కాలచక్ర మెంత త్వరితముగఁ బరిభ్రమించుచున్నది. భీమసింగు ఢిల్లీ కరుదెంచి దాదా పిప్పు డాఱుమాసము లైనది. మొదటి రెండు మాసములవఱకు మొగలు దర్బారునందలివింతలను దిలకించుచు సంతోషమునఁ గాలముఁగడపెను. చక్రవర్తియు నాతని నెక్కుడుగ గౌరవించుచుండెను. మొదటిదిన మొకనిమిషముగ నాతఁడు గడపెను. కాని రానురానందలివిషయములం దతనికి నిస్పృహ జనింపఁజొచ్చెను. తుద కాతని కొక్కదినము గడపుటొక్కయేఁడుగఁ దోఁచుచుండెను. ఈవిషయము లొక్కటియైన నాతని చెవినిఁ బడుటలేదు. మాతృభూమివిషయముగాని తలిదండ్రులవిషయముగాని శ్రీకృష్ణవిగ్రహారక్షణంబుగాని తనమనోహారిణివిషయంబుగాని యాతనికణుమాత్రమైనఁ దెలియుటలేదు. తుదకుఁ దనతో వరుదెంచిన యనుచరులవృత్తాంతమేనియు నాతనికిఁ దెలియ దాయెను. కాలముఁబుచ్చుటకై ఢిల్లీపురచిత్రములఁ జూచుటకైన యాతని కనుజ్ఞ లేదయ్యెను. భీమసింగు తనసౌధంబువిడిచి బయటకుఁబోవుటకైన వీలులేకుండెను. అతఁ డొకతఱిఁ బురరామణీయకంబుఁ దిలకింప నుద్దేశించి సౌధంబు వెడలిరాగనే ద్వారరక్షకు లాతని మంచిమాటలతోడనే వెనుకకు మరలించిరి. ఎట్టివేళలందుఁగాని, యెట్టికార్యంబులందుఁగాని భీమసింగును దనయనుమతిలేనిదే యాసౌధంబునుండి బయటికి విడువఁగూడదనియు, యుక్తముగ మంచిమాటలాడి, యతనికిఁ గొంచెమైన నవమానమొదవకుండునట్లు ప్రవర్తింపవలయుననియుఁ, దనయాజ్ఞల నుల్లంఘించిన వారికి మరణదండన విధింపఁబడుననియు, నౌరంగజేబు తనభటుల కందఱకు రహస్యముగ నాజ్ఞాపించెను. భీమసింగు నిశ్చయముగ నౌరంగజేబుచే నిర్బంధింపఁబడెను. భీమసింగనుచరులు కూడ నిట్టికట్టుదిట్టములలోనే యుండిరి; కాని వారుమాత్రము కొంతస్వేచ్ఛను గలిగియుండిరి.

భీమసింగున కిప్పు డాతనిపరిస్థితి తేటతెల్లమయ్యెను. నిశ్చయముగ నాతఁ డిప్పు డౌరంగజేబుచేఁ జెఱఁబెట్టఁబడెను. ఔరంగజేబు మోస మిప్పు డాతని చిత్తసీమఁ దోఁచెను. రాజాజయసింగువాక్యము ఇప్పుడు నిశ్చయము

లని యాతఁడు నమ్మెను. ఆతనిహృదయము పరిపరివిధములఁ బొగులఁజొచ్చెను. నిరంతరమందహాసావృతమైనమో మిప్పుడొక్కింత వాఁడఁదొడఁగెను. చింతాదేవి యాతనిహృదయపీఠ మలంకరించెను. సంశయముగూడ నాతనినావరించెను. నిద్రాహారము లాతనికి రుచింపవయ్యెను. తనకై రాజసూదకులు గొనివచ్చుపదార్థములనుసైత మాతఁడు సంశయింపఁదొడఁగెను. భ్రాతృహంతకుఁడును బితృద్రోహియును గోముఖవ్యాఘ్రమునునగు నౌరంగజేబెట్టి కట్టడికార్యమునైనను, జేయ వెనుదీయఁడని యాతనికి నమ్మకము జనించెను. కనుక నాయాహారపదార్థములందుసైతము భీమసింగు కడుంగడు జాగరూకుఁడై యుండెను. తన కక్బొసంగిన జాగిలముల కాయాహారపదార్థముల మొదటనిడి తా నావల భుజించుచుండెను.

లేమావిచిగుళ్లు నింపార మెసవి కమ్మనిఫలరసంబులం గ్రోలి, తోడిపులుఁగులంగూడి ముదంబున స్వేచ్ఛావిహారంబులుసల్పు పికకీరశారికలు పంజరంబునంబడి పరిపరివిధంబులఁ బొగులురీతి, స్వేచ్ఛావిహారప్రియుండగు భీమసింగానిర్బంధవాసంబునంబడి పొక్కుచుఁ గాలంబుఁ గడపుచుండెను. అంధునకు మనోహ్లాదకరంబగు దృశ్యంబులును, జెవిటికి శృంగారలహరీనిధానంబగు గానామృతంబును దుష్టునకు సాధుసాంగత్యంబును, షండునకు నవయౌవనకాంతాసమాగమంబును, రుచింపనితెఱంగున మనశ్శాంతి లేనిభీమసింగునకు సర్వసౌఖ్యంబులును రుచింపవయ్యెను.

... ... ... ... ...

ఒకనాఁటిరాత్రి యాకసము తారహారపంక్తులచే నలంకరింపఁబడి యుండెను. తారలమధ్యంబునఁ బ్రకాశించు ధావళ్యకిరణసంజనితప్రభాజాలంబుచేఁ గళంకంబులగు చీకటులఁ బారదోలుచుఁ బ్రియులమనంబులఁ బల్లవింపఁజేయుచుఁ, జంద్రమూర్తి వెల్గుచుండెను. ఆసమయమున నున్నతసౌధోపరిభాగంబునం దొక్కయాసనంబున యువకుం డొక్కఁ డాసీనుఁడై

గంధవహుండు గొనివచ్చుపుష్పసౌరభంబుల నాఘ్రాణించియు, రాజోద్యోగులు సమీరులు మొదలగువారిగృహాంతరములనుండి వెల్వడిన వీణాస్వనంబుల నాలకించియుఁ బాప మప్పుడప్పుడు వేఁడినిట్టూర్పులునిగుడ్చుచు, సొమ్మసిలుచుఁ జింతించుచుఁ, గళవళ మందుచుండెను. సర్వజనమనోహ్లాదకరంబగు నారాత్రి యతనికిమాత్రము భయంకరకాళరాత్రివోలెఁ గానఁబడుచుండెను. అతనిజాడఁజూడ నాలోచనాసాగరంబున మునింగినవానివలెఁ గన్పట్టుచుండెను. ఆతనికిఁ దెలియకనే యాతనినోటనుండి నిట్టూర్పులతోఁ గూడిన మాటలు కొన్ని వెలువడెను.

"ఆహా! నే నుదయనగరంబు వెడలివచ్చి దాదాపు నెలలు గావచ్చెను. ఇదివఱకు రాజపుత్రస్థానవిషయముగాని మాతాపితృసహోదరులవృత్తాంతముగాని తుదకు నాతో నరుదెంచిన జగత్సింహాదులసమాచారముగాని తెలియదయ్యెనే! ఔరంగజే బెంతమాయలమారి? ఇట్టివాఁడగుటచేతనేకదా? యన్నదమ్ముల యమసదనంబున కనిపి రాజ్యమును సంపాదించెను. ఇట్టివాఁడు నన్నుఁ జెఱఁబెట్టు టేటివింత? దైవమా! ఏకలింగేశ్వరా! నేను నాజీవితము నిటులనే గడుపవలయునా? ఆహవక్షోణి నిజనిశితకరవాలంబున వైరినృపమత్తేభంబులఁ జీల్చిచెండాడు రాజకేసరికిశోరంబు నిర్బంధవాసంబున నిట్లు కాలంబుఁ గడుపవలసివచ్చెనుగా? హా!—హతవిధీ! నిన్ను దాఁట నెవరితరము?—తురుష్కులబారినుండి శ్రీకృష్ణవిగ్రహము రక్షింపఁబడినదియు లేనిదియుఁ దెలియదయ్యెను. మాతృదేశజననీ! పవిత్రరాజపుత్రస్థానమా! మ్లేచ్ఛులదుండగములచే నీవు సంతాపించుచుండఁ, గనులారఁ గాంచియు, నొక్కింతయైన సాయముఁ జేయలేక జీవితం బిట్లు వ్యర్థంబుగఁ గడుపుచున్న నాయందు నీకుఁ గోపమా? దేవీ! నాయందు రోషింపకుము. నా కీనిర్బంధవాసముక్తి యగునట్లు వరంబు ప్రసాదింపుము. ప్రసన్నచిత్తవుగమ్ము. నన్ను దీవింపుము. నీపంపునేయ సంసిద్ధుండను.—

ఈచంద్రమలయానిలులు సర్వజనానుమోదం బొనగూర్చువారయ్యు, నాకేలకో సంతాపంబు గల్పించుచున్నారు. ఆ! ఆ! ఇదియేమివింత?

నా హృదయేశ్వరి; నా పూర్వార్జితతపఃఫలము; నా పెన్నిధి; నా యంబాలికా దివ్యమోహనవిగ్రహము; నాచిత్తసీమ మెఱపుమెఱసినట్లు మెఱసిపోయెనా! హా! ఇదేమికలయా? పిచ్చియా? లేక విభ్రమమా?—ఛీ! నేనెంతకఠినుండను. ఢిల్లీపురంబునకువచ్చునాఁడు, నాక్షేమోదంతముల రాణిగారి కప్పుడప్పుడు తెల్పుచుందునని తెల్పియుంటినికదా! ఇంతవఱకు నాక్షేమంబు నెలియక మత్ప్రియసి యెంతపరితపించుచున్నదోకదా! హా! మనోహారి! నాక్షేమవృత్తాంతములఁ దెలుపనందులకు నీవెంత చింతిల్లితివో? నాప్రేమ సంశయాస్పదంబని తలంచితివా?— జీవితేశ్వరీ! నీముఖారవిందసందర్శన భాగ్యం బీభీమసింగున కిఁకఁగల్గునా? నీవంటిసౌభాగ్యవతి నాబోఁటి నిర్భాగ్యున కబ్బునా? ప్రేయసీ! నీవింతటిలో నన్ను మఱచియుందువా? నిన్ను విడచి జీవంబు లెట్లు నిలుపువాఁడను?" అని పొంగిపొరలివచ్చుదుఃఖంబునఁ బురపురంబొక్కుచు మూర్ఛాక్రాంతుఁడయ్యెను.

మఱికొంతసేపటి కాతఁడు తెప్పిరిలి సహజధైర్యంబున నావ్రన శోకంబుదక్కి ధైర్యంబుఁజిక్కఁబట్టి, "ఛీ భీమసింహా! ఏల యిట్లు పిరికిపందవై చింతించుచుంటివి? ధైర్యంబు విడనాడకుము. ఔరంగజేబు మాయోపాయంబులు నీయొద్ద సరిపోఁజాలవు. సామదానదండోపాయంబు లిప్పట్టునఁ గట్టిపెట్టి, భేదోపాయంబుననే, నీతనిఁ గెలువఁజూడుము. నీప్రయత్నములు సఫలంబగు"నని యారాణాకొమరుఁడు, విమోచనోపాయంబుల మనంబున నాలోచింపఁజొచ్చెను. ధైర్యలక్ష్మి యాతనిఁ బాయలేదు. తుట్టతుద కాతని కొకయుపాయతట్టెను. అతనిమానస మొక్కింత స్తిమితము నొందెను. మోము శాంతిమంతమయ్యెను. యాతఁ డాలోచన చాలించి లేచెను.

అతఁ డట్టులేచి మెల్లన సోపానములుదిగి క్రిందియంతస్తున సేవకు లుండుగదిని సమీపించెను. అప్పటికిఁ జాలరాత్రియైయుండెను. సేవకులు నోయిగ భుజించి తమపరి మదిరంబునుఁ గ్రోలి ప్రమత్తులై నిద్రించియుండిరి. ఆగదితలుపుసందున దీపకాంతిమాత్రము కొంచెముగఁ గన్పడుచుండెను.

భీమసింగు నిశ్శబ్దముగ నాగదిని సమీపించెను. తలుపుసందునుండి లోనికిఁ జూచెను. ఒక్క సేవకుఁడు మాత్రము నిదురింపక మనంబున నేదియో చదువు కొనుచున్నట్లు కన్పట్టెను. భీమసింగు మఱికొంతసేపు నిదానించి చూచెను. ఆతనిమనము సంతోషముతో నిండిపోయెను. ముఖము వికసించెను. అతఁడు మెల్లనఁ దలుపుఁదట్టెను. తోడనే లోనుండినవ్యక్తి తలుపుఁదీసెను.

ఆవ్యక్తికి దాదా పేఁబదియైదేఁడు లుండవచ్చును. ఆతనిఁజూచిన శాంతిస్వరూపునివలెను, మృదులహృదయునివలెను, గన్పట్టును. అతఁడు భీమసింగునుగాంచి యాశ్చర్యసంభ్రమవినయంబుల సలాము లాచరించి "మహాప్రభూ! తా మిట్టి నడురేయి నాకొఱ కిచ్చటికి రానేల? కారణ మెద్దియో తెల్పుఁడు. ఈసేవకుఁడు సంసిద్ధుఁడై యున్నాఁ"డని మాటాడఁ బోవ భీమసిం గాతని మాటాడవలదనియు దీపమార్పి తనతో రమ్మనియు, సంజ్ఞ గావించి తనగదికి వెడలెను. ఆసేవకుఁడును భీమసింగు నాజ్ఞమేర కతనివెంబడి వెడలిపోయెను. వారిరువురును భీమసింగు గదినిఁ జేరిరి. లోనికి వెడలి గది తలుపులుమూసి గడియవైచిరి. భీమసిం గొకయాసనంబున నాసీనుఁ డయ్యెను. ఆనూతనవ్యక్తి సమీపంబునఁ గూర్చుండెను. అపుడు వారిటుల మాటాడఁ జొచ్చిరి.

నూతన:—ప్రభూ! నన్నింతరాత్రివేళ నెందులకుఁ బిలిచితిరి? దేవరవారికి నాతో నిట్టిసమయమునఁ గావలసిన పనియేమి? చెప్పుఁడు. వీలున్నఁదప్పక చేసెదను.

భీమసింగు:—అబ్దుల్ ఖరీము! నీవిప్పుడు చేయవలసిన కార్య మేదియును లేదు. నేఁడెందులకో మనస్సునకు సంతోషము లేకున్నది. నిదురింతమన్నను నిద్ర నన్నుఁ జేర వెఱచుచున్నది. మాటాడుటకైన నెవ్వరులేరు. కాన, నిదుర వచ్చువఱకు నీతో మాటలాడుటకై నిన్నుఁ బిలిచితిని. కాని వేఱొండు గాదు. విశేషము లేవైనఁగలవా?

అబ్దుల్:—స్వామీ! విశేషము లేమున్నవి. మిమ్మొక్క విషయ మడుగఁ దలఁచుకొనియుంటిని. దేవరవారు నాసాహసమునకు మన్నించి కార ణము తెలుపఁగోరెద.

భీమ:—అబ్దుల్! నీవడుగఁదలఁచుకొన్న దేదియో యడుగుము. తెలిసి యున్నఁ జెప్పెద.

అబ్దుల్:—స్వామీ! చాలదినములనుండి చింతిల్లుచున్నట్లు కనఁబడుచున్నారు. మీరక్బరు రాకొమరునితోడను, నాతోడను మాటాడునప్పుడు, సంతో షముగ నుందురు. మీమాటలు మాకు ముదంబుగూర్చుచుండును. కాని మీరొంటరిగనుండునప్పుడెల్ల నేదియో యాలోచించుచుందురు. మీ యాలోచనమునకుఁ గారణం బేద్దియో మన్నించి వచింపుఁడు.

భీమ:—అబ్దుల్! నీవు నాయందు శ్రద్ధాభక్తులు గలవాఁడవనియు, విశ్వాస పాత్రుఁడవనియుం నే నెఱుంగుదును. నాచింతను బాపఁ గొంతవఱకు సమ ర్థుఁడవనియుం నూహించుచున్నాను. కాని యీవిషయము సెప్పుట కిది సమయముగాదు. కొంతకాలమునకుఁ దెల్పెదను. ప్రస్తుత మేమైన విశేషము లున్నఁ దెల్పుము.

అబ్దుల్:—ప్రభూ! విశేషము లేమున్నవి? అలంగీరుపాదుషాగారి ప్రవర్త నము మారినది.

భీమ:—అ! ఏమేమి? అలంగీరుపాదుషాగారి ప్రవర్తనమా? మారుటయా? చాలనాశ్చర్యముగనున్నదే? చక్రవర్తిగారు వివేకవంతులు. గుణవంతులు. భక్తిశ్రద్ధలుగలవారు. అట్టివారి ప్రవర్తన మేరీతిగ మారినది! నీవు చెప్పు నది నా కించుకయైన బోధపడుటలేదు.

అబ్దుల్:—ప్రభూ! చక్రవర్తిగారివిషయము మీకంత తెలియదు. నేను చాలకాలమునుండియు వారియొద్ద నుండుటచే నాతనివర్తనములు బాగుగ నెఱుంగుదును.

భీమ:—అయిన నుండవచ్చును. తర్వాతసమాచారమును దెల్పుము.

అబ్దుల్:—చక్రవర్తిగారికి సంతోషమనునది యిసుమంతయైన లేదు. వేడుకలఁ నుత్సవములు, నాతనికిఁ గొంచెమైనను గిట్టవు. యుద్ధము, నితరమత దూషణ, హిందువులహింసించుట, యనునవి యాతనికిఁ గడుఁ బ్రీతి. వీరు రాజయినప్పటినుండి యాస్థానములోఁ బాటకచేరులు, నాట్యసభలు, పండితులసభలు మొదలగునవి మటుమాయము లయ్యెను. ఈతఁడిఁక రాఁబోవు మొహరమును నిలిపివేయ సమకట్టెను. మాతాతముత్తాతలనుండి వచ్చునాచారమును నీతఁ డొక్కపెట్టున నిర్మూలింపఁ బ్రయత్నించి నాఁడు.

భీమ:—ఏమీ? మొహరము నాపివేయఁ జూచుచున్నాఁడనియా, చక్రవర్తిగారిపైఁ గోపమునకుఁ గారణము? చక్రవర్తిగారు నిరాడంబరులు. వారికి దమతండ్రితాతలవలె భోగములందును సౌఖ్యములందును నిష్టములేదు. అతఁడు గొప్పదైవభక్తుఁడు. అట్టివారి కీయాడంబరములతోఁ బనియేమి?

అబ్దుల్:—మహాప్రభూ! మీ రీవిషయమునఁ జాలపొరపడితిరి. ఔరంగజేబుగారు నిరాడంబరులంటిరి. ఆతనివిషయమును మీరు గ్రహింపలేరైతిరి. అతఁడు పైకి నిరాడంబరునివలెఁ గనఁబడునేగాని నిజముగ నాతనికి లోనాడంబర మెక్కువ. నిరాడంబరులకు రాజ్యములేల? యైశ్వర్యము లేల? మఱియొకటి వినుఁడు. ఈతనికి భోగములం దిష్టములేదంటిరి. అట్టివానికి సంపదలేల? రాజభవనములేల? హంసతూలికాతల్పంబులేల? పలువురు విలాసినులేల? సర్వభోగముల కాధారమైన రాజ్యతృష్ణయేల? స్వామీ! ఈరాజ్యముకొఱకై యాతఁడు సేసిన ఘోరకార్యములఁ దలంచుకొన్న నిప్పటికిని నమితదుఃఖము గలుగుచున్నది. సద్గుణసంపన్నుండును, న్యాయప్రభువునగుతండ్రినిఁ జెఱయందుంచెను. దారా మొదలగునన్నదమ్ములనందఱఁ దనమాయామారీచవిద్యలఁబన్ని కాలుసదనంబున కనిపెను. ఇవియన్నియుమీకు విశదముగఁ దెలిసియే యుండును. ఈతఁ డల్లాకు:

బరమభక్తుఁడంటిరి కాని భక్తున కుండవలసినగుణము లీతనియందుఁ గాన్పింపవు. ఇతరమతములయం దీతనికిఁ గొంచెమైన నోర్పులేదు. ఆవిషయము తమకును దమకులస్థులకును జక్కఁగఁ దెలిసియేయున్నది. శైవభక్తనకు నెల్లరొక్కటియే. భగవంతుఁ డందఱియందు నున్నాఁడు. భక్తుఁడైనవాఁ డదియెఱింగి యెల్లరు భగవత్స్వరూపులని తలంచును. ఇతని పితృపితామహప్రపితామహు లీవిషయ మెఱింగి సర్వమతస్థుల నొకేరీతిఁ బోషించుచుండిరి వారికీర్తి యాచంద్రతారకమై యున్నది. వారికాలమున దేశమెంత సుభిక్షముగ సౌఖ్యదాయకముగ నుండెడిదో! వీరిప్రవర్తనము కేవలము హిందువులకేగాక మహమ్మదీయులమగు మాకును జాల సతృప్తి గల్గించుచున్నది.

భీమ:—అబ్దుల్! నీవు చెప్పినది కొంతవఱకు నిశ్చయమే? కాని యావిషయములతో మనకిప్పుడేమిపని? ఇంతకును మొహార మాపివేయఁబడినదా?

అబ్దుల్:—లేదు. లేదు. మహమ్మదీయు లందఱు అందులకు సమ్మతింపలేదు. మహమ్మదీయులందఱొక్కటైనఁజక్రవర్తిగా రేమిచేయగలరు! మొహారమును జరుపుట కిష్టములేకున్నను, ననుమతీయవలసివచ్చెను. కోటలోని రాజోద్యోగులుగాని రాజసేవకులుగాని రాజానుమతిలేనిదే సాఁటిపినము కోటవెడలఁగూడదని మాత్ర మాజ్ఞాపించియున్నాఁడు.

భీమ:—మంచిది. అబ్దుల్! నేను నిన్నిప్పు డొక్క విషయ మడుగఁబోవుచున్నాను సదుత్తరమీవలయును.

అబ్దుల్:—స్వామీ! నావిషయము దెలియనివారివలె నడుగుచున్నారే? యిన్నిదినములనుండి మీవద్దనుండినను, నాగుణములను గనిపెట్టలేకపోయితిరా? మహాప్రభూ! మీవంటియుదారులును, సజ్జనులునునైనవారినిఁ గొల్చుటకంటె నా కెద్దికావలయును? ఇదివఱకు మీరు నిర్హేతుకంబుగ నాపైఁ జూపుచువచ్చినకరుణను నేమఱవఁగలనా? మీరేమి యడుగఁ దలఁచితిరో? దాని నడుగుడు తెలిసినంతవఱకుఁ దెల్పెదను.

భీమ:—అబ్దుల్! నీవు మంచివాఁడవనియుం, విశ్వాసపాత్రుఁడవనియుం నమ్మియే గదా నిన్నింతగ దాపునఁ జేర్చుచున్నాను? నిన్నడుగఁదలఁచినది మఱొక్కటి యుండు గాదు. చక్రవర్తిగారియందు నీకమితకోప మున్నట్లున్నదే? అతని గొలువునం గుండుటకు నీ కిష్టమున్నదా? లేదా?

అబ్దుల్:—(చిఱునవ్వున) స్వామీ! మీరడుగు ప్రశ్న కడునింతగ నున్నది. చక్రవర్తిగారి నడవడినిఁజూచి నాకాతనియం దయిష్టము, జనించినది. సన్మార్గున కెట్టివానికైనఁ జక్రవర్తికార్యము లాలోక్యక్కప్పు దసూయఁ బుట్టించుచుండును. ఇకనియొద్దఁ గొలువు సేయుంటయుం గష్టము. బీద వాఁడు భార్యాపుత్రులపోషణార్థమై యెట్టికట్టడికైనఁ గొలువవలయును గదా? సేవకావృత్తికంటె వేఱునరక మేదియును లేదు. మఱియుఁ గఠి నుఁడగు ప్రభుస్రను గొల్చుట మఱింతకష్టము. నావంటిదరిద్రునకు మేలెన్నటికిని నుండదు.

భీమసంగ:—నేఁటినుండియుం నీకుటుంబపోషణకై నీవుకష్టపడవలసినది లేదను కొనుము. దేవుఁడు నీజీవితాంతమువఱకును, నీకుఁగాని నీకుటుంబమునకుఁ గాని కష్టములు లేక జీవింపఁగలుగునంతటిభాగ్య మొసఁగినాఁడు. నీ వీయుద్యోగమును వదలెదవా? నిజముచెప్పుము.

అబ్దుల్:—ప్రభూ! మీరేల యిట్లడుగుచున్నారు. కష్టములు లేక జీవనము గడుపుకొనునంతటిభాగ్యమబ్బిన నెట్టిపిచ్చివాఁడైన సేవకావృత్తి చేయునా? అట్టివాఁ డొకనియాగ్రహములకును, మాటలకును, శిక్షలకును, లొంగి బ్రతుకవలసినయావశ్యక మేమున్నది? (నవ్వుచు) దేవుఁడు నానుదుట నట్టియదృష్టవర్ణముల వ్రాసియుండ లేదు.

భీమ:—అబ్దుల్! నీవు సన్మార్గుఁడవుగాన దేవుఁడు నీకు మేలుచేయుంను. నేఁజెప్పినట్లు చేసిన నీకట్టిసౌఖ్యము లభించును.

అబ్దుల్:—దేవర కీబీదవానిపై నిట్టియకారణకరుణకలుగుట నాపూర్వజన్మ సుకృతమేగదా? మీదయ నెంతని పొగడఁగలను? దారిద్ర్యనరకమూపి

మునఁబడి వివిధబాధలకు లోనైన నాయందు కరుణించి రక్షింపవచ్చిన భగవంతుఁడని తలఁచి మిమ్ముఁ బూజించెద. మీమాట వినకుందునటయా? మీసేవఁ జేయుటకైన సంసిద్ధుఁడను. కార్య మేదియో? తెల్పుఁడు.

భీమ:—అటులైన నామాట లాలకించి నేఁజెప్పునట్లు చేసెదనని వాగ్దత్తము సేయవలయును. చేసెదవా?

అబ్దుల్:—ప్రభూ! అట్లే వాగ్దత్తముఁ జేసెద. మీరేనిచెప్పుఁదలచితిరో! చెప్పుడు. నిశ్చయముగ మీయాజ్ఞానువర్తినై యుండెదను.

భీమ:—అబ్దుల్ ఖరీము! సావధానముగ వినుము. నే నిప్పు డొక్కయిక్కట్టు నకు లోనైయున్నాను. నీవుచెప్పినట్లు చక్రవర్తిదుండగము లన్నియు నేనెఱుంగుదును. అందఱుఁ దలఁచినట్లు నేనమాయకుఁడనుగాను. చక్ర వర్తికి గర్భశత్రువగు మాతండ్రి యాజ్ఞ మేరకు నేనిక్కడి కొక కార్యా ర్థమైవచ్చితిని. కపటనాటకసూత్రధారియగు నీచక్రవర్తి పైకి మంచివాని వలె నటించి నన్నీనిర్బంధవాసమునందుంచి గాసిల్లఁ జేయుచున్నాఁడు. ఇతఁడు నన్ను మోసగించుచున్నాఁడని నే నానాఁడే గ్రహించితిని. కాని యేమిచేయఁ గలను? ఇప్పట్టున బలిమిమైనీతనినుండి తప్పించుకొనుట కష్టము. కనుక మాయోపాయంబునఁ దప్పించుకొని పోవఁజూచు చున్నాను. నీవు నాకు సహాయ కారివై యుండవలయును. నాకాప్తుఁడన దగువాఁ డెవ్వఁడునులేడు. అందుచే నన్ను జాగ్రత్తగఁ గనిపెట్టియుండు టంజేసి నాపై నేయనుమానమైనఁ గల్గిన, నాకంతటితో ముప్పు తప్పక వాటిల్లునని యెంచి యీరీతి నమాయికత్వంబునఁ జరించుచున్నాను. సమయ మును వేచియుండి, చక్రవర్తినుండి తప్పించుకొనవలయును. అంతవఱ కును మనయం దెవ్వరికిని ననుమానము గలుగకుండునట్లు ప్రవర్తింప వలయును.

అబ్దుల్:— ప్రభూ! ఇప్పటికైన నౌరంగజేబువిషయము దెలిసినదా? యిప్పుడు నేనేమిచేయవలయునో తెల్పుడు.

భీమ:—మొదట నీవొక కార్యమును జేయవలసియున్నది. నాతో నరుదెంచిన రాజపుత్రులవృత్తాంతము, శ్రమయనక యెఱింగిరావలయును. వారును నావలెనే యొక్కచో నిర్బంధింపఁబడియుందురని తలంచెద. ఇదిగో ప్రస్తుత మీబహుమానమును దీసికొనుము.

అని చక్రవర్తి తనకు బహుమతిగ నంపియుండిన యొకయమూల్య హేమాభరణంబును, నాతని చేతులందు బడవైచెను. తాను బుట్టినది మొదలు చూచియైన నెఱుంగని యమూల్యంబగు నాయాభరణము, నేఁడయాచితముగ లభించుటం జేసి యాతఁడొందినయానంద మింతింతనరాదు. ఆయాభరణంబును గన్నులకద్దుకొని దనయంగరకాయందు గుప్తంబుగ దాచుకొనియెను. అప్పుడు మఱల భీమసింగాతనితో నిట్టులనియెను.

భీమ:—అబ్దుల్ ! నీవతిజాగరూకుఁడవై యుండవలయును. లేనంతట నీకును నాకును దక్షణమే తప్పక ముప్పువాటిల్లును. నేఁజెప్పినవిషయములను బరమరహస్యములుగ నెంచుము. నామాటలు మఱువకుము.

అబ్దుల్:—స్వామీ ! బాలునికివలె నాకింతగ నేర్పవలయునా ? సర్వము నేనెఱుంగుదు. సమయము తెలిసి నడచుకొందును. మీరు చింతదక్క యుండుడు.

భీమ:—అబ్దుల్ ! నీయాలుబిడ్డ లిప్పు డెందున్నారు?

అబ్దుల్:—ఇందేయున్నారు.

భీమ:—వారిచ్చోటనుండిన మనప్రయాణమున కంతరాయములు కలుగును. మనము పోవునపుడు వారి నిచ్చోట విడిచిపోవలసివచ్చును. నీవు తిరిగి వచ్చుటకు వీలుండదు. కనుక నాకొకయూహాలోచుచున్నది. నీవట్లుచేసిన బాగుండును. ఏదో యొకసాకుఁబెట్టి నీభార్యఁ బుట్టినింటికిఁ బంపుము. మనము దప్పించుకొని వెడలినతర్వాత నీవు నీవారినిఁ గలసికొని దూరదేశ మునకువెడలి సురక్షితముగ నుండవచ్చును. నీకుఁ దగువైనబహుమతి

యొసంగెదను. దానిచే నీవు నీజీవితాంతముపఱకు సుఖముగఁ జీవింప వచ్చును. ఈయూహ నీకెట్టులోఁచుచున్నది ?

అబ్దుల్:—మహాప్రభూ ! మీయూహ సమంజసముగనున్నది. ఎదో యొక మిషగల్పించి చక్రవర్తియొద్దఁ గొన్నిదినములు సెలవుఁదీసికొని జేపే యూలంబిడ్డలను దోడ్కొనిపోవువానివలె నటించి వారినిమాత్రము పంపి వైచి నేనొక ప్రచ్ఛన్నవేషమును ధరించి పట్టణమంతయుం వెదకి మీపరి వారముయొక్క సమాచారమును దెలిసికొనివచ్చెదను.

భీమ:—అబ్దుల్ ! సర్వమునీపై నుంచినాఁడను. జాగ్రత్తసుమా ! కార్యమును మాత్రము నెఱవేర్పవలయును.

అబ్దుల్:—స్వామీ ! అటులనే చేసెదను. మీరించుకైన భయమందనక్కఱ లేదు.

భీమ:—అబ్దుల్ ! ఇంకొకవిషయము. మొహరమెప్పుడు ప్రారంభమగును?

అబ్దుల్:—ప్రభూ ! నేఁడు పౌర్ణిమగదా? ఇంకఁ బదునాఱు పదునేడుదిన ములకుఁ బ్రారంభమగును.

భీమ:—మంచిది. ఆలోపల మనకార్యములన్నియుఁ జక్కఁబఱచుకొనవల యును. నీవింక వెడలుము. జాగ్రత్తతోఁ గార్యములనెల్లఁ నెఱవేర్చుము. లేనంతట మనయిరువురకుఁ బ్రమాదముసంభవించును.

అబ్దుల్:—మహాప్రసాదము. తమయాజ్ఞానుసారమే ప్రవర్తించెద.

అని తనకృతజ్ఞతను దెలుపుచు నబ్దుల్ వందనము లాచరించి, భీమ సింగు నానతిఁబొంది, వెడలిపోయెను. భీమసింగుమనమున నిప్పు డొకింత సంతోషధైర్యములు గల్గెను. ఆతఁ డారాత్రి సుఖముగ నిద్రించెను.

---

# పదునాఱవ ప్రకరణము

## మొహరము

నాఁటిరాత్రి గాఢాంధకారముచే నిండియుండెను. దినకాంతామతల్లి తరణి వియోగసంజనిత దుర్భర దుఃఖంబున మనంబు పరిపరివిధంబులఁ బరితపిల్ల నాభరణ జాలంబుల విసర్జించి నల్లనివలువ ధరించి పొంగిపొరలు శోకంబున రోదనంబు సల్పుచున్నదో యనునట్లు కటికచీకటులు బ్రహ్మాండకుహరంబునెల్ల నావరింప ఘూకాదితిర్యగ్రావంబులెల్ల దిక్కుల వ్యాపించెను. దానికిఁదోడాకసము మేఘపటలావృతంబై యుండెను. ఆయంధకారమున దిక్కుతోఁపక భీతిల్లువారికి సహాయముగాఁ బద్మజుండు సృజించినదీపకళికలో యనఁ గొన్నితారక లందందుఁ బ్రకాశింపఁదొడఁగెను. ఆరాత్రి యెల్లరకు భయంకరంబయ్యు జారచోరశిఖామణులకుమాత్రము సంతోషకరమై యొప్పుచుండెను.

ఢిల్లీపురమున గృహాంతరముల వెలింగెడుదీపముల ప్రకాశమునకును, బురవీథుల వెలుంగుచున్న విద్యుద్దీపికల ప్రభకును భయపడి యందలితిమిరంబులు పరుగిడి శిథిలారామక్షేత్రాదులఁ జొచ్చి స్వైరవిహారంబులు సల్పుచుండెను. ఢిల్లీపురబాహ్యప్రదేశమునం దొక్క శిథిలాలయ ముండెను. ఆదేవాలయము శిథిలమునొందిన నాఁటినుండియుఁ, బ్రకాశముదక్కఁ గ్రూరసర్పాదులచే నిండి మాలిన్యయుతమై యుండెను. భగవద్భక్తులతో నిండియుండినయాచోటిప్పుడు గృధ్రఘూకోరగపిశాచంబులకెల్ల నునికిపట్టై యుండెను. మఱియు ననేకకంటకావృతంబులగు తరులతాదులతో నొప్పి యాప్రదేశము భయమును గలుగఁజేయుచుండెను.

ఆరాత్రిసమయమున నొకపురుషుం డాయాలయమార్గంబున నడచి పోవుచుండెను; గాని, కటికచీకటిలో నాతనియాకార మిట్టిదని గ్రహింపఁ జాలము. అతఁడు వడివడిగ నేదో యొకకార్యార్థమై యరుగుచున్నవాని వలెఁ గన్పట్టుచుండెను. అతఁ డట్లు నడచిపోయి కొంతసేపటి కానిర్జనప్రదేశమగు నాలయము జేరెను. అట్టినిశీథసమయమున నావిజనప్రదేశమున నొంటరిగఁజరించుటఁజూడ నాతఁడు గొప్పసాహసికుఁడనియుం, భయమన నెట్టిదో యెఱుఁగఁడనియుం, మన మూహింపవచ్చును. ఆప్రదేశమును సమీపించి యొకకరదీపికను వెలిగించి, యం దొక్కపాషాణవేదిపై నాతఁ డాసీనుఁ డయ్యెను. ఆదీపికవెలుంగున నాతనియాకారమును గొంతవఱకు వ్యక్తము కాఁజొచ్చెను. దీర్ఘబలిష్ఠకాయుఁడును, మహమ్మదీయుఁడునువలె నాతఁడు గన్నట్టుచుండెను. ఆతనికటిప్రదేశమున నొకకరవాలము రహస్యముగ నుంపఁ బడియుండెను. ఆతనివదనము గంభీరమైయుండెను. ఆతఁ డెవరికొఱకో నిరీక్షించుచున్నవానివలెఁ గన్పట్టుచుండెను. కొంతసేపటి కాతని కడుగులచప్పుడు వినవచ్చెను. మఱికొంతతడవునకే యైదుగురుమనుష్యు లాప్రదేశమును జేరిరి. వారెల్లరు మహమ్మదీయులవలెనే గన్పట్టుచుండిరి. మనవ్యక్తి "ఎవరువార"ని గంభీరముగఁ బ్రశ్నించెను.

నూతన:—ప్రభూ! మమ్ముగుఱుతింపకపోయితిరేమి? మేము మీసేవకులము గామా? మీపంపుమేర కీవేషములఁ దాల్చివచ్చితిమి.

పురు:—సెబాస్! జనార్దనరామసింగులారా! మీవేషములఁ జూచినవారు మిమ్ము నిక్కముగ మహమ్మదీయులనియే తలంతురు. ఇటు కూర్చుండుఁడు. మనకార్యము లేమైనవి యెంతవఱకుఁ గొనసాగినవి?

జనార్ద:—ప్రభూ! రాకొమరునియాజ్ఞ మేరకు మనవారిలోఁ బదిమంది బద్మాష్ వేషములధరించి మనగుఱ్ఱములన్నింటిని దొంగిలించుకొనిపోయిరఁట. మే మావిషయ మెఱింగి వచ్చితిమి.

పురుషుఁడు:—మంచిది. కాని, వారెవ్వరికిని జిక్కలేదుకదా?

జనార్ద:—లేదు. లేదు. ప్రభూ? సర్వము మనము దలఁచినట్లే యైనది.

పురు:—నీ వావిషయము నెట్లెఱింగితివి?

జనార్ద:—నే నిప్పు డీమార్గమున వచ్చుచుండ నిరుపురరక్షకభటు లేమిరో మాటాడుకొనుచుఁ బోవుచుండిరి. నేను జప్పుడుసేయక కొంతదూరము వారిని వెన్నంటితిని. గాఢాంధకారమున, వారు నన్నుఁ గాంచలేదు. వా రీక్రిందివిధమున మాటాడుకొనిరి.

"నేఁడు మనయదృష్టము ఫలించినది. రాజపుత్రులదురదృష్టము హెచ్చినది. అత్రాఁగుబోతులు రాజపుత్రులగుఱ్ఱములను దొంగిలించుకొని పోవుచుఁ బాపము మనకంటనేపడిరి. మనదబాయింపులకు వారెట్లు వాడలి పోయిరో చూచితివా? అకస్మాత్తుగ నెంతపైకము లభించినది!" అని యొకఁడు. మఱియొకడు "అరేరే! ఖావర్! నాకుఁ జాల ఆశ్చర్య మైతుంది భై. ఆదొంగబడవాలకూ యింతాపైకం యెట్లావచ్చిందీ?" దానికి మొదటివాఁ డిట్లు బదులుపలికెను. "అరే మామూద్! దానితో మనకేమిరా? అలుచ్ఛాబదవా లెట్లుపోతే మనకేం. మనచేతిలో దుడ్డుపడిందొకటి మన పొట్టకూ జరుగుతూయుంటే మనకూ కుషీ"

అని వారిరువురు మాటాడుకొనుచుఁ బోవుచుండ విని మనవారు సఫలీకృతులైరని యెంచి తమ కీసమాచార మెఱింగింపవచ్చితిని.

పురు:—సెబాస్! సెబాస్! చాలసంతోషము. నారాయణసింగ్! నేఁటిరాత్రి యబ్దుల్ ఖరీము వచ్చునని చెప్పియుంటివే? అతఁ డింకను రాలేదే? కారణ మేమై యుండును.

నారా:—ప్రభూ! కారణమేమియో తెలియదు. కాని యాతఁ డిక్కడికి తప్పకవచ్చును. కొంత యాలస్యముగ రావచ్చును.

పురు:—కానిమ్ము. కొంతవఱకు నిరీక్షింతము.

అని వారిట్లు మాటాడుచుండ నతఁ డరుదెంచి యటనుండినవారికి వినయంబున సలాము లాచరించి, "మహాప్రభూ! ఆలస్యమైనందులకు క్షమింప వలయు"నని నుడివెను.

పురు:—క్షమించుటకు నీవొనర్చినత ప్పేమున్నది? నీవు మాకెంతయు నాప్తుఁడవు. అబ్దుల్ ఖరీము! మారాకొమరుఁడు సేమముగ నున్నాఁడా? అతఁడు మాతో నేమి తెల్పుమనియె? వచింపుము.

అబ్దుల్:—ప్రభూ ! రాకొమరుఁడు మీకెఱింగింపుమన్న వృత్తాంతంబు నెఱింగించెదను. సావధానులరై యాలకింపుఁడు. "మొహరమునాఁటి ముందురాత్రి మీరెల్లరు మాఱువేషములధరించి జాగరూకులై జనసమ్మర్ధమునఁగలిసి సమయము గని వెట్టి పారిపొండు. మొహరమునాఁటిరాత్రికి నేనును నబ్దుల్ ఖరీమును, యమునకావలిగట్టున మిమ్ముఁ గలిసికొందుము. మీరు ప్రయాణమునకు సిద్ధముగ నుండుఁడు. జాగ్రత్తతో మెలంగుఁడు. లేనంతటఁ బ్రమాదము సంభవించును. మేమిరువురము సంకేతస్థలమునఁ దప్పక కలిసికొందుము" అని వచించిరి.

ఆమాటలనువిని వారెల్లరును నట్లేచేసెదమని తెల్పిరి. తర్వాత మన పురుషుఁ డబ్దుల్ ఖరీమును జూచి, "యబ్దుల్! తమయాజ్ఞమేరకు రాజపుత్రులు, తమగుఱ్ఱంబులను దామే దొంగిలించుకొనిపోయి యొకసాంకేతిక స్థలంబున దాచియుంచిరనియుఁ దమయాజ్ఞానుసారమే సర్వకార్యముల నప్రమత్తతతో నెఱవేర్తుమనియు, మొహరమునాఁటిరాత్రికి రాకొమరుని సంకేతస్థలంబునఁ గలిసికొందుమనియు నామాటగా నీవాతనితోఁ దెల్పు"మని యెను.

తర్వాత వారొకసంకేతస్థలము నేర్పఱచుకొనిరి. అబ్దుల్ ఖరీమును వారియొద్ద సెలవుగొని వెడలిపోయెను. తదుపరి వారెల్లరు గొంతవడిదనుఁ గార్యాలోచనంబు గావించి తామువచ్చినత్రోవనుబట్టి వెనుదిరిగి యంధకారమున నదృశ్యులైరి.

మొహారము వేడుకలు ఢిల్లీపట్టణమునఁ గడు వైభవముగ జరుగుచుండెను. ఢిల్లీపురమందలి మసీదులందును బ్రతిమహమ్మదీయునిగృహమందును, నాపది దినములు ఖురాను గ్రంథపఠనము జరుపఁబడుచుండెను. మహమ్మదీయమతాను సారంబుగ నుత్సవములు జరుపఁబడెను. ఆసమయమునఁ జందనాదిసౌరభము లెల్లెడల నాక్రమించి నాసికారంధ్రంబులకు వెక్కసంబు గల్గించుచుండెను. ఢిల్లీపురం బతిరమ్యంబై యనేకవిధ ప్రజలచేఁ గ్రిక్కిరిసియుండెను.

మొహారము కడపటిదినమున నూరేఁగింపువేడుకకై చుట్టుపట్టులనుండు గ్రామములందలి స్త్రీపురుషు లుచితరీతుల నలంకరించుకొని వచ్చుచుండిరి. దుకాణములు లెక్కకుమిక్కిలియై వీథుల కిరుపంక్తుల నతిమనోహరంబుగ నమర్పఁబడియుండెను. జానపదులు మొదలగువా రాపట్టణరామణీయకంబుఁ దిలకించి ముదమందుచుండిరి. వివిధాద్భుత ప్రదర్శనములు జనులమనముల నాశ్చర్యపూరితంబులు గావించుచుండెను.

నాఁటిసాయంకాలము దాదా పైదుగంట లగునప్పటికి నూరేఁగింపు ప్రారంభింపఁబడియెను. ఆజనసమ్మర్దమునం దొకరినొకరు కనుగొనుట బహు కష్టముగ నుండెను. ఆజనులతాపిడులకుఁ ద్రొపుడులకు గిజగిజలకు బాలురు భయపడి యేడ్చుచుండిరి. రక్షకభటు లనేకు లాయుధపాణులై కలఁతలు లేకుండఁ జూచుటకుఁ బ్రయత్నించుచుండిరి. హాస్సాన్ హుస్సేన్ అను మహమ్మదీయవీరులజ్ఞాపకార్థమై మొహారము జరుపఁబడుచుండుట యెల్లరెఱింగినదేకదా? ఆమహమ్మదీయవీరులు స్వీయమతదేశోద్ధరణకై యాహావక్షోణి తాత్రంబునఁ బోరుసల్పి ప్రాణంబులఁ దృణంబులుగ వర్జించి మృతజీవులైరి. గనుక వారిపేరులతోఁ బీరులనిల్పి మహమ్మదీయులందఱు విషణ్ణచిత్తులై యూరేఁగింపు జరపుచుండిరి. కొందఱు మహమ్మదీయులు దమకెల్ల వేదతుల్యం బగు ఖురాన్ గ్రంథమును బఠించుచు వెనుకఁబోవుచుండిరి. పురంధ్రీమణు లెల్లరు నున్నతసౌధాగ్రంబులనుండి పుష్పములు మొదలుగాఁ గల మంగళ ద్రవ్యముల నాపీరులపైఁ జల్లుచుండిరి.

ఇటు లాయఁలుత్సవముతో నెల్లరు బయలుదేరి ఢిల్లీపురపీథులం గడచి యమునాతీరంబుఁ జేరునప్పటికి దాదాపు రాత్రి పదిగంట లయ్యెను. వారానదీతీరమును జేరగనే యాపీరులనందు డింపి మంత్రసహితంబుగఁ బూజించి ధూపదీపనైవేద్యాదుల సమర్పించిరి. తర్వాత విధివిహితంబుగ సర్వకార్యంబుల నిర్వర్తించిరి. త దుపరి వాని నాపవిత్రనదీతోయంబులఁ గడిగి శుభ్రము గావించి బంగరుమందసంబుల నిడిరి. అటుపిమ్మట మహమ్మదీయు లెల్లరు దమ పలాలంకారులగు, హాసన్ హుస్సేనుల నామసంకీర్తనంబులఁబాడుచుఁ బురంబునకు వెడలిరి.

వారందఱిట్లుకార్యాచరణదీక్షితులై యుండ నిరుపురుపురుషులు మాత్ర మానదీతీరతరుచ్ఛాయల సంచరించుచుండిరి. తక్కినవా రెవ్వరును వారినిఁ జూడలేదు. ఆపురుషు లిరువురును గాలుసేతులు గడుగుకొనుటకై జలంబుల సమీపించిరి. వెంటనే గుభిల్లుమని శబ్దమయ్యెను. పాపము. వారా నదీజలంబులఁబడి మునింగిరికాఁబోలు.



# పదునేడవ ప్రకరణము



## అద్భుతము

ఔరంగజేబుపాదుషా సింహాసనాసీనుఁడై యుండెను. అతని పార్శ్వ
మునఁ గొమరుఁడగు నక్బరు గూర్చుండి యుండెను. ముఖ్యమంత్రులు సమీ
పులుమాత్రము వారివారియాసనంబుల నాసీనులై యుండిరి. తదితరు
లెవ్వరును లేరు. దానినిఁ బట్టిజూడ నది యొకయాంతరంగికసభయై యుండ
నోపు. చక్రవర్తి కొంతవఱకు మౌనముద్ర వహించియుండెను. మిగిలినవా
రాతఁ డేమివచించునో యని యూరకుండిరి. తుదకుఁ జక్రవర్తి మెల్లన నిట్ల
నియె. "కుమారామాత్యదండనాయకులారా! కొన్నిముఖ్యాంశములఁగూర్చి
మీతో ముచ్చటింపవలసియున్నది. సావధానచిత్తులరై యాలకింపుఁడు."

అని యేమియో నుడువఁబోవుసమయమున సేవకుఁ డొకఁడు లోని
కరుదెంచి, భయమున దేహము కంపింప వినయసంభ్రమములఁ బ్రణా
మంబులఁ గావించి చేతులుజోడించి గద్గదస్వరంబునఁ "ప్రభూ! మోసము-
మోసము-గొప్ప మోసము." అని మాఱుమాటాడలేక యొకమూల నిలుచుం
డెను. పైపలుకులు విన్నంతనే సభ్యులందఱు నివ్వెఱపోయిరి. చక్రవర్తియు
నాశ్చర్యచకితుఁడై వాని నిట్లు ప్రశ్నించెను.

చక్రవర్తి:—ఎవఁడవురా నీవు? ఏమిప్రేలుచుంటివి?

సేవకుఁడు:—హుజూర్! చేతిలోనిపిట్ట యెగిరిపోయినది. మనప్రయత్నము
లన్నియు నేఁటితో మంటఁగలిసినవి.

చక్రవర్తి:—నీవుచెప్పునది నాకుఁ దెలియుటలేదు. సమాచార మేదియో
సరిగాఁ దెలుపుము.

సేవకుఁడు:—హుజూర్! మన ప్రయత్నములన్నింటిని నొక్క్ తృటిలో వమ్ము చేసి సౌందయనగరరాజకుమారుఁడగు భీమసింగు—

చక్రవర్తి:—ఏమేమి? యుందయనగరపురాకొమరుఁడా?— భీమసింగా? విషయ మేదియో తక్షణమే తెల్పుము.

సేవకుఁడు:—హుజూర్! తెలుపుట కే మున్నది. కావలసినంత యైనది. రాకొమరుఁడు పారిపోయినాఁడు

చక్రవర్తి:—ఏమేమి? భీమసింగు పారిపోయినాఁడా! యెట్లు?

సేవకుఁడు:—హుజూర్! నేను నబ్దుల్ ఖరీమును భీమసింగునకు ముఖ్యసేవకులుగ నియమింపఁబడియుంటిమి. మేమిరువురము తమయాజ్ఞానుసారముగ నిన్నటివఱకు రాజపుత్రునిఁ గడుజాగరూకతతోఁ గనిపెట్టియుంటిమి. నిన్న మొహరమ కడపటిదినము గదా? నే నబ్దుల్ ఖరీముచు జూచితిని. అప్పు డతఁడు నాతో "ఖుస్రూఖాక్! నేను జక్రవర్తిగారి యాజ్ఞ మేర నొకపనిమీఁదఁ బోవలసియున్నది. రాత్రి కిచ్చట నుండుటకు వీలులేదు. భీమసింగు కొంతజబ్బుగ నున్నాఁడు. రాత్రి కాతని కాహారము వలదఁట. ఆవిషయము భోజనము దెచ్చువానితోఁ దెల్పుము. నీ వతిజాగరూకుఁడవై రాత్రికి రాచకొమరునిఁ గనిపెట్టియుండుము. జాగ్రత్తసుమా," యని తెల్పెను.

అతఁడు వృద్ధుఁడును, నమ్మకముగలవాఁడును నగుటచే నేనాతని మాటల నమ్మితిని. నే నెప్పటివలె రాత్రియేడుగంటలగుసరికి భుజించి రాకొమరుని సౌధమునకు వెడలితిని. సౌధమును గావలికాయువా రెప్పటియట్లే జాగరూకులై యుండిరి. నేనుమాత్రము రాకొమరుని గదిఁజేరితిని. అతఁడు నిండుగ ముసుగిడుకొని నిద్రించుచుండెను. నే నాతని మెల్లగఁ బలుకరించితిని. కాని యాతఁడు పలుకలేదు. గాఢనిద్రాసక్తుఁడై యుండుననితలఁచి మెల్లన గది నిర్గమించి తలుపుమూసికొని, బయటివసారాయందుఁ బరుంటిని.

నాఁడేమియోఁగాని యెక్కడలేని నిద్దుర నన్నావరించెను. పండుకొన్నకొంత సేపటికి గాఢనిద్రలో మునింగితిని. తెల్లవారిలేచి చూచుసరికి భీమసింగింకను నిద్రించుచుండెను. నే నాతని లేపలేదు. వెంటనే నే నటనుండి వెడలి, కాలకృత్యములఁ దీర్చుకొని మరల వచ్చువేళకు దాదాపెనిమిది గంటలై యుండెను. అతఁ డప్పటికిని లేచియుండలేదు. నాకుఁ గొంతయనుమానము పుట్టెను. ఒక్కింత గట్టిగఁ బిలిచితిని. కాని ప్రత్యుత్తరము రాలేదు. మఱింత బిగ్గరగఁ బిలిచితిని. అప్పుడు మేల్కొనలేదు. నా కనుమానము హెచ్చెను. వెంటనే మంచమును సమీపించి తడబడు చేతులతో మెల్లన ముసుగెత్తితిని. ఆశ్చర్యమాశ్చర్యము! నిట్టనిలువున నిర్విణ్ణుఁడ నైతిని. భయమున దేహము గడగడ వడంకఁజొచ్చెను. హృదయము దడదడ కొట్టుకొనసాగెను. నోట మాటరాదయ్యెను. ఉన్నప్రాణము లున్నట్లెగిరిపోయినట్లయ్యెను. తుద కెట్లో మోసము మోసమని కెవ్వునఁ గేకవైచి నేలఁ గూలఁబడితిని. నా కేకవిని క్రిందియంతస్తునందున్న సేవకు లందఱు పరుగిడివచ్చిరి. వారినిఁ జూచి కొంత ధైర్యమును బొంది, మంచమును సమీపించి దానినిఁ బరిశీలించితిమి. రాజపుత్త్రుఁ డందు లేడు. దిండ్లు గుడ్డలు మాత్రము మానవాకారముగఁ దీర్పఁబడి వానిపై నొక పళసరికంబళి కప్పఁబడియుండెను. ఆహా! భీమసింగెంత నేర్పరి? ఎంతమాయలమారి? నిమిషములో నందఱ నేమఱించి పారిపోయినాఁడు. మే మాపడకను జక్కఁగఁ బరిశీలింప నందొక్కజాబునుఁ జూచితిమి. హుజూర్! నాకుఁ దెలిసినదింతయే; ఇందు నాతప్పేమియును లేదు. క్షమింపుఁడు. ఇదిగో! యీ లేఖను జూడుఁడు.

అని యాసేవకుఁడు జాబును జక్రవర్తిసమ్ముఖంబున నుంచెను. ఆమాటలు వినఁగనే చక్రవర్తిని నాశ్చర్యరోషంబు లాక్రమ్మడి, నావరించెను. అతని నేత్రము లరుణము లయ్యెను. అతఁ డాలేఖను జదువుమని యక్బరునకు గనుసన్నఁజేసెను. తండ్రియాజ్ఞమేర నక్బరు దాని నిట్లు చదువఁదొడఁగెను.

"మ్లేచ్ఛసామ్రాజ్యాధిపతియగు నౌరంగజేబుగారికి:—
భీమసింగువిన్నపములు:—

ఇంతవఱకు నన్ను మన్నించి సామంతసింహాసనముల కే నెంతయుఁ గృతజ్ఞుఁడను. కాని నే వెడలునప్పుడు మీయొద్ద సెలవుఁగొనకుండినందులకు క్షమింపవలయును. మీరిప్పుడు నాయుపకారకత్వము జక్కఁగ నెఱుంగుదురుగాక! మిమ్మింక ఢిల్లీయందుఁ గాంచఁజాలనందులకుఁ జింతిల్లుచున్నాను. మిమ్మెప్పుడైన నాహవరంగంబునఁ గాంచఁగల్గుభాగ్య మబ్బినఁ దగురీతి బహూకరింపఁగలను. ప్రస్తుతము నన్ను క్షమింపవలయును. దేవుఁడు తమకు మేలొసంగును గాక!"

ఇట్లు,
భీమసింగు.

శైలేశావృత్తాంతము విన్నవిమ్మట ఔరంగజేబు పొందినకోప మింతింతయని నుడువ నలవిగాదు. శోకక్రోధాక్రాంతభుజంగంబుచందంబున జ్వాలాధారాప్రవాహంబునఁ బ్రజ్వరిల్లువహ్నివిధంబున మండిపడుచు సభవారిఁ గని యిట్లనియె.

"వింటిరా! యీనీచుని ప్రలాపములు? వీనితండ్రి నాకెంతవిరోధి యైనను నే నది పాటింపక వీనిని సగౌరవంబుగఁ జూచుచుంటిని. బహుమతు లొసంగితిని. మంచివాఁడని నమ్మియుంటిని. కాని యిట్టిమాయలమారి యని తలంపనైతిని. ఇసుమంతయైనఁ గొఱంతలేక సర్వసౌఖ్యముల నొసంగియుంటిని. తప్పించుకొని పారిపోవునంతటిబుద్ధి యేలకల్గెను? ఆహా! పామునకుఁ బాలుపోసి పెంచినను విషముగ్రక్కుట మానునా? కాన నీచుఁ డెంత మంచివాఁడుగఁ గన్పట్టినను వానిసహజగుణంబుల మానఁడుగదా? నన్ను గదనరంగంబునఁ జూచినఁ దగురీతి బహూకరించునఁట. ఆ-హా-హా- వింటిరా వీని బిరుసుమాటలు? ఔరంగజేబు వైరికులమత్తేభకంఠీరవంబని యెఱుంగఁడు పోలును. కాలసర్పంబుతోఁ జెర్లాటమాడువిధంబున నాతోఁ బోరాడ

సమకట్టుచున్నాఁడు. ఇంక వీనిని వీనితండ్రిని వీనిసహాయులను విడువఁ గూడదు. వీరి నింక వదలితిమేని నాపరువునకు హానికలుగును. 'శత్రుఋణ శేషము లుండఁగూడ'దని పెద్దలు నుడువుదురు. రాజపుత్రులెల్లప్పుడు నాకహితులై ప్రక్కలోనిబల్లెములై యున్నారు. వీరు ప్రాణంబులతో నుండినన్నాకు శాంతి చేకూరదు. తత్క్షణమే వీరినెల్ల రూపుమాపవలయును. కొద్దికాలములో దండయాత్ర వెడలుటకు సేనల నాయత్తపఱచుఁడు. మొదట నక్బరుఖాన్ వరుఖానులు సైన్యములఁదీసికొని నాథద్వారమునందలి కృష్ణాలయమును, నేకలింగేశ్వరాలయమును నేలపాలుగావింపవలయును. తర్వాత నొకటిగఁగలిసి యుందయనగరమును ముట్టడింపవలయును. ఇంతలో నేనును మనబలంబులనెల్లఁ బ్రోగుచేసికొనివచ్చి మిమ్ముఁగలిసెద. సర్వసామంతులకు వారివారిబలంబులనెల్లఁ బ్రోగుచేసికొని శీఘ్రంబున మనలనుఁ గలియున ట్లాజ్ఞాపత్రములఁ దత్క్షణమే పంపవలయును. దండయాత్రకు సర్వమును సిద్ధపఱచుఁడు. మీరింక వెడలుఁడు." అని యౌరంగజేబు పుత్రసహితుండై యటనుండి వెడలిపోయెను. మిగిలినవారును దమతమగృహంబులకు వెడలిరి.

---

# పదునెనిమిదవ ప్రకరణము

## రక్షించిన దెవరు?

హారావళీపర్వతపంక్తులందుండు 'కుంభాల్మడు' కోటశత్రురాజుల కభేద్యమై విలసిల్లుచుండెను. రిపువీరభయంకరుండగు ఘాహూరుగోపీనాథుఁడాదుర్గంబును బాలించుచుండెను. నికటప్రదేశంబులు వివిధఫలవృక్షములతోఁ గూడి ప్రేక్షకులమనంబుల కానందముఁ గొల్పుచుండెను. ఆకోటలో రాజ ప్రాసాదసమీపంబున నొక్కపురాతన దుర్గాలయం బుండెను. ఆయాలయము సర్వశోభాయమానమై విలసిల్లుచుండెను. జగన్మాతయగు భవానీదేవి యందు సదా వాసముఁజేయుచు భక్తుల యభీష్టముల నెఱవేర్చుచుండెను.

ఒకనాఁటి సాయంకాలమునఁ నొకసుందరరదన యాహిమాచలతనయా చరణారవిందంబుల వ్రాలి నిర్మలభక్తిఁ బూజించి యాపవిత్రమూర్తినిఁ దనహృత్పీఠంబునఁ బదిలంబుగ నెలకొల్పి బద్ధాంజలియై," త్రైలోక్యజననీ! పరమపావనీ! చంద్రశేఖరమనోహారిణీ! మాహేశ్వరీ! నీమహిమం బేమని కొనియాడుదు? సమస్తలోకంబులు నీమాయఁజిక్కియేగదా యున్నవి. సర్వమునిబృందారకాదులెల్ల నీమాయంజిక్కి నీదివ్యమంగళవిగ్రహంబును గాంచఁజాలకున్నారు. కించిద్జ్ఞనగు నేను నిన్నేమని వర్ణింపఁగలను? నీకృపావలోకనంబుల లోకంబులకెల్ల మంగళంబు నాపాదింతువు. నీయిచ్ఛామాత్రంబున సమస్తమునుఁబుట్టించి పెంచి లయింపఁజేయుచుందువు. నీకృపాకటాక్షవీక్షణంబు లెవ్వనిపైఁ బఱపుదువో? వాఁడే ధన్యతముఁడు. నీభక్తురాలి ననుగ్రహింపుము.

తల్లీ! త్రిపురాంతకురాణీ! నీయనుగ్రహసంపాదనార్థమై యనేకోపవాసములం గడునిష్ఠతోఁ జల్పుచుంటిని. కాని నీవింతవఱకు ననుగ్రహింప

వై లెపి. కాత్యాయనీ మనోవాక్కాయకర్మంబుల నీకుఁ బ్రియంబు లాచరించి యుంటిఁగదే! నేనొకవేళ నెట్టియకార్యములనైన నాచరించియుండిన క్షమించి రక్షింపుము. భక్తులపాలిటి కల్పభూజంబవే. సర్వలోకకళ్యాణసంధాయినివే. శక్తి! నీకృపావలోకనం బీదీనురాలిపైఁ బఱపుము. నీభక్తురాలి ననుగ్రహింపుము. నాకోర్కె సఫలంబు సేయుము.

సర్వాంతర్యామివగు నీ వెఱుఁగని దొక్కటియైనఁగలదే? లోకమాతా! ప్రస్తుతము దేశమాత మ్లేచ్ఛులదుండగములకుఁ జిక్కి కృశీభూతచేతస్కయై పరితపించుచుండ నీ విట్లుపేక్ష సేయఁ బాడియే? భవానీ! అలనాఁ డాయసురుల నీ ప్రచండకోపాగ్నిభస్మీభూతులం జేయలేదే? కోటిసూర్యప్రభాభాసమానంబై దుర్నిరీక్ష్యంబై సకలలోకంబులకు భయంబుఁగలుగఁ జేయు నీభయంకరాకారంబును గాంచినంతనే రాక్షసగణములగుండియలు నీరైపోవలేదా! కిరాతుల కెనయగు తురుష్కులొనర్చు దుండగములచే ఖిన్నతవహించి పురపురఁబొక్కు మాదేశజనని నుద్ధరింపుము. అందులకు నీకకా కింకెవ్వరు దిక్కు? రుద్రాణీ! పాపిష్ఠియగు మ్లేచ్ఛచక్రవర్తి దుండగము లేమని వచింతును. దేవాలయంబుల నేలపాలుగావించె. హిందువులదేవతల నూతఁ ద్రోయించె. యశోవంతులగు జస్వంతజయసింహులాదిగాఁగల రాజపుత్రవీరులనెల్ల మాయోపాయంబున రూపుమాపె. హైందవులకెల్లఁ బడరానిబాధలఁబెట్టె. దాక్షాయణీ! యిట్టివిపత్సముద్రంబున మునిఁగియున్న రాజపుత్రస్థానము నుద్ధరింపుము. శత్రువుల నిర్మూలింపుము. నీదాసులమగు మమ్మాశీర్వదింపుము. జయలక్ష్మినిఁ బ్రసాదింపుము. దేశమాత నీచతురకలబారినుండి రక్షింపుము."

అని యాబాలామణి చాలసేపు తదేకధ్యానయై దేవిని స్తుతించుచు భక్తిపారవశ్యంబున దేహంబు మఱచెను. అప్పు డామెకు దేవి సాక్షాత్కరించి ఆ సర్వమంగళప్రదంబగు తనదక్షిణహస్తంబు నాబాలిక మస్తకంబున నునిచి నిమురుచుఁ బ్రేమామృతధారలం గురియు మృదుమధురవాక్కుల నిట్లనియె.

"బిడ్డా! నీభక్తికిఁ గడుంగడు మెచ్చితిని. సాక్షాత్కరించితిని. నీకోర్కె సఫ
లంబగుఁగాక! ప్రస్తుతము నాథద్వారమునందుండు కృష్ణాలయమును నిర్మూ
లింప నడుకట్టి మొగలుసైన్యములు వచ్చుచున్నవి. రాజపుత్రులకుఁ దురుష్కు
లతోడ గొప్పసంగరము కానున్నది. కడపట రాజపుత్రులకే జయము లభిం
చును. నీవిప్పుడు సైన్యముఁగొని, శీఘ్రమునఁ జని రాధాప్రియయు నాల
యము నుద్ధరింపుము. తురుష్కులనోడించి జయలక్ష్మినిఁ బొందుము. ఇదే
నిన్నాశీర్వదించుచున్నా"నని దేవి యంతర్హితయయ్యెను.

వెంటనే యాబాలికకు స్మృతివచ్చెను. కన్నువిచ్చిచూడ యామినీరమ
ణుఁడు కళాప్రపూర్ణుఁడై తారకాగణమధ్యంబునఁ బ్రకాశించుచుండెను.
రాత్రి మొదటియామము మింకను గడచియుండలేదు. ఆజవ్వని తానుగాంచిన
దృశ్యముల కద్భుతంబొందుచు, దేవి తన్ననుగ్రహించెనని యుప్పొంగుచు
వేగంబుగఁ గోట జేసి కరిగెను.

ఆసమయంబున రాచనగరునందలి రమ్యంబగు నొకగదియందు
ఘాతూరుభీమసింగు లాసీనులై యేదియో ముచ్చటించుకొనుచుండిరి. ఆసమయ
మునఁ బ్రేమాబాయి లావణ్యమూర్తి వారియెదుట సాక్షాత్కరించెను. ఆమె
వారియుభయులకును వందనంబు లాచరించి, తనతండ్రి పార్శ్వంబున నిలుచుండి
తండ్రి నుద్దేశించి యిట్లనియె. "తండ్రీ! యిట్టిసమయమున మీరిట్లు పేష్
నేయఁబాడియే? రెండురెండు. శీఘ్రముగ సైన్యంబుల నాయత్తపఱచుఁడు.
కవచాద్యాయుధంబుల ధరింపుఁడు. నాథద్వారమందలి కృష్ణాలయంబును
నిర్మూలింప మ్లేచ్ఛసైన్యములు వచ్చుచున్న"వని తాను దేవి నర్చించినది మొదలు
సర్వవిషయంబులు విశదంబుగఁ దెలియ బఱచెను. ఇంతలో సేవకుఁ డొక
నూతనపురుషుని లోనికిఁదీసికొనివచ్చి "మహాప్రభూ! నాథద్వారమునుండి
యాతఁడు పంపఁబడినాఁ"డని తెల్పి యాతని నట విడిచిపోయెను. ఆనూత
నాగంతకుఁడు వారికి వినయంబున వందనంబు లాచరించి యిట్లనియె.

"ప్రభువులారా! నాథద్వారమందలి శ్రీకృష్ణాలయమును నిర్మూలింప మొగలు సైన్యములు వచ్చుచున్నవని యెఱింగి యచ్చటియర్చకులు తమ్ము సహాయార్థము గొనిరమ్మని నన్నుఁ బంపిరి. ఆలసింపక వెడలుఁడు. ఆలసించినఁ బ్రమాదము కల్గును."

ఆమాటలు విని ఘాకూరు కొంతయాలోచింపఁదొడఁగెను. కాని యాపలుకులు చెవులకు ములుకులవలెఁ దోఁచుటచేత భీమసింగునేత్రము లరుణములయ్యెను. దేహ మువ్వొంగెను. రౌద్రాకృతిఁ దాల్చెను. వెంటనే యాతఁ డొరనుండి కృపాణంబుఁదీసి ఘుళిపించుచుఁ "దుష్టతురుష్కాధము లారా! రండు; రండు. మిమ్మెల్లఁ గాలునిసదనమునకుఁ బంపెద" నని వీరావేశంబున గది నిర్గమించుచుండ ఘాకూ రాతనికరంబు నిజకరంబునఁ గీలించి "కుమారా! కొంత తాళుము. ఆత్రపడకుము. ఎదిరిబలంబునుఁ దనబలంబును విమర్శించి తగురీతిం బ్రవర్తింపవలయును. నీ విప్పుడొంటరిగ నేఁగిన మొగలు సైన్యంబుల నెట్లు నిర్జింపఁగలవు? ప్రస్తుతము నాయొద్ద నాలుగువందలవీరాగ్రేసరు లున్నారు. నీ వీసైన్యంబునుఁగొని ముందు వెడలుము. తర్వాతఁ దగు బలంబుల సేకరించి సహాయార్థ మంపెద" నని తనయొద్దనుండుసైన్యము నిచ్చి పంపెను. భీమసింగునకు యుద్ధమన్నఁ గడుఁబ్రీతి. అతఁ డాహవరంగంబునఁ దనబలపరాక్రమంబులఁ జూప నువ్విళ్లూరుచుండెను. కాన వెంటనే యాతఁ డాసైన్యమునుఁగొని నాథద్వారమార్గమునుఁబట్టి చనియెను.

భీమసింగు ఘాకూరొసఁగిన రాజపుత్రవీరులను గొని మార్గమధ్యంబున రెండువందల విలుకాండ్రను సేకరించుకొని యయ్యరణ్యమార్గములు దానెఱింగినవగుటఁజేసి సమీపమార్గంబునఁ బయనంబుసల్పి దాదాపురెండుగంటలగునప్పటికి బానసునదీతీరమునుఁ జేరెను. ఆనది కవ్వలిగట్టున రెండువందల గజములలో నారుక్మిణీమనోహరుని యాలయము గన్పట్టుచుండెను. అంతలోఁ దుపాకులశబ్దము వినవచ్చెను. భీమసింగు నిశ్చేష్టుఁడాయెను. విరోధులు దవ

కంటె ముందుగ వచ్చిరనియు నిఁక నాలసించినఁ బ్రమాదము తటస్థించు ననియు నెంచి తత్క్షణమే యావలిగట్టునుఁజేర నాతఁడు ప్రయత్నించెను.

భీమసింగునానతి రౌతులు నదిని బ్రవేశించి గుఱ్ఱములనీఁదించి యావలిగట్టునుఁ జేరిరి. అంతలో నక్బరు సైనికులుగూడ నాపరిసరప్రదేశముల నాక్రమించుచుండిరి. రెండువందలకన్ఫరజోగులు మొగలులను డీకొని తీవ్రముగఁ బోరుసల్పి వీరమరణము నొందిరి. కన్ఫరజోగులబాణపరంపరలకు గుఱియై చాలమంది మొగలులు ప్రాణములఁ దొఱఁగిరి. కాని రెండు వేలమ్లేచ్ఛవీరులతో రెండువందలకన్ఫరజోగు లెంతవఱకుఁ బోరాడఁగలరు? అప్పుడు ప్రేల్చినతుపాకిశబ్దములే భీమసింగునకు వినవచ్చినవి.

మొగలుసైన్యము కన్ఫరజోగులను జయించి యుత్సాహంబున జయజయశబ్దములను జేయుచు మెల్లన నాలయంబును సమీపించుచుండెను. అవడు రేయి రాజపుత్రులు దమ్మెదిరింప వత్తురని వా రణుమాత్రమైన నెఱుంగరు. కన్ఫరజోగులుమాత్రమే యానాలయసంరక్షణార్థమై నియోగింపఁబడిన సైనికవర్గమనియుం, వారి నతిసులభంబున జయించితిమనియుఁ దామిఁక నిరాటంకముగ నాలయంబు నిర్మూలింపవచ్చుననియుం, నూహించి యామొగలు సైనికులు దమతమదళంబుల వీడి స్వేచ్ఛానుసారులై వచ్చుచుండిరి.

మొగలుసేన లిట్లేమఱుపాటున వచ్చుచుండ భీమసింగు తనబలంబును బురికొల్పి మొగలులం దాఁకెను. ఆకస్మికముగ విరోధిసైన్యము తమ్ముఁదాకుటచే మొగలు లాశ్చర్యసంభ్రమంబుల మునింగిరి. వెంటనే వారును, వారి వారియాయుధంబుల ధరించి యుద్ధసన్నద్ధులైరి. పోరు మొదలయ్యెను. రాజపుత్రులు ప్రళయకాలరుద్రులమాడ్కి విజృంభించి జీవితంబుల కాసింపక తమకృపాణంబులచే నరివీరకంఠనాళంబులఁ దునుముచుండిరి. తురుష్కవీరులనుఁ బ్రాణములకు వెఱువక శౌర్యంబుచే భీకరంబుగఁ బోరుచుండిరి. ఇరుతెగలందును వీరులు మడియుచుండిరి. దుల్లినగాత్రంబులనుండి రక్తధారలు ప్రవహింపఁజొచ్చెను. ఆరుధిరప్రవాహమునందు ఖండఖండంబులయిన శిరంబులు

గరంబులు మొండెంబులు దొర్లుచుండెను. వీరావేశంబున సింహనాదంబులు సల్పుచు నిజనిశితకృపాణంబులవిరోధివర్గంబుల ద్రెంచువారు కొందఱును, నొకరినొకరు నిర్దాక్షిణ్యంబునఁజూచుచుఁ బౌరుషవాక్యంబులు పలుకుచు బల్లెంబులచే నెల్లయంగంబులఁ జిల్లులువాపు కొందఱును, విరోధుల వ్రేటులను డాలు సాయంబునఁ దప్పించుకొని తిరిగి వారిని వ్రేయసుంకించువీరభటులు గొందఱునై యాహవ మతిసంరంభంబుగ జరుపుచుండిరి.

కొంతవడికి మొగలుసేనలు స్థైర్యంబువీడి పోవఁజొచ్చెను. అదియె మంచితరుణముగ నెంచి భీమసింగు తనసైన్యమునంతయు మరలించి రెండు భాగములుగఁజేసి యొకభాగము నచ్చటనే నిల్పి పక్కానరౌతులను గొని దేవాలయమునుఁ బ్రవేశించి రాధాప్రియుని విగ్రహమునుగొని నదీతీరమునుఁ జేరఁబోవుచుండెను. నదీతీరమునకును వానికిని నెంతయో దూరము లేదు. నాలుగజములమాత్రమే యున్నది.

ఇంతలో మొగలుసైన్యాధిపతులు తమసైన్యములఁ దగునీతి నిర్ణయించుకొని రెట్టించినయుత్సాహంబున రాజపుత్రులపైఁబడిరి. నాఁటిదినమెట్టయినను నాలయమును నిర్మూలించి విగ్రహమును గొనిపోవుటకై మొగలులు నిశ్చయించుకొనియుండిరి. మ్లేచ్ఛసైనికులతో దురంబుసల్పుట కష్టమైనను వీరహరియగుభీమసింగు చలింపక తనస్వల్పసైన్యమును బురికొల్పు వారును గంధగజకుంభస్థలంబుల వ్రక్కలింప నుంకించుకేసరులచాడ్పున మూర్తీభవించిన శౌర్యంబుపోలుపున నిజనిశితకృపాణంబుల ఝళిపించుచు నశ్వంబుల నతిలాఘవంబుల నడిపించుచుఁ గదనరంగంబున వీరవిహారంబు సలుపఁజొచ్చిరి. మొగలులుసైతము రాజపుత్రులకుఁ దీసిపోక పోరుచుండిరి. తుదకు స్వల్పసంఖ్యాకులైన రాజపుత్రవీరులు, తైలహీనంబున నిర్వాణంబు నొందుదీపకళికలంబోలె నాహవరంగంబున మేనులు దొఱంగిరి. భీమసింగు సైతము బాధలకు లోనయ్యెను. అతనిగుఱ్ఱముగూడ గాయములతో నిండెను.

మొగలు లుత్సాహంబున సింహనాదములఁ జేయుచుండిరి. జయలక్ష్మీ కటాక్ష వీక్షణములు వారివంకఁ బఱపుచుండెను.

ఆభీతిభయంకరసమయమునఁ దటాలున నెటనుండియో నిశితమార్గణ జాలంబులు వర్షధారలవలె మొగలుసైనికులపైఁ బడ నారంభించెను. మొగలు సైన్యమున గందరగోళము ప్రారంభమయ్యెను. చాలమంది మొగలుసైనికు లాబాణహతిచేఁ బ్రాణములఁ దొఱంగి నేల కొఱగుచుండిరి. దుగదృష్టవశమున నాశరవృష్టికి గుఱియై మొగలుసైన్యాధ్యక్షులు హయంబులనుండి క్రిందికిఁ బడి యసువులఁబాసిరి. అప్పు డాసైన్యము చిందఱవందఱయై ధైర్యంబువీడి దిక్కు తెలియక పరుగిడఁజొచ్చెను. తృటిలో జయలక్ష్మిని వరింపనుండిన తురుష్కులు మఱుక్షణముననే నిర్జితులై పలాయనమంత్రమును బఠింపవలసి వచ్చెను. జయాపజయంబుల నిర్ణయింప సమర్థుఁడు దేవుఁడుకదా ?

అప్పు డాదృశ్యమును గాంచి రాజపుత్రులు తమనేత్రములను దామే నమ్మఁజాలకుండిరి. ఆకస్మాత్తుగ నరివీరులు హతులగుటను గాంచి వారొందిన యాశ్చర్యము వర్ణనాతీతము. దైవమే తమకావిధి జయలక్ష్మినిఁ బ్రసాదించె నని తలంచుచు నారుక్మిణీరమణనామసంకీర్తనంబునుఁ జేసిరి. ఆకస్మికముగ విరోధసైన్యముపై బాణవృష్టిఁ గురిపించి తమకు జయలక్ష్మితోఁబాటు, ప్రాణలక్ష్మిని బ్రసాదించిన పుణ్యమూర్తులెవ్వరో యని భీమసిం గద్భుతం బొందఁజొచ్చెను.

హతశేషులగురాజపుత్రులు నదీతీరమును జేరి యొకతెప్పయందు రాధామనోహరునివిగ్రహంబును బదిలపఱచి యాతెప్పను నీటం దింపిరి. బలిష్ఠకాయులగుబోయల నలువు రాతెప్పను నడుపుచు నదీజలంబుల నీఁదుచుఁ బోవుచుండిరి. తదితరరాజపుత్రులు గుఱ్ఱంబుల నీదించుకొని యావలగట్టును జేరుచుండిరి. నదీప్రవాహమున కెదురుగ నీఁదవలసివచ్చుటచే వారివేగము తగ్గిపోవుచుండెను. వా రానదీమధ్యమును జేరుటఁజూచి మ్లేచ్ఛవీరులు

వారిపైఁ దుపాకులు ప్రేల్చిరి. పాపము! రాజపుత్రు లప్పు డేమిచేయఁగలరు? వారిస్థితి మునుపటికంటె మఱింత విషమమయ్యెను. చాలమంది నావలిగట్టునే చేరలేదు. తెప్పనడుపుకొని యీఁదుచుఁబోవుచున్నవారిలో నొకఁడు తుపాకిగుండుతగిలి తటాలున నీటఁబడి మునిఁగెను.

ఆసమయమున సమీపమున నీఁదుచుఁబోవుచున్న భీమసింగు తెప్పను నడుపఁదొడఁగెను. గట్టుపైనుండు మహమ్మదీయసైనికుఁ డొకఁడు భీమసింగును గాల్చుటకు గుఱిపెట్టుచుండెను. తనవిపరీతపరిస్థితినిఁ జూచి యాతఁ డొకవికటమందహాస మొనర్చి "హా! హతవిధీ! రాకొమరుండనయ్యు, వీర పురుషుండనయ్యు, రిపువీరభయంకరుండనయ్యు, నిప్పు డసహాయుండనై భవ ద్విగ్రహసంరక్షణార్థము జీవంబులఁ దొఱఁగవలసివచ్చెనుగదా? హా దైవమా! నాదుర్విధి నేమందును? ఈయకాలమృత్యువువాతఁ బడవలసివచ్చెనుగా? విధి దాఁట నెవ్వరితరము." అని తనమనంబునఁ జింతించి ప్రాణంబుల విసర్జించుటకు సిద్ధపడి యొక్కపరి నిమీలితలోచనుఁడై భగవంతుని మనంబున ధ్యానింపఁ దొడఁగెను. ఇంతలో 'ధా'మ్మని తుపాకి ప్రేలెను. భీమసింగు గుండియలు నీరై పోయినట్లయ్యెను. చేష్టలు దక్కినట్లయ్యెను.

మఱుక్షణముననే యాతఁడు నేత్రములువిచ్చి నలుదెసలఁ బరికించెను. తన్నుఁగాల్ప గుఱిపెట్టియుండినవాఁడు దలక్రిందుగ నీటఁబడిమునుఁగుటఁ గాంచె. అప్పుడు భీమసింగొందిన యాశ్చర్యము వర్ణనాతీతము. తన్ను రెండవ తూరి యకాలమృత్యువదనగహ్వరంబునుండి రక్షించి ప్రాణదానం బొసంగిన యాదివ్యమూర్తి యెవ్వరైయుండునో యని యాతఁ డద్భుతంబొందఁ జొచ్చెను. అతఁ డట్టే కొంతసేపటికి నదీతీరమునుఁ జేరెను. అప్పు డొకచెట్టు చాటుననుండి బాణమును వింట సంధించి యెక్కుపెట్టుచున్న ప్రేమాబాయి వీరమోహినీరూపము నాతఁడు గాంచెను. మృత్యుదేవతాకరాళవజ్రదంష్ట్రల నుండి తన్ను రక్షించిన దివ్యమూర్తి యెవ్వరో? యాతని కప్పుడు విశద మయ్యెను.

ప్రేమాబాయి నాతఁ డట్లకస్మాత్తుగఁ గాంచి యమితానందాశ్చర్య
ముల మునింగెను. తన్ను అట్లకస్మాత్తుగ రక్షించిన ప్రేమాబాయి నిశ్చయముగ
దేవీమూర్తియే యని యతఁడు దలంచెను. వెంటనే యాతఁ డామెను సమీ
పించి "మందస్మితముఖారవిందుఁడై "కన్యకామణీ! నేఁడు నీవు నా పాలిటి
పరదేవతవు. అకాలమృత్యువదనగహ్వరంబునుండి రక్షించి ప్రాణదాన మొసం
గితివి. నీ కే నెంతయుఁ గృతజ్ఞుఁడ. నీరౌద్రమూర్తి నుపసంహరింపుము.
శత్రువులు నిర్జింపఁబడిరి. అదె తెలతెలవాఱుచున్నది. కృకవాకధ్వనులు వినఁ
బడుచున్నవి. పురంబునకు వెడలుదము. నీ వీసమయమున కిటకేతెంచి సాహ
సంబుఁజూపుట వింతగనున్న" దని నుడివెను. ఆమాటల కామె మానసంబున
నలరుచు నాతనిఁ గాంచి, "ఆర్యా! ఇదియంతయుఁ దుర్గాదేవియనుగ్ర
హము. మీరవక్రపరాక్రమంబున రిపుల నిర్జించి శ్రీకృష్ణవిగ్రహంబు రక్షించి
జయలక్ష్మినిఁ జేకొంటిరి. ఇందు నాగొప్పతన మేమున్నది? మీరు నుడివిన
రీతినే పురంబునకుఁ బయనంబయ్యెదను." అని వెంట సైనికులనెల్లఁ గొని
ఆయరణ్యమార్గమున భీమసింగుమొదలగువారు తోడురా నామెయు నను
గతయై నడచుచుండెను. కొంతవడికి వారు పురముఁ జేరిరి."

# షండోమ్మిశవప్రకరణము



## మోసము

సుల్తా నక్బరుదయనగరంబు నతిసులభంబుగఁ బ్రవేశించెను. ఆపట్టణ వీధులందు మొగలుసైనికు లమితోత్సాహంబునఁ జరించుచుండిరి. రాజపుత్రుల కెల్ల నాధారమై రిపుదుర్గమంబై యుండిన పట్టణంబు మొగలులకు సులభసాధ్యమగుటఁ జూడ నందు విశేషాంశ మెద్దియో యుండకమానదు. ఉదయనగరము దమకు లోఁబడెననియు, మిగిలినసైన్యంబు లింక నిర్భయంబునఁ బురప్రవేశం బొనర్పవచ్చుననియు నౌరంగజేబునకు నక్బరు వర్తమాన మంపెను. ఆనగరము దమకు లోఁబడినమఱునాఁడే రాజసౌధవైభవంబుఁ దిలకింప నెంచి యక్బరు థార్ వరుఖానులు, వింతసోయగముల వెదజల్లునడకలతో నగరుం బ్రవేశించిరి. ఆగృహాంతర్భాగంబున నున్నవిశాలంబగు శాలం గాంచి కొంతవడి కందలి చిత్రంబులఁ దిలకించి శిల్పిచాతుర్యంబుల కచ్చెరువొందుచు నచ్చోటువాసి సౌధోపరిభాగంబునకుఁ బోయిరి. పరిసరప్రదేశములందలి సౌందర్యవస్తునికరంబులఁ గాంచుచుఁ గొంతవడికి వారందే యాసీనులైరి. అప్పుడు వారిట్లు సంభాషించిరి.

అక్బరు:— ఖాన్ సాహెబ్! తండ్రిగారి కేమని విన్నవింతును? అతని కెదురుగ నెట్లు పోదును. కృష్ణవిగ్రహము కొంచెములో నాచేతులనుండి జారిపోయెను. ఆహా! వారిసాహసము నేమందును? పరిచయముగలవాఁడొకఁడు నాజయలక్ష్మిని లాగికొనిపోయెను. పోనిమ్ము. అతఁడు నాచేఁ జిక్కనందుల కేనెంతయు సంతసించుచున్నాను. విధివశమున నాచేఁబడి యుండిన నాతండ్రి యాతనిఁ జిత్రగతుల బాధించియుండును.

థార్వరుఖాన్:—గతజల సేతుబంధన మిఁకేల? జయాపజయంబులు దేవుని యధీనములుకదా? ప్రస్తుతము మన మిరువురమును గొంతయుఁ జుమించుచుఁగ నొకే పాఠమును బఠించితిమి.

అక్బరు:—నీవుగూడ నావలెనే పరాజయము నొందితివా? యేవి! నీకథఁ గొంచెము తెల్పుము.

థార్వ:—అబ్బబ్బా. తలఁచుకొన్న నిప్పటికిని గుండెలు కొట్టుకొనుచున్నవి. నాజన్మమున నింతకుముం దెన్నడు నట్టిబాధఁ బడియుండలేదు. ఆకీటకముల కాటులచేఁగలిగినబాధ నన్నిప్పటికిని భీతిల్లఁజేయుచున్నది.

అక్బరు:—అవునవును. నిశ్చయముగ బలికితివి దేవాలయసంరక్షకులగు కస్ఫర జోగులు బహుతీవ్రముగఁ బోరాడి బాధించిరి.

థార్వ:— ఆజోగులకన్న నెక్కువగఁ గొన్ని తేనెటీఁగలగుంపులు చుట్టు ముట్టి చాలమందిని మట్టుపెట్టినవి

అక్బరు:—కస్ఫరుజోగులకన్న భయంకరమైనవియా? చెప్పుటకే నీకు భయ మగుచున్నదికాఁబోలు.

థార్వ:—నన్నూరక హాస్యముచేసెద రేల? అనుభవించియుండిన మీకే తెలిసి యుండును. పెద్దతేనెటీఁగలగుంపులు మనజనముపైఁబడి చీకాకుఁ గావించెను. ఎంతమేటివీరులైనను వానిధాటికిఁ బరుగిడవలసినదేకదా?

అక్బరు:—ఏమేమి? తేనెటీగలగుంపులువచ్చుటయు సైన్యము పరుగిడుటయుఁ జాల నాశ్చర్యముగ నున్నదే? విశదముగఁ దెల్పుము.

థార్వ:—అయిన వినుఁడు. తొలుదొల్త నేకలింగేశ్వరాలయమును నుత్తర దిశనుండి ప్రవేశింపఁదలఁచితిని. కాని యామార్గమున గొంతవఱకు నప్పటికి మార్గ మిఱుకుగఁ గనుపట్టెను. ఇరుపార్శ్వముల నెత్తైనకొండ లుండెను. ఆకొండలమీఁద రాళ్లగుట్ట లమర్పఁబడియుండెనని గూఢ చారులవలన నెఱింగితిని. మఱియు ద్వారంబున మమ్ము దాఁకుటకై కస్ఫరుజోగులు సిద్ధముగ నుండిరి. పైశిఖరంబులనుండి రాజపుత్రులు

మనపై శిలావర్షంబు గురిపించి నిర్జింతురని తలంచి యాదారి విడిచి వెనుక భాగమునుండి ప్రవేశించితిని. మొదట నామార్గము కొంతసుగమముగనే యుండెను. కాని కొంతదూర మరుగ బలమైనకోటగోడ యొక్కటి యడ్డుగ నుండెను. అం దొక్క ద్వారము దుర్భేద్యమై యుండెను. ఏనే నుఁగు లాద్వారంబును క్రమంబున భేదించెను. కంటకలతావృక్షసంకులంబైన దారినిఁ గడచితిమి. మాకును దేవళమునకును దాపా పఱమై ఉండెను. ఏకలింగేశ్వరాలయము గోపురప్రాకారంబులతోఁ బ్రకాశించుటఁ గాంచితిమి.

ఆసమయమున నా యాలయప్రాకారంబుపై నొక్క ముదుసలి యర్చకుఁడు నిలువంబడి, విరోధుల నిర్మూలించి తమకు జయంబొనగూర్పు మని దైవంబును బ్రార్థనంబుఁ జేయుచు విరోధుల శపించుచున్న వానివలెఁ గన్పట్టెను. మారాకను దెల్పుటకై యతనిసమీపమునఁ బడున ట్లొక గుండును బ్రేల్చితిమి. ఆదియే మాపొరపాటు.

ఏమిచెప్పుదును? ఎచటినుండియోగాని ఝుమ్మని చెవులు చిల్లులుపడు నట్లు శబ్దముఁ జేయుచుఁ బెద్దతేనెటీఁగలగుంపులు రివ్వునవచ్చి సైనికులపైఁ బడెను. అబ్బబ్బా! వానిపోటుకాటులఁ దలంచుకొన్న నిప్పటికిని భయమగు చున్నది. వానిధాటి కోర్వలేక గుఱ్ఱములు ఏనుఁగులు, రౌతులను ద్రోఁబడక యమితబాధచే సకిలించుచు ఘీంకరించుచుఁ బలుదిశలకుఁ బారఁజొచ్చెను. సైనికులయవస్థ వేఱచెప్పవలయునా? కత్తిప్రేటులకంటెఁ దీవ్రములగు వాని కాటుల కెవ్వరోర్చి నిలువఁగలరు? చెట్లులనక గుట్టలనక త్రోవలనక డొంకలనక 'బ్రతికియుండిన సుఖములఁ బడయవచ్చు' నని తలఁచి పరుగిడితిమి. చాల మంది మరణించిరి. కొందఱు నీటఁబడి మునింగిరి. సైన్యమంతయు ఛిన్నాభిన్నమై పరుగెత్తసాగెను. నేనేమియుఁ జేయునదిలేక యుద్ధముఁ జాలించి బ్రతుకుజీవుఁడా యని వెనుకకు మరలితిని. ఆలంగీరుపాదుషాగారికి నే నేమని తెల్పుదును? నా కేమియు దిక్కుతోఁచుటలేదు. చక్రవర్తిగారికి ముఖముఁ జూపుటకే చాల లజ్జయగుచున్నది.

[illegible]:—ఈచరిత్ర చాల వింతగ నున్నదే! మన మిరువుర మిప్పు డొకే స్థితి యందున్నాము. కడచిన పెండ్లికి మేళ మెందులకు? నిర్హేతుకములగు నిట్టి మత్సరస్పర్థలు నా కెంతమాత్రమును నచ్చుటలేదు. ఇతరులమతములతో మన కేమిపని? సహోదరతుల్యులగు హైందవులను వారియాలయములను నిర్మూలించు టెందులకు? ఈవిషయమునఁ దండ్రిగారి ప్రవర్తన నా కెంతయు నిష్టము లేదు. ఈయుద్ధము లన్నియు నిరర్థకములు. శాంతి కంటకములు. కాని, మన మేమిచేయఁగలము? పెద్దవారిపట్టుదల యట్టున్నది. లోనికి వెడలుదము రమ్ము. చదరంగమునందు నీకుఁ గొన్నిసూక్ష్మాంశములను జెప్పెదను.

అని వా రిరువురు సౌధోపరిభాగంబుమీఁది యొక్కగదిని బ్రవేశించి కూర్చుండి చదరంగమాడఁ దొడఁగిరి. క్రమక్రమముగ వారిమనస్సు లాయాటయందే లీనమయ్యెను. అటులనే కొన్నిగంటలు గడచెను. అకస్మాత్తుగ వారి కొకతుపాకిశబ్దము వినవచ్చెను. వెంటనే వారు తెప్పిరిలి యాటను జాలించి సౌధోపరిభాగంబునకు వెడలిరి. అప్పటికి రాత్రి తొమ్మిది గంట లయియుండెను. చంద్రుఁ డింకను నుదయించి యుండలేదు. ఎటుజూచినను గటికచీఁకటు లావరించియుండెను. అంతలో మఱలఁ దుపాకి శబ్దము వినవచ్చెను. వా రాధ్వనివిని నివ్వెఱపోయిరి. ఆశబ్దము తూర్పుదిశనుండి వచ్చినట్లు వారు గ్రహించిరి; కాని, గాఢాంధకారమున వారి కేమియుఁ గానరాలేదు. కారణ మెద్దియో స్ఫురింపలేదు.

వా రట్లు నిలిచియుండఁ గ్రిందినుండి యెవరో వారిని సంబోధించి నట్లయ్యెను. వెంటనే వారు క్రిందికిఁజూడ నొకగుఱ్ఱపురౌతు వారికిఁ గాన్పించెను. ఆయాశ్వికుఁడును నచ్చటనుంపఁబడిన దీపపువెలుతురులో వారి నిరువుర నానవాలుబట్టి, "హుజూర్! మోసము-మోసము-రాజపుత్రులు పైఁబడినారు" అని నుడివెను. వా రామాటలను విని స్తంభీభూతులైరి. ఒండొరులముఖములఁ జూచుకొనిరి. వారికప్పు డేమిచేయుటకును దోఁచలేదు.

అక్బరు తనబలముల నెల్లఁ బట్టణమునకుఁ బూర్వోత్తరభాగంబుల నిలిపియుండుట చేతను, నాగ్నేయమున బలమైనకోట యుండుటచేతను, నాదిశలయం దెట్టిభయము నుండదని యాతఁడు తలంచెను. పశ్చిమదిశ యందు సైనికులగుడారము లుండెను. వారిబలము రాజపుత్రులబలముకంటె నెక్కువగ నుండుటచేతను, రాజపుత్రులు దమపట్టణమును దామే నిర్మూలింప సమకట్టి రనునమ్మకముతోడను, బొరపాటు నందియుండిరి.

వార ట్లేమఱుపాటున నుండ నకస్మాత్తుగ రాజపుత్రులు వారిపైఁబడిరి. అప్పుడప్పుడే చంద్రుఁ డుదయించుచుండెను. అది బహుళపక్షమగుటచే, మొగలుసామ్రాజ్య మింకమీఁద శుష్కీభూతంబై తుదకు సర్వనాశనమగునని సూచించుచున్నదో యనఁ జంద్రబింబము ప్రకాశహీనమై యుండెను. రాజపుత్రులకువలె మొగలుల కచ్చటిపరిసరప్రదేశము లంత బాగుగఁదెలి యుంటలేదు. ఇరుతెగలవారును నొకరి నొక రెదిరించిరి. పోరు ప్రారంభ మాయెను. నానారాను సంగ్రామము తీవ్రమయ్యెను. మొగలులు దమతుపా కుల నుపయోగింపఁ జూచిరి కాని గుఱితప్పక కాల్చుటకుఁ దగినంత వెలుతురు లేకపోవుటచే నాపని నాపివేయవలసినవారైరి. ఇరుతెగలందును జాలమంది మరణించిరి. తుదకు రాజపుత్రులధాటి కోర్వఁజాలక మొగలుసైనికులు శిబిర ములదెసకుఁ బరుగిడిరి. రాజపుత్రులు వారిని వెన్నంటి తమసైన్యములను రెండుభాగములుచేసి, భీమసింగు జయసింగు లొకభాగమును, రాణా యొక భాగమును గొని, మొగలులఁజుట్టుకొనిరి. ప్రాణములపై నాసవదలి వారును దీవ్రముగఁ బోరఁదొడఁగిరి. అక్బరు ఫార్వరుఖానులు దమతమసైనికులఁ బ్రోత్సహించుచు: దాముగూడఁ బిఱుతిపక దురంబు సల్పుచుండిరి. కాని తుదకు రాజపుత్రులదాడి కోర్వఁజాలక మొగలులెల్లరుఁ గోటలోనికిఁ బరు గిడిరి. వారిశిబిరములందున్న వస్తువులు నాయుధములు రాజపుత్రులు గ్రహించిరి.

ఆరాత్రియే రాజపుత్రు లంద ఱొక్కయెడఁగూడి తెల్లవాఱువేళకు మునుపే తమకు దొరకిన వస్తుజాలమును గొని సంకేతస్థలంబులఁ జేరవలయుం

ననియుఁ దరువాత మొగలులచే నాక్రమింపఁబడిన 'సురాజ్ షాబు'ను ముట్టడింపవలయుననియుఁ దీర్మానించుకొనిరి.

ఉదయనగరమునకు మూఁడు ప్రక్కలఁగల కనుమ లన్నియుం రాజపుత్రులచే రక్షింపఁబడుచుండెను. ఔరంగజేబు లోనికి రావలయునన్న రాజపుత్రులదళము భేదించుకొనియే రావలయును. అక్బరు, తహవరుఖాను లుదయనగరసమీపమునందలి లోయకు లోని ప్రవేశంబు నాక్రమించి యుండిరి. రాజపుత్రులు పైరెండుసైన్యములకును మధ్యనుండిరి. కాని వారుండుస్థానము వారికన్నివిషయముల ననుకూలమై యుండుటచే వారు నిర్భయులై యుండిరి. అక్బ రప్పుడు విషమావస్థయం దుండెను. అతఁ డెటు తిరిగినను, రాజపుత్రులకుఁ జిక్కవలసినదే. పాప మాతనిసైన్యమునఁ జాల భాగము నశించెను. తన కిదివఱకుఁ గలిగినయపజయములచేఁ గొంత నిరుత్సాహము గలుగఁజొచ్చెను. ఎటులైనఁ జేసి కనుమల కావలనున్న యౌరంగజేబు పాదుషాసైన్యముతోఁ దనసైన్యమును గలిపిన బాగుండునని తహవరుఖా నక్బరును బ్రోత్సహించెను. ఇదివఱకే నిరంతరయుద్ధములచే నలసియుఁ, బరాజయములచే నిరుత్సాహులయ్యు నున్న తనసైనికులనుఁ బ్రయాస పెట్టుట కాతఁ డిష్టపడక మార్వారు నాక్రమించియున్న దిలిర్‌ఖానుతోఁ దనసైన్యమును గలుపవలయు ననినిశ్చయించెను. అప్పుడు నాతనిచేఁ బ్రయాణమునకు సర్వము సిద్ధము చేయఁబడెను. కాని వస్తుపరికరములు చాలవఱకు రాజపుత్రులు దోఁచుకొనిపోవుటవలన వారి ప్రయాణమున కాటంకముగ నుండెను. అయినను వర్షాకాల మింకను గొన్నిమాసము లుండుటంజేసి యీలోపల వస్తుసముదాయము సరిచేసికొనవచ్చునని తలఁచి, యొకనాఁటి యుదయమున నుదయనగరంబు విడిచి మార్వారునకు నిజసైన్యసమేతుఁడై యక్బరు బయలుదేరి, తనదళము ముందుభాగమునను, తహవరుఖానుసైన్యము వెనుక భాగంబునను నడచునట్లు నియోగించెను. పిమ్మట వారు ప్రయాణము జరపిరి.

---

# ఇరువదవ ప్రకరణము

## ప్రేమచిహ్నము

హారావళీపర్వతసానుప్రదేశంబునంగల కుంభాల్మరుకోట చాలబలమైనది. కుంభాల్మరుకనుమ కేడువందలయడుగుల యెత్తుననున్న పర్వతశిఖరంబుపై నక్కోట విలసిల్లుచుండెను. పలురకముల యంపురిగెలతోడను, దుర్భేద్యంబులగు సప్తప్రాకారములతోడను వెలసి శత్రువుల కసాధ్యమై యున్న యాకోటకు సరియగుకోట మఱెద్దియు నుండదు. జోద్పురమహారాణి పుత్రసహితయై యందు వాసముఁ జేయుచుండెను. మహారాణితోఁ గూడ నంబాలిక యుండెనని చదువరు లిదివఱకే యెఱింగియున్నారు. ఆప్రదేశమునఁ బ్రేమాబాయి యంబాలిక లప్పుడప్పుడు వినోదముగఁ గాలముఁ బుచ్చుచుండిరి.

ప్రస్తుతము మొగలుసైన్యములు రాజపుత్రస్థానమునందు, జాల భాగము లాక్రమించియుండిరి. ఉదయనగరము మొదలగు పట్టణములు మొగలుల కధీనమైపోయెను; గాని కుంభాల్మరుదుర్గము మాత్రము వారికి జయింప నసాధ్యమైయుండెను. మహారాణి పుత్రసహితయై యాకోటయందుండుట దుర్గాదాసున కిష్టములేదు. ఆబూపర్వతమునందుఁగల జైనదేవాలయము మహారాణికి నివాసముగఁ జేయవలయునని యాతని యభిప్రాయము. అయ్యది దుర్భేద్యమైన రహస్యప్రదేశము గనుక దుర్గాదాసు తనయుద్దేశ్యమునుఁ గూర్చి మహారాణికిఁ బలుమాఱు తెల్పియుండెను. కాని యామె యన్నిస్థలముల కంటెఁ గుంభాల్మరుకోటయే సురక్షితమైనదని తలంచియుండెను.

మొగలు లన్నిదిశలనుండియుఁ దమ్ముఁ దాకుటచేతఁ గొమరుజేవి తుదకు దుర్గాదాసుమాటలకు సమ్మతింపవలసివచ్చెను. విరోధులు పరిసరప్రదేశము లాక్రమింపకముందే దుర్గాదాసుని యాధిపత్యమున మహారాణి పుత్రసహిత

మును, జైనదేవళమునకుఁ గొంపోఁబడెను. మహారాణి నొక్కనిమిషమైన
విడిచియుండఁజాలని యంబాలికయు వారివెంట వెడలెను. ఆప్రదేశమున
మహారాణి మూఁడునాలుగుదినములు గడపెను. అయినను నచ్చటిప్రదేశము
లామెకు నచ్చలేదు. తనపుత్రుఁడైన యజితసింహునిమాత్రము నమ్మకమైన
యొకదాసియధీనముచేసి తాను మరల నంబాలికాసహితయై దుర్గాదాసువెంటఁ
గుంభాల్మెరునకుఁ బ్రయాణమయ్యె.

వారు కుంభాల్మెరునకుఁ బండ్రెండుమైళ్లదూరము చేరునప్పటికి
మార్గ మక్బరుసైన్యముతో నిండియుండెను. రాణి మొదలగువారిని విరోధుల
బారినుండి తప్పించి యొకరహస్యస్థలమునుఁ జేర్పవలయునని దుర్గాదాసు తలం
చెను. సమయమున కట్టిస్థల మాతని కెద్దియును గోచరింపలేదు. అతఁ
డిట్లాలోచించుచుండఁ బ్రేమాబాయిమూర్తి వారియెదుట సాక్షాత్కరించెను.
అబూపర్వతమునుండి రాణి మరలఁ దిరిగివచ్చుచున్నదని విని ఘాసూరు తన
పుత్రిని వారికి సహాయార్థ మంపెను. రాణియు నంబాలికయుఁ బ్రేమాబాయి
నాదరబుద్ధిచే గౌరవించి కుశలప్రశ్నఁ గావించిరి. ప్రేమాబాయియు వారికెల్ల
రకుఁ దగురీతి నుత్తరములిచ్చి దుర్గాదాసును గాంచి "వీరకులావతంసా!
మీయాగమనంబు చారులవలన నెఱింగి మాతండ్రి నన్నిక్కడకుఁ బంపి
యున్నాఁడు. మనదారిని మొగలుసేనలు నిరోధించుచున్నవి. వారిసైన్యములు
దాటిపోవుటకు మనము పోవీ లుండదు. మన మిప్పుడు విరోధులబారిఁబడిన
నపాయము సంభవింపకమానదు. కాన రాణి మొదలగువారి నిచటి కొఱు
మైళ్లదూరములోనుండు నొక్కనిగూఢప్రదేశంబునకుఁ దోడ్కొనిపోయెద
ఆప్రదేశమున రాతిచేఁ జెక్కఁబడిన యాలయ మొకటి కలదు. అయ్యది
దట్టములగు మూఁడ్లపొదలతోడను, విశాలవృక్షములతోడను నెగుడుదిగుడు
త్రోవలతోడను గూడి దుర్గమమై యున్నదని నుడివెను.

ఇంతలో భీమసింహజయసింహులు దమసైన్యమును గొని మొగలుల
కుత్తరదిశనుండి, వచ్చుచున్నారని విని వారిఁగలిసికొనుటకై దుర్గాదాసు

బయలుదేరెను. ప్రేమాబాయి, రాణి మొదలగువారి నెల్ల వెంటఁబెట్టుకొని రహస్యాలయమార్గంబున జనుచుండెను. కాని వారి కొకయాపత్కస్మాత్తుగ సంభవించెను. రాణి మొదలగువారిని ప్రేమాబాయి నుడివిన ప్రదేశమునకు సురక్షితముగఁ గొనిపోవుటకై నియమింపఁబడినదళములో నొకరాజపుత్ర ప్రభు వుండెను. అతఁ డెవ్వరన్న మన కిదివఱకె పరిచితుఁడైన ఠాకూరు గోకులదాసు మహాశయుఁడే. అంబాలికను జూచిననాఁటినుండియు నాతని హృదయ మామెగుఱించి పొందియుండే లగ్న మయ్యెను. ఆమె మోహనాకారమును, నవయౌవనమును జూచినప్పటినుండియు నాతఁడు మదనుని కోలలకు గుఱియయ్యెనన్న నతిశయోక్తి కాదు. అంబాలికాదివ్యమంగళవిగ్రహ మెల్లవేళల నాతనినేత్రవీథిఁ బొడగట్టుచుండెను. నేఁడు మరల నాసుందరాంగి సందర్శనభాగ్యం బబ్బినందుల కాతఁడు దన్నెంతయు ధన్యాత్ముఁడుగఁ దలంచుకొనెను. ఏదో యొకమిషపై నాతఁ డామె నిదివఱ కొకటిరెండు మాఱులు పలుకరించియుండెను గాని, యాకీరవాణి యాతనితో మాటాడలేదు. తుద కాతనిఁ గన్నెత్తిచూచుటకైన నామె యిచ్చగింపలేదు. సహజలజ్జావతియగుటచేఁ దన్ను బలుకరింపలేదనియు, నిశ్చయముగ నామె తన్ను ప్రేమించెననియు, గోకులదాసు తలంచియుండెను.

ఇప్పుడుగూడ, "నాహా! యీమోహనాంగియగు నంబాలిక నా కర్ధాంగియగు టెన్నఁడు? ఈమెను నేనెట్లు పొందఁగలను? ఈమె మహారాణి యధీనమున నున్నదిగదా? ఈకోమలాంగిని నాకిమ్మని మహారాణి నడుగుదునా? ఛీ-ఛీ-ఇదివఱకొకసారి యడిగినది చాలును. ఆమె మాటలను దలంచుకొన్న కొలఁది మితిలేనికోపము జనించుచున్నది. ఔరా! కొమరుదేవి కెంతగర్వము? బికనీర్ ప్రభువగు ఠాకూరుగోకులదాసామె కింతనీచుఁడుగఁ దోఁచెనా? మధుపానమత్తుఁడ నగుటచే నాకన్యకారత్నంబునకుఁ దగినవరుఁడను గానని యామె నన్ను నిరసించెనుగా? మానవంతుఁ డవమానమును సహింపఁజాలఁడు. ఎటులైన నీపెపైఁ బగసాధింపవలయును. ఏరీతినైన నంబాలికను బరిణయ

చూడవలయును.—మహారాణి గర్వభంజనమున కిదియే మంచిసమయము.'' అని యాతఁడు మనంబునఁ దలంచుచు నెవ్వరికిని దెలియకుండ నక్బరుషాహు చెంతకుఁ బోవ నతఁ డట లేకుండెను. తుద కాతఁడు ఫార్వరుఖాను సేనను సమీపించెను. అతనిఁగాంచిన వెంటనే మొగలుసైనికులు సంశయాకులచిత్తులై యాతనిఁగట్టి ఫార్వరుఖానుసమీపమునకుఁ గొంపోయిరి. ఫార్వరుఖానును గాంచి గోకులదా సిట్లనియెను. ''ఫార్వరుఖానుమహాశయా! యిది మీకు మంచిసమయము. చక్రవర్తిగా రెవ్వరికై యనేకప్రయత్నములఁ జేసి విఫలమనోరథులైరో యట్టివారు నేఁడు మీకుఁ గడుసులభంబుగఁ జిక్కెదరు.''

ఫార్వరుఖాను:—ఏమేమి? నీవుచెప్పునది నాకేమియుం బోధపడుట లేదు. కాని నీ వెవ్వఁడవో తెల్పుము.

గోకులదాసు:—నేను బికనీర్ ప్రభువగు గోకులదాసును.

ఫార్వరుఖాన్:—మంచిది. నీవు చెప్పఁదలఁచిన దేదియో సవిస్తరముగఁ దెల్పుము.

గోకులదాసు:—అప్పుడే మఱచితిరా? జోధ్పురమహారాణియు నామె చిన్నరాకొమరుఁడును నేఁడు సులభముగ మీకుఁ జిక్కఁగలరు.

ఫార్వరుఖాన్:—గోకులదాసూ! మమ్ము మోసగించుట కిట్టిపన్నుగడఁ బన్నితివా యేమి? ఎట్టివెంగలియైనఁ దనగుట్టుఁ దానె బయటఁ బెట్టుకొనునా! నీమాటలు నేనమ్మఁజాల.

గోకులదాసు:—అయ్యా! యసత్యము లాడిన నాకేమివచ్చును? నిశ్చయమునే చెప్పుచున్నాను వినుఁడు. మహారాణికొమారుఁడు, చక్రవర్తిగారియధీనమున నుండిన గొప్పవాఁడు కాఁగలఁడని నానమ్మకము. చక్రవర్తి కడు నుదారుఁడు. మా రాజపుత్రు లాతనియందుఁ గారణము లేనియసూయగలవారై లేనిపోనివైరములు గలుగఁజేసికొనిరి. చక్రవర్తితోడియుద్ధము

నాకెంతమాత్రమునిష్టము లేదు. మనోవాక్కాయకర్మముల నిజముగనే పలుకుచున్నాను. ఒకవేళ నామాట యబద్ధమైన మీరేమిశిక్ష విధించినను లోఁబడువాఁడను.

ఫార్వరుఖాన్:—అయిన మహారాణిగారిప్పు డెచ్చట నున్నారు?

గోకులదాసు:—అయ్యా! నేను గార్యాంతరంబున నొకచోటికి వెడలి యుంటిని, తిరిగి వచ్చునపుడు సమీపమునఁ గొన్ని శిబికలం గాంచి, యవి జోధ్పురమహారాణి వని విని యావిషయముఁ దమతోఁ జెప్పుట కిచ్చోటికివచ్చితిని. మహారాణితో నామె చిన్నికొమరుఁడుకూడ నున్నాడు.

ఫార్వరుఖాన్:—వా రిచ్చటి కెంతదూరములో నున్నారు?

గోకులదాసు:—దాదాపాఱుమైళ్లలో నున్నారు. రెండుగంటలలో మీరు వారినిఁ జేరవచ్చును.

ఫార్వరుఖాన్:—ఇంకను నీవేని రహస్యము లున్నఁ దెలుపుము. చక్రవర్తి గారిచే మీకు మంచి బహుమానము లిప్పించెదను.

గోకులదాసు:—ఖాన్ సాహెబ్! నా కితరవిషయము లెవ్వియును దెలియవు. నే నిప్పుడే వచ్చుచుంటిని. పైవిషయమును గూడ నే నకస్మాత్తుగఁ గను గొంటిని. నాకు మీరు బహుమానము లీయనక్కఱలేదు. చక్రవర్తి గారియభిమానముండినఁ జాలును.

గోకులదాసు, రాణియందుమాత్రమే పగను సాధింపఁదలఁచెను. రాజపుత్రులరహస్యముల నిసుమంతయేనిఁ దెలియఁజేయఁగూడదని యతని యుద్దేశ్యము. ఫార్వరుఖా నెన్నివిధములఁ బ్రశ్నించినను వానినెల్ల నాతఁడు దనకుఁ దెలియదనియే చెప్పుచుండెను.

వెంటనే ఫార్వరుఖాను నాల్గువందలసైనికులను, గొన్నితుపాకులను గొని, గోకులదాసచూపుమార్గంబు ననుసరించి వెడలెను. మార్గము మిట్టపల్లములుగ నుండుటచేతను గంటకతరులతావృతంబగుటచేతను గర్కశపాషాణయుతంబగుటచేతను, వారిప్రయాణము గడు నాలస్యముగఁ జరుగుచుండెను.

తమ కిట్టికష్టాత్తుగ నాపత్తు రానున్నదని రాణిగాని తదితరులెవ్వరుగాని
దలంపలేదు. రాణి విడిసియుండినప్రదేశమున కొకటిరెండుమైళ్లదూరములోఁ
ప్రేమాబాయి కుసుమంబులగ్రహించుటకై యటునిటు సంచరించుచుండెను.
అప్పు డిరువురుభిల్లు లామెకడకుఁ బరుగిడివచ్చి "దేవీ! తురకసేనలు మన
పైసకువచ్చుచున్న" వని తెల్పిరి. తత్క్షణమే ప్రేమాబాయి యొకయున్నత
శిలాగ్రం బెక్కిచూచెను. దూరముగ మొగలుసేన లామెకుఁ గనఁబడెను.
వెంటనే పరిసరప్రదేశమునంగలబోయ విలుకాండ్రఁ బ్రోగుచేసికొని యుద్ధము
నకు సన్నద్ధులైయుండవలయు ననియు, నాజ్ఞయైనతోడనే మొగలుల సంహ
రింపవలయుననియుఁ నాభిల్లులకుఁ జెప్పి యావీరవనిత రాణి కీవర్తమాన మెఱిం
గింప శీఘ్రంబున వెడలెను. ఈవిషయమును విని యెల్ల రాశ్చర్యభయంబుల
మునింగిరి. రాజపుత్రవీరు లాపలుకుల విని వీరాలాపంబు లాడుచు, నొకరి
నొకరు ప్రోత్సహించుకొనుచుండిరి. ఇటులుండ భీమసింగు జయసింగు లక్కడికి
సమీపప్రదేశంబుల నున్నారని తెలియవచ్చెను.

అప్పు డంబాలిక మహారాణియగుమతిపై భీమసింహుని కొకకాంచన
కంకణంబుఁబంపఁ దలంచెను. త్వరగా నాకంకణంబును భీమసింగున కొసంగి
యాతనిని సహాయార్థము గొనివచ్చువా రెవ్వరు! ఆయ్యరణ్యమార్గంబుల నెఱిం
గినవా రెవ్వరు? అక్కార్యము సేయువా రెవ్వరు ప్రేమాబాయితప్పఁ దక్కినవా
రెవ్వరును సమర్థులుకారని యందఱు నెఱుంగుదురు. అంబాలిక, యామె
నెట్టికార్యముఁ జేయుమని యడుగఁగలదు? ఆలసించినఁ బ్రమాదము వాటి
ల్లును. అంబాలిక కేమిచేయుటకును దోఁచలేదు. తుద కామె ప్రేమా
బాయిని సమీపించి "అక్కా! ప్రస్తుతము నీవే సుమా మమ్ము రక్షింపఁగల
దానవు. నీ వీకంకణంబుఁగొనిపోయి యార్యపుత్రున కొసంగి యిచ్చటి
వృత్తాంతం బెఱింగించి శీఘ్రంబుగ నాతనిఁ గొనిరమ్ము. నిన్నిట్టికార్యమునకు
నియోగించుటకు నాకే సిగ్గగుచున్నది. కాని వేఱుశరణ్యము గాన్పింపదు.
నన్నుమన్నించి రక్షింపుము. ప్రాణంబుల నిలుపఁబెట్టుము. నీ వే లెన్నటికిని

మఱచుదానను గాను." అని యతిదీనముగఁ బల్కెను. ఆ మాటల నాలకించి ప్రేమాబాయి యందుల కియ్యకొని, కంకణముఁ గైకొని (భీమసింగును సమీపించుటకు) వెడలెను.

అప్పు డామె హృదయమునఁ గలిగినభావము లెన్నియని వర్ణింపఁ నగును? తా నెవ్వని గాఢముగఁ బ్రేమించి తనజీవిత మెవ్వని సేవార్చనలకై ధారవోయఁ దలంచెనో? ఆపురుషపుంగవుని మఱొక్క చంచలాక్షి ప్రేమించి, యాతనికిఁ దన ప్రేమచిహ్నముగఁ గంకణముఁ బంపుచుండెను. ఆకార్యము దానే చేయవలసియుండెను. దిక్పాలవర్యులచే నియమింపఁబడి వారియాదేశంబులఁ దెలియఁజేయ దమయంతి యంతిపురంబునకుఁ బోవు నైషధున కెట్టి భావనాపరంపర ఉదయించెనో? అవన్నియుఁ బ్రేమాబాయి మనస్సు నాక్రమించెను. ఆమె మానసాకాశమున నాలోచనామేఘము లావరించి జ్ఞానచంద్రుని మాయము చేయసాగెను. తుద కావీరబాలారత్నము మనంబునం దిట్లు తలపోయఁ జొచ్చెను. "ఈయంబాలిక నాప్రియునిఁ బ్రేమించినందుల కీమెయెడ నాకెందు కసూయ జనింపవలయును? సువాసనాభాసురసుమగత సుధాస్వాదనమున కనేకమత్తమధుకరంబు లాశ్రయించుట లేదా? యటులనే లావణ్యమూర్తియు, గుణఖనియు, శూరశిఖామణియు, సర్వసుందరీనయనాబ్జమిత్రుండును, నగు ప్రియుని నామె వరించుటయందుఁ దప్పేమున్నది? యాపురుషవర్యుఁ బ్రేమించుటకు నాకెంతహక్కు గలదో యామెకుఁగూడ నంతహక్కు గలదుగదా? యసూయ సర్వానర్థములకు మూలము. అసూయారహితులు నిత్యసంతోషులై సుఖింతురు. ఎటులైనఁ గానిమ్ము. నా కాతఁడే ప్రాణప్రియుండు. అతఁడు నన్ను నిరాకరించినను, నే నాతని పవిత్రనామమునే జపించుచు నింద్రియనిగ్రహముతో నుండెద. మనమా! సత్పథంబును విడనాడకుము. దుర్గాదేవీ! నన్ను రక్షించుదానవు నీవేసుమా!"

ఇట్లాసుగుణవతి మనమునఁ దలంచుచు నావనమార్గంబు వెంబడి నడచుచుండెను. పాప మావనమార్గముల సంచరించుటచేతను, హృదయమునం దొక

విధముగ కళవళము జనించుటచేతను, నామె కడు బడలియుండెను. భీమసింగు జాడయే యామెకుఁ గనఁబడలేదు. భీమసింగు తటస్థపడెనిపక్షమునఁ దనితరుల నెవ్వరైన సహాయార్థము గొనివచ్చుట కామె నిశ్చయించుకొనెను. రాణి మొదలగువారిస్థితి యేమైనదో? యని తహతహపడుచుండెను. కాని యామె యంతకంటె నేమిచేయఁగలదు.

కొంతసేపటికి కామె 'సాదారీ'కనుమను సమీపించెను. రవంత ధైర్యము గలిగెను. రాజపుత్ర నాయకు లాకనుమలఁ బరికీలించుచుఁ దమసైన్యముల నే ప్రదేశములం దెట్లునిలుపవలయునో? చర్చించుచుండిరి. ఇంతలో భీమసింగు గూడ నకస్మాత్తుగ నచ్చోటికి వచ్చెను. భీమసింగునుఁ గాంచి ప్రేమాబాయి యమితానందము నొందెను. తత్క్షణము యంబాలికపంపిన కంకణ మాతని కొసఁగి సమస్తముఁదెలియఁబల్కెను. అతఁ డానందమున నాపాదితోషిక మందుకొని కరంబున ధరించెను. వెంటనే యాతఁడు తనపరివారమును జాగ్రత్తగ నుండుఁడని యాజ్ఞాపించి తక్కిన రాజపుత్ర ప్రభువుల కీవర్తమానము దెలిపి కనస్థానమునవారిలో నెవ్వరైన నుండునట్లు నియోగించి కొంతసైన్యమును గొని ప్రేమాబాయితో నంబాలికాదులుండు నాలయముచెంతకుఁ జనుచుండెను.

ఇంతలో థార్‌పరుఖాసా రహస్యప్రదేశమును సమీపించుచుండెను. ముఖద్వారంబున బోయవిలుకాండ్రు బారులుదీరి నిలిచియుండిరి. రాణి మొదలగువారెల్ల రాసైన్యమునుగాంచిరి. వారికి ముందుభాగమున గోతుల దానుమార్గంబుఁ జూపుచువచ్చుచుండెను. అతనిఁజూడగనే వారెల్ల రొక్కమాటాశ్చర్యమున మునింగిరి. అయ్యది గోతులదానుకృత్యమే' యని విశదమయ్యెను. రాజభక్తితత్పరుఁడగు నారాజపుత్రప్రభు పట్టి నీచకార్యమున కొడఁబడుట కేమికారణమైయుండునని చింతింపసాగిరి. కారణము వారి కెవ్వరికిని గోచరింప దయ్యెను. రాణిగూడ నూహింపఁజాలదయ్యెను. మొగ

లులు దమగుఱికిఁ దగినంతసమీపమునకు రాఁగనే భిల్లులు వారిపై శరపరం పరలఁ గురిపించిరి. మొగలు లానిశితపటిశఖఘాతంబులచేఁ గడునొచ్చియుం సమితకోపంబునఁ దమతుపాకులఁ బ్రేల్చఁజొచ్చిరి. పాప మాప్రేటులకుఁ బలువురుభిల్లులు మరణించిరి. శక్తిగలవారు నిలువఁజాలక పరుగిడిరి. మొగలులు నిరాఘాటంబుగ ముందునకు నడువసాగిరి.

అప్పుడు మహారాణిగారు దనలో "భీమసింగు కడపటికాఁడాయెను. శత్రుసైన్యము సమీపించుచున్నది. మన కపజయము తప్పక కలుగును. భీమసింగువచ్చువఱకైన వీరి నాపవలయును." అని యోచించి తనయంగరక్షకదళాధ్యక్షునిఁ బిలిచి నీవు శీఘ్రమున వెడలి ఖాన్ వరుఖానుతో నామాటగ చెప్పుము. "అయ్యా! నాకాఱకై యనేకులు మృతిఁబొందుట నాకిసుమంతయేని యిష్టములేదు. నేనే స్వయముగ మొగలుల యధీనమగుట కిచ్ఛగించుచున్నాను. వీరాగ్రేసరుండని పేరెన్నికగన్న జస్వంతసింహునిపత్నినయ్యు విధివశంబున మీయధీనఁగాఁబోవుచున్న నన్ను దయతోఁ జూడవలయునని కోరెద." తర్వాత విషయమాలోచనీయము.

రాణి యాజ్ఞమేర కాతఁడు ఖాన్ వరుఖానును సమీపించి రాణిపంపిన సందేశమును దెలిపెను. ఎట్టికష్టములు లేక రాణి తనయధీనమగుచుండ వలదనునా? ఖాన్ వరుఖానందులకు సంతసించి యాలసింపకరండని వర్తమాన మంపెను. రాజపుత్రవీరుఁ డాసమాచారమును శీఘ్రమునవచ్చి రాణిగారి కెఱింగించెను. రాణిగారాజ్ఞ మేరకుఁ బ్రతిశిబికయందును నల్వురు రాజపుత్రులు కవచాయుధాదికంబుల ధరియించి కూర్చుండిరి. తదితరవీరులు పైకి బోయవేషముల ధరించి శిబికలమోయఁదొడఁగిరి. మహారాణి యాబాలికను దనసైన్యాధ్యక్షున కొప్పగించి, యామె నొకసురక్షితస్థలమునకుఁ గొనిపోవ నాజ్ఞాపించి తాను గడపటి పల్లకియందుఁ గూర్చుండి, మెల్లన మొగలుసైన్యమున్నడు దెసకుఁ బ్రయాణమయ్యెను.

ఆసమయమునకుఁ బ్రేమాబాయి భీమసింగు లాప్రదేశమును సమీపించిరి. శిబికలు మొగలుసైన్యము వెనుకఁ బోవుచుండుటను భీమసింగు గాంచెను. తత్క్షణమే యతనిగుండెలు గొట్టుకొనసాగెను. శరీరము కంపమొందెను. తుదకాతఁడొక వేఁడినిట్టూర్పుఁబుచ్చి "కన్యకామణీ! సర్వము మించిపోయినది. రాజకాంతలు మొగలులయధీనమైరి. ఇంకేమున్నది? ఘట్టిమునిఁగినది. ఆలసింపఁగూడదు. పల్లకులు శత్రుదళమును జేరకమున్నే వారిని రక్షింపవలయు" నని తెల్పి తనసైనికులకు మొగలుసైనికులపైఁ బడుట కనుజ్ఞ నీయఁ బోవుచుండెను. ఇంతలోఁ బ్రేమాబాయి యాతని నాపి "రాణామామా! అత్రముఁ జెందకుము. చూచితివా? బోయలు మామూలుగ నుండువారుకారు. ఇందేదియో రహస్యముండును. వారు మొగలుదళమును జేరువఱకు నిదానించుఁడు. ఆలోపల మనమును శత్రుదళమును సమీపించి కాలమునకు వేచియుందము. రాణిగారేదియో పన్నాగము పన్నియుండునట్లు దోఁచుచున్న" దని నుడువ భీమసింగందులకు వల్లెయని నిజసైన్యమును గొని మొగలుదళమును సమీపించెను.

కొంతసేపటిలో నాశిబికలు మొగలుదళమును జేరెను. ఖాన్ జమఖాను మహారాణిగారిని సగౌరవంబున నాహ్వానించుటకై శిబికనుసమీపించి "మహారాణీ! మిమ్మింత కష్టపెట్టినందులకు క్షమాపణ......" యని విన్నవిమతోఁ దటాలున వెనుకకుఁబోయి యొఱనుండి ఖడ్గంబుఁ జేతికి నిచ్చెను. రాజపుత్రులంద ఱాప్రదేశమును సమీపింపఁగనే పల్లకులనుండి బయటికి దుమికి తీవ్రముగఁ బోరఁదొడఁగిరి. అప్పుడు మొగలులొందిన యాశ్చర్య మింతింతకాదు. రాణీశిబికమాత్రము దూరంబున నుండెను. కొంతసేపటిలో మొగలులు రాజపుత్రులను జుట్టుముట్టిరి. రాజపుత్రులు విజృంభించి పోరుచుండిరిగాని, తమసంఖ్యతక్కువగుటచేతను, మొగలులసంఖ్య యెక్కువగుటచేతను నొకరొకరే నేలఁగూలసాగిరి. ఇంతలో భీమసింగు తనసైనికులతో సింహనాద

ములఁజేయుచు మొగలులపైఁబడెను. సంగరము భయంకరమయ్యెను. కరవాల
ముల ఝుళిపింపులు, రాజపుత్రులసింహనాదములు, మొగలుల యట్టహాసములు,
తెగిపడువారి యార్తనాదములు రోదసీకుహరమెల్ల నిండిపోయెను. తలలు
బంతులవలె నెగిరిపోవుచుండెను. నెత్తురు కాల్వగాఁ బ్రవహింపఁజొచ్చెను.
ఇరువంకల ననేకులు మరణించిరి. మఱికొందఱు క్షతగాత్రులైరి. భీమసింగు
గూడఁ దీవ్రములగు గాయముల బాధ ననుభవింపవలసివచ్చెను.

ఖార్‌వరుఖానున కిట్టిలేనిపోనిపోరులు పెట్టుకొని జయముఁ గోల్పోవుట
కిష్టములేదు. అతనిసైనికులలోఁ జాలమంది నశించిరి. అక్బరుసైన్యము
చాలదూర మేఁగియుండెను. కాన, నాతఁ డంతటితోఁ బోరు చాలించి గోసల
దాసును బంధించి వెంటఁ బిలిచికొని తనసైన్యమును జేరఁ బోయెను. మొగలు
సైన్యము కనుమఱుఁగు కాఁగానే మహారాణి తనపల్లకినుండి దిగి భీమసింగున్న
స్థలమును జేరఁబోయెను. భీమసింగునకుఁ దొడయం దొక పెద్దగాయము తగిలి
రక్తము ప్రవహించుచుండెను. సైనికుఁ డొకఁ డాతని గాయమునుఁ గడిగి
కట్టుగట్టుచుండెను. వెంటనే భీమసింగు నొకపల్లకియందుఁ గూర్చుండఁ జేసి,
రహస్యాలయమునకు రాణి మొదలుగ నెల్లరు నరిగిరి. అతనికి బాగగువఱకు
వారెల్ల రందే యుండిరి. ప్రేమబాయియు నంబాలికయుఁ గడుజాగరూకలై
యాతని కుపచారములు చేయుచుండిరి. వారి యుపచారములవలన భీమసింగు
క్రమక్రమముగ స్వస్థస్థితి నందుచుండెను.



# ఇరువదియొకటవ ప్రకరణము

## మిత్రులు

అంబాలికా ప్రేమాబాయిల యుపచారముల భీమసింగు గాయము లన్నియు మానిపోయెను. కాని సంపూర్ణశక్తివంతుఁడింకను గాలేదు. అతని మనస్సంతయు యుద్ధరంగమునందే యుండెను. రెండుదినములతర్వాత నాతఁడు వస్త్రాయుధం బనెడి యనుఁగుగుఱ్ఱంబు నెక్కి రాజకాంతల యనుమతిఁగొని యాహవరంగమునకు వెడలెను. ప్రేమాబాయి, అంబాలిక లాతనికి సంతసంబున వీడ్కోలొసంగిరి.

ఇంతలో నక్బరు ఫార్వరుఃఖానులసైన్యములు చాలవఱకుఁ బ్రయాణముఁ జేసియుండెను. ఆమొగలుసైన్యము సాదారికనుమలోయ ననుసరించి పోవలసియుండెను. రాజపుత్రులజాడ యేసుమంతయేని వారికిఁ దెలియలేదు. మొగలు లుత్సాహంబున నిర్భయులై యాకనుమనుఁ బ్రవేశించిరి. వారి కెట్టి యాటంకమును గన్పట్టలేదు. వా రాకనుమ కడపటిభాగమును జేరునప్పటికి మార్గము నిరోధింపఁబడియుండెను. గొప్పగొప్పవృక్షములతోడను, గండశిలలతోడను, నాదారి మూయఁబడియుండెను. ఇరుపార్శ్వముల నెత్తైనపర్వతము లుండెను. ఎటుఁబోవుటకును వీలులేదు. కాన వారు మరల వచ్చిన త్రోవను బట్టి వెనుకకు రావలసివచ్చెను. వారు వెనుదిరిగి లోయ మొదటిచోటుఁ జేరువేళకు రాజపుత్రు లాప్రదేశము నాక్రమించి యుద్ధమునకు సన్నద్ధులై యుండిరి. లోయ కొంచె మిఱుకుగ నుండుటచే మొగలు లనేకు లేకకాలంబునఁ బోరుటకు వీలులేకుండెను. ఫార్వరుఃఖాను తనసైనికులఁ బ్రోత్సహించి రాజపుత్రుల భేదింపఁజూచెను గాని, వా రాతని యూహకు లోఁబడు నట్లు లేదు. దారియందిన మఱికొందఱు రాజపుత్రులు చెలరేఁగి పెద్దపెద్దరాళ్ల

నామొగలుదళముపై వేయసాగిరి. ఆటవికులగు బోయలు మొగలులయసువుల
బాపుచుండిరి. మొగలు లిటునటుఁ గదలుటకుఁగూడ వీలులేవయ్యెను. 'ఇటుఁ
జూచిన నూయి, యటుఁజూచిన గోయి' యనువిషమావస్థయం దుండిరి. వా
రదితెలిసికొని సంధికంటెఁ దగినయుపాయం బొండులేదని తలంచిరి. అమ్మ
హమ్మదీయసేనాను లిరువురుఁ గొంతసేపు యోజించి, తుదకు రాజపుత్రులతో
సంధిఁజేసికొనుట కిష్టపడి, తత్క్షణమే యొకరాయబారిని జయసింగు నొద్దకుఁ
బంపిరి.

ఆరాయబారి జయసింగును సమీపించి "రాకొమారా! సుల్తా నక్బరు
నాతోఁజెప్పిపంపిన వృత్తాంతంబుఁ జెప్పెద. సావధానముగ వినుఁడు. 'నేను
హైందవుఁడను గాకపోయినను, రాజపుత్రవనిత కుద్భవించుటంజేసి కించిత్సం
బంధము నందినవాఁడను. రాజపుత్రులతో సఖ్యంబు గోరువాఁడనేగాని లేని
పోనికలహములఁ దెచ్చిపెట్టుకొన నిచ్ఛగించువాఁడను గాను. హిందూమహమ్మ
దీయుల కన్యోన్యమైత్రి కలిగినగాని దేశమునకును, నిరుతెగలవారికిని శాంతి
చేకూరదని నే నెఱుంగుదును. ఐనను దండ్రియాజ్ఞ జవదాటఁజాలక నిరర్థక
ములును, నిర్హేతుకములును నగు నీయుద్ధంబులఁ బాల్గొనవలసివచ్చెను. మీతో
సంధికుదిరినవెంటనే నే నెటులైనఁ రాజపుత్రులతోడికలహం బనర్థకరం
బనియు, వారితోడిసఖ్యం బెశ్రేయోదాయకం బనియుఁ, జక్రవర్తిగారికిఁ దెల్పి
యుద్ధంబుల నాపివేయునట్లొనర్చెద. నిశ్చయము నుబల్కుచుంటిని. నావచ
నములనమ్మి సఖ్యంబుఁ గావింపుఁడు.' అని తన నిజాభిప్రాయముఁ జెప్పిపంపినాఁ
డని నుడివెను.

జయసింగున కక్బరు పలుకులం దాతనమ్మకము జనింపలేదు. సంధి
కొడంబడుట కతఁ డొక్కింత యనుమానించుచుండెను. ఆసమయమున భీమ
సింగు తనయన్నను గలసికొని, ఢిల్లీపురంబునం దున్నప్పు డక్బరు గుణాగుణం
బులఁ జక్కఁగ నెఱింగియుండెనుగనుక, యాతనితో "అన్నా! అక్బరు సత్య
సంధుఁడు, పరసుఁడు. నేను ఢిల్లీపురంబున నున్నసమయంబున నాకెంతయుం

నీకఁడు మహోపకారం బొనరించెను. ఆతనిగుఱించి మీరేమియును సంశయ
నింపవలదు. సంధి కీకొనుటయే మంచి దని." నుడివెను. తమ్మునివాక్యం
ములు విని జయసింగు సంధి కొప్పుకొనెను. తత్క్షణమే యంగీకారమును దెలు
పుచు నొకలేఖ వ్రాయఁబడెను. జయసింగుడాని భీమసింగుచేతనే యక్బరు
నకుఁ బంపెను. భీమసింగును, సంతసంబునఁ దనపూర్వస్నేహితునిఁ జూడ వెడ
లెను.

భీమసింగును గాంచఁగనే యక్బరు సంతసించి యాతని సగౌరవంబుగ
నాహ్వానించెను. తదనంతరము సంధినియమములఁగూర్చి యక్బరు ఫాన్‌వరు
ఖాను భీమసింహులు చర్చించిరి. తుదకు వారంద ఱందు కొప్పుకొనిరి.
నియమప్రకారము, కొన్నిఫిరంగులును, మందుసామగ్రియును, నొంటెలును,
రెండేనుఁగులును నప్పఁ దక్కిన గజములును, రాజపుత్రులయధీనము గావలసి
వచ్చెను. ఇదిగాక రాజద్రోహియగు ఖానూనుగోపలదాసు జయసింగువశ
మయ్యెను. తత్క్షణమే సంధికుదిరినవిషయము చాటింపఁబడియెను.

మొగలుసైన్యముపు జిల్వారాకను మమార్గమున మార్వారును జేర్చుటకు
జయసింహుఁడు కొందఱ నియోగించెను. జిల్వారాకనుమదాటువఱకు భీమ
సింగుగూడ నక్బరుతోడకమేర కాతని వెన్నంటిపోయెను. పూర్వపుస్నేహితు
లిరువురును వివిధవిషయములఁగూర్చి క్రిందివిధముగ ముచ్చటించుచుఁ
బ్రయాణము చేయుచుండిరి.

అక్బరు:—మిత్రమా! నీప్రజ్ఞావిశేషము లసాధారణములు. ఢిల్లీపురరాజ
సౌధంబునుండి యెంతసూక్ష్మముగఁ దప్పించుకొంటివి? అఘటనఘటనా
సమర్థుండగు చక్రవర్తి నొక్కత్రుటిలో నేమఱించితివి. నీవింతటి
వాఁడవని యాతఁ డొక్కనాఁడైనఁ దలంచియుండలేదు.

భీమసింగు:—(చిఱునవ్వుతో) మహాశయా! యదియంతయును వినాయకు
గ్రహమే కదా? మీకు నాయందు మెండుగ నుండియును జక్రవర్తిగారి
నే నమాయకుఁడనని తెల్పియుంటిరి. అందులకే నెంతయును గృతజ్ఞుఁడనుకి

అక్బరు:—మిత్రమా! నీతోఁగూడ నబ్దుల్ ఖరీము పాఱిపోయెనని తెలిసెను. నిజమేనా? వాఁ డిప్పు డెచ్చట నున్నాఁడు? చక్రవర్తికంటఁబడెనా? వానిప్రాణములు దక్కవు.

భీమసింగు:—(చిఱునవ్వుతో) వాఁడు చక్రవర్తిగారి కిఁక సులభసాధ్యుఁడుం గాఁడు. నావిమోచనమునకు వాఁ డెంతయు సాయ మొనరించెను. వానికే లోపమును లేక జీవితాంతమువఱకును హాయిగసుఖించుటకుఁ గావలసినంత ద్రవ్య మొసఁగి చక్రవర్తిగారిబారిఁబడకుండునట్లు విదేశమునకుఁ బంపితిని.

అక్బరు:— సెబాస్! మంచిపనిఁ జేసితివి.

భీమసింగు:—నేను పాఱిపోవు టెఱిఁగి చక్రవర్తిగారు కడుఁజింతించి యుందురని తలంచెద. నన్నాతఁ డెంతయు బహూకరించి పంపఁదలఁచి యుండును.

అక్బరు:—(నవ్వుచు) అవునవును. చక్కఁగా బహూకరించి పంపఁ దలఁచి యుండెను. మరల నొక్కతూరివచ్చెదరా?

భీమసింగు:—చక్రవర్తిగారికి లేనిప్రయాస మేల తెచ్చిపెట్టవలయును? మహాశయా? మీరు నాకొసఁగిన జాగిలముల నచ్చటనే విడిచిరావలసి వచ్చెను. ఆజంతువు లిప్పుడు సురక్షితముగనున్నవా?

అక్బరు:—క్షేమముగనే యున్నవి. చక్రవర్తితో మీకు సంధికుదిరిన నేను వానినిఁ బంపెదను లెమ్ము.

భీమసింగు:—మంచిది.

అక్బరు:—మిత్రమా! నిన్నొక్కవిషయ మడుగ మఱచితిని. ఆనాఁటిపూర్ణిమారాత్రి శ్రీకృష్ణవిగ్రహంబును నాచేతులనుండి లాగికొనిపోయిన దెవరు? నీవేనా?

భీమసింగు:—(చిఱునవ్వుతో) నేను మీచేతులనుండి కృష్ణవిగ్రహమును లాగికొనిపోయితి ననుటకన్న శ్రీకృష్ణుఁడే నన్ను మీచేతులనుండి లాగికొని పోయెననుట సమంజసముగ నుండును.

అక్బరు:—నిశ్చయముఁ బల్కితివి. నాఁడు శ్రీకృష్ణుఁడే నిన్ను రక్షించెను. భీమసింగ్! నీ తెలివితేట లద్భుతములు. నీయుద్ధప్రావీణ్యమునకుఁ జాలసంతసించితిని.

భీమసింగు:—అక్బరుమహాశయా! మీపొగడికోలున కే నెంతయు సంతసించుచున్నాను. కాని మీ యీపొగడ్తకు ముఖ్యుఁడ నేనుగాను. శ్రీకృష్ణవిగ్రహమును రక్షించినకీర్తిప్రతిష్ఠలు చాలభాగ మొకవ్యక్తికిఁ జేరవలసియున్నవి.

అక్బరు:—భీమసింగ్! అవ్యక్తి యెవరు?

భీమసింగు:—ఒకభక్తురాలు.

అక్బరు:—ఆ:! ఆఁ! యేమేమి? భక్తురాలా? చాల నాశ్చర్యముగ నున్నది. ఒక్కస్త్రీ యంతటిసాహసకార్యమునుఁ జేయఁగలిగెనా? ఆమె పేరేదియో? యెఱుంగుదువా?

భీమసింగు:—మదీయప్రాణదాత్రియగు నకాంత పవిత్రనామమును మఱవఁ గలనా? ఆనాఁ డావీరరమణి నిశితవారాచంబున, నాప్రాణంబు లపహరింపనుండిన మ్లేచ్ఛసైనికుని యసువుల హరింపకున్న నే నీపాటికి యమపురంబునఁ బ్రాతఃస్మృతుఁడనై యుండియుందును.

అక్బరు:—ఆశ్చర్యమాశ్చర్యము! ఇట్టి వీరనారీలలామల కిరవైన రాజపుత్రస్థానమును జయించుట కెవ్వరితరము? అలంగీరు పాదుషాగారికి సాధ్యమా? యని నాకు సందేహము జనించుచున్నది. తుద కీయుద్ధము లన్నియు వృథాప్రయాసహేతువులనియే తలంచుచున్నాను. భీమసింగ్! ఆవీరనారీ పతంస మెవ్వరో తెల్పుము?

భీమసింగు:—మహాశయా! కుంభాల్ మను దుర్గాధ్యక్షుఁడగు ధాకూరునోపీనాథుగారిపుత్రిక. మగబిడ్డలు లేనికతమున నామెయందు పతిప్రేమగలిగి తండ్రి యామెకు సకలవిద్యల నేర్పించెను. విలువిద్యయం దామె కడు నేర్పరి. సర్వాంగ సుందరి.

అక్బరు:—సెబాస్! సెబాస్! ఆవీరనారీలలామంబును బొందఁగల్గినవానిదే జన్మము. మిత్రమా! భీమసింహా! నీవింకను నవివాహితుఁడవేకదా? ఆసుందరీమణి నీర్ధాంగియైన నెంతబాగుండును? నీవెంతయు నదృష్టవంతుఁడవనియే తలంచుచున్నాను. నాయూహ నీకెట్లు తోఁచుచున్నది?

భీమసింగు:—నావివాహమున కిప్పుడేమి లెండు.

ఆసమయమున నంబాలికామూర్తి యొక్కపరి భీమసింగుమానసమున విద్యుల్లతవలె మెఱసెను. ప్రేమాబాయియం దతని కన్నివిధముల నాప్తాపగౌరవాదులు కలవుగాని, యామెను వివాహమాడుటమాత్ర మతనికయిష్టము. అతనిమన మిదివఱకే యంబాలికయందుఁ దగిలియుండుటచే నామెను దప్ప నితరుల నెవ్వరినిఁ బ్రేమింప నాతఁ డిచ్ఛగింపలేదు. కనుకనే యక్బరు తెలిపినవిషయమున కాతఁడు సరియైన ప్రత్యుత్తర మీలేదు.

ఆస్నేహితు లిరువురు మాటాడుకొనుచు, జిల్వారాకనుమను దాటివెడలిరి. అటనుండి యక్బరు ననుమతిఁగొని భీమసింగు వెనుకకు మరలెను. అతఁడప్పు డొంటరియై యేదియో మనంబునందాలోచించుకొనుచు, మెల్లనఁ బ్రయాణముఁ జేయుచుండెను. అతఁ డట్లు కొంతద వ్వరిగినపిమ్మటఁ దటాలున నాతని కొకవిధమగుధ్వని వినవచ్చెను. అతఁడు తత్క్షణమే యట నిలిచి వెనుదిరిగిచూడ, మందహాససుందరవదనారవిందయగు ప్రేమాబాయిమూర్తి యాతనికిఁ గన్పట్టెను. అపుడు భీమసింగు కొంతయాశ్చర్యమున నేమియో నుడువఁబోవ నాలావణ్యగాత్రి కలస్వనంబున నిట్లనియె.

ప్రేమ:—ఆర్యా! యేల నిర్విణ్ణులై యిట్లు నిలిచియుంటిరి?

భీమసింగు:—ఓవీరకాంతారత్నమా! నీసర్వవ్యాపకత్వమునుగాంచి యాశ్చర్యపడుచుంటిని. నీ వాసర్వేశ్వరివలె నెక్కడఁజూచినను గాన్పించుచుంటివి. ఇపు డీయరణ్యభూములఁ నెందుకొఱకు సంచరించుచుంటివి?

ప్రేమా:—(చిఱునవ్వున) ఆర్యపుత్రా! మీరు నాసర్వవ్యాపకత్వమును జూచి యాశ్చర్యము నొందితిరి కాఁబోలు! దుర్గాదేవియనుగ్రహమున, నాకెట్టి యాపదలును రానేరవు. నే నెల్లప్పుడు విరోధులజాడల నరయుచు నివ్వనమార్గంబుల సంచరించుచుందును. అది యటుండనిండు. నాతండ్రి గారు యుద్ధముఁ జేయుట నెన్నఁడైన గాంచి యున్నారా?

భీమసింగు:—లేదు. అతఁడు రణవిద్యాకోవిదుఁ డనిమాత్రము వినియున్నాను.

ప్రేమా:—అటులైన మీ రాతని సమరపాండిత్యం బెఱుంగఁగోరెదరా?

భీమసింగు:—చూడఁ గోరికయున్నది.

ప్రేమా:—నాతోరండు. ఆసమీపశిఖరాగ్రంబునకుఁ బోవుదము. మాతండ్రి దిలిర్ ఖానుసైన్యముల నెట్లు చీకాకుపెట్టుచున్నాఁడో? అచ్చటినుండి బాగుగఁ గాంచవచ్చును.

అని ప్రేమాబాయి రాకొమరునిఁ దోడ్కొని సమీపశిఖరంబును జేరఁ బోయెను.

# ఇరువదిరెండవ ప్రకరణము



## రాజసింహుఁడు.

ఔరంగజేబును నతనికుమారుఁడగు నజామును సమిశసైన్యముతోఁ జిత్తూరుదేబారీ కనుమల మధ్యప్రదేశముల విడిసియుండిరి. కావలసినప్పుడు సైన్యము లజ్మీరునుండివచ్చునట్లు చక్రవర్తి యేర్పాటుచేసియుండెను. ప్రస్తుతము మొగలుసైనికు లించుమించొక లక్షయుండిరి. దేబారీకనుమ మొదలుంగొని యుందయసాగరమువఱకు మొగలుసేన నిలిచియుండెను. అందు నలుబది పెద్దఫిరంగులు మొదటివరుసయందు నిలిపియుండిరి. వానితర్వాతఁ జిన్నఫిరంగులును, వానివెనుక గుఱ్ఱపుదళమును, నావలఁ గాల్బలము నిలుపఁబడియుండెను. ఔరంగజేబు తనసైన్యమును రెండుభాగములుచేసి యందొక్కభాగమును సమయమువచ్చినఁ దటాలున సాయమొనర్చుటకై వెనుకప్రక్కన నిల్పియుండెను. చక్రవర్తి మంచితెలివిగలవాఁడు. యుద్ధమునందు రాజపుత్రుల నుక్కడంపవలయునని యాతఁడు నిశ్చయించెను.

రాజసింహుఁడునుఁ దనబలంబులనెల్లఁ జేర్చి, గూఢచారులవలన విరోధిసైన్యమందలి పరిస్థితులన్నియుం నెఱింగి, తదనుకూలంబుగఁ దనసైన్యంబును దగుస్థలంబుల నిలిపియుండెను. మొగలుసైన్యముకంటె రాజపుత్రులసైన్యము తక్కువైనను బలపరాక్రమముల జేరెన్నికఁగన్న వీరాగ్రణులనేకులుండిరి. తమ కిదివఱకుఁ గలిగిన జయములచే నమ్మకముఁగల్గినవారై నేఁడుత్సాహంబుగ సంగరమొనర్ప, సంకల్పించుకొనిరి. రాణాసైన్యమున కిరుపార్శ్వంబులఁ జాలమంది కన్ఫరజోగులు యుద్ధమునకు సిద్ధముగ నిల్చియుండిరి. భీమసింగు కొంతమంది బోయవిలుకాండ్రను గన్ఫరజోగులను వెంటఁగొని మొగలుసైన్యమునకు దక్షిణభాగంబునంగల నిబిడవనతరులతాదులమాటున దాగి

చేయుచుండెను. మొగలుసైన్యమునకు వామపార్శ్వంబున మోహానసింగును, బెడ్డాబిజోలీనగరాధీశులను ముప్పదివేలసైన్యముతో నుండునట్లు రాణా నియమించెను. దుర్గాదాసు రాణాకుఁ గుడిభుజమై నిలిచియుండెను. థాకూర్ గోపీనాథు మొగలులకు సహాయార్థ మరుగుదెంచు సైన్యములను లోనికిరానీ కుండఁ గనుమల నన్నింటినిఁ గడుజాగ్రత్తతో నరయుచు మార్గముల నిరోధించియుండెను. చక్రవర్తికుమారుఁడగు సుల్తాన్ముజాము దక్కనునుండి సైన్యమునుఁగొని తండ్రికి సహాయ మరుదెంచుచున్నాఁడని విని జయసింగాతని నాపుటకై వెడలెను.

ఇట్లాయుభయపక్షములవారును గడుజాగరూకతతో నుండిరి. మధ్యాహ్నసమయము కావచ్చెను. పోరు ప్రారంభమయ్యెను. ఇంతలో మోహానసింగు మొదలగువా రకస్మాత్తుగఁ దమబలంబులతో మొగలులపైఁబడి కరవాలాద్యాయుధములతో గజతురగపదాతివర్గములఁ జెక్కాడసాగిరి. అదిగాంచి మొగలువీరులు కొందఱు సముద్రేకులై రాజపుత్రుల నుక్కడఁగింపఁ దొడఁగిరి. రానురాను పోరు ఘోరము కాఁజొచ్చెను. అప్పుడు రెండుసైన్యములును గలసిపోవుటచే ఫిరంగులను బ్రేల్చుటకు వీలులేకపోయెను. మొగలుసైన్యము చాల నష్టమయ్యెను. ఒకవంక రాజపుత్రుల సింహనాదములు, మఱియొకవంక మ్లేచ్ఛులయార్భాటములు బ్రహ్మాండభాండమును బగిలించునో యనునట్లుండెను! ఒకరినొకరు నిర్లక్ష్యంబునఁ జూచుచు, బాహాబాహి కచాకచిగాఁ బోరుచున్న వీరవరులును, నిశితకౌక్షేయకంబుల వైరివీరమస్తకంబుల బంతులవలెఁ బైకెగురఁగొట్టు సైన్యాధ్యక్షులును డాలులసాయంబున శత్రుఘాతంబుల నతిలాఘవంబునఁ దప్పించుకొని దర్పంబున హుంకరించుధీరులును, నంగంబులు భిన్నంబులై ప్రాణంబులఁదొఱఁగి నేలకొఱగు భటవారణసైంధవంబులును, దద్గాత్రంబులనుండి ధారగాఁ బాఱుచున్న రుధిరప్రవాహంబులును నందుఁ బొరలాడుమొండెములును, వానిని భక్షింపనాకసంబున నెగురు

చున్న గృధ్రాదివివిధపక్షితండంబులును గలిగి రణరంగం బతిభయంకరంబై కన్పట్టుచుండెను.

దుర్గాదాసు రహాతూరుయోధులఁ బురికొల్పుచు మూర్తీభవించిన శౌర్యంబుచందంబున దురంబు సల్పుచుండెను. రాజసింహుఁడును ప్రళయ కాలరుద్రునిమాడ్కి వైరికులకాననంబున దవానలునిచందంబున కదనరంగంబున విహారంబు సల్పుచుండెను. నాఁడాతనికోపాగ్నికి గుఱియై మొగలుసైనికులను శలభములు ప్రాణములఁ బాయుచుండెను. గాని కొంతవడికి తురుష్కవీరు లాతనిఁ జుట్టుముట్టి బాధింపసాగిరి. రాజపుత్రవీరు లాదుండగము సెఱింగి. చెల్లాచెదఱగునట్లు తురుష్కుల క్రొవ్వడగించిరి. ఔరంగజేబు సేనామధ్యంబున నొక్కదంతావళంబుపైఁ గూర్చుండి నిజసైన్యంబును బురికొల్పుచుండెను.

అట్టియెడ జయలక్ష్మి తనకటాక్షవీక్షణంబుల నొక్కపరి రాజపుత్రుల వంకను, మఱొక్కపరి మొగలులవంకనుఁ బరపుచుండెను. ఆఘోరసంగ్రామంబున రాణా తీవ్రముగఁ బోరుచుండెను. మొగలుసేనాధ్యక్షుఁ డొక్కఁ డాతనిఁదాఁకెను. వారిరువురు మత్తమాతంగంబులభాతి, హర్యక్షంబులచందంబున, నొకరినొకరు తీసిపోక క్షాత్రంబునఁ బోరఁదొడఁగిరి. తుదను రాజసింహుఁ డాతని మస్తకంబు నిజకృపాణంబున ద్రుల్లనేసెను. అదిగాంచి యాతనిభటులు కొందఱు రాణాను జుట్టుముట్టిరి. రాజసింహుఁడు గొంతక్షతగాత్రుఁ డయ్యెను. గాయములనుండి రక్తము ప్రవహింపఁ జొచ్చెను. తండ్రి పాటుఁగాంచి భీమసింగు రయంబున వచ్చి తండ్రికి సహాయుఁడై నిలిచి తన కృపాణరాజంబున శత్రుల కంఠనాళములఁ దునుమాడుచుండెను.

ఇంతలో నౌరంగజే బధిష్ఠించియుండిన గజ మొకపొదరింటిసమీపమున సంచరించుచు సహజచపలత్వంబునఁ గరంబుతోఁ దీగనులాగఁబోయి యేకారణముననో? వెనుదిరిగి బాధచే ఘీంకరించుచుఁ సంగరరంగంబునుండి పరుగెత్తసాగెను. మావటివాఁడెంత ప్రయత్నించినను నిలుపఁజాలఁడయ్యెను.

పలువురు వీరులు బల్లెంబులతోఁ బొడిచి యుద్ధ మొనర్చిరిగాని యది వారిపోటు లను సరకుగొనక యడ్డమువచ్చినవారి నెల్ల దొండంబున మోదుచుఁ బాదంబు లచేఁ ద్రొక్కుచుఁ బరుగిడెను. అదిచూచి మొగలుసైనికులు నిర్విణ్ణులై యుండ ప్రళయకాలరుద్రులభంగి సింహానాదములఁ జేయుచు, రాజపుత్రులు వారిపైఁ బడిరి. వారిదాడి కోర్వఁజాలక మొగలులు చాలమంది మరణించిరి. హత శేషులు కొందఱు దమయాయుధములు మొదలగువానిఁ బారవైచి ప్రాణ సంరక్షణార్థమై చిత్తూరుదుర్గమార్గంబునఁ బరుగిడిరి.

దుర్గాదాసు తన రహతూరుయోధుల సహాయముతో మొగలులగజ ముల నధీనపరచుకొనెను. చక్రవర్తిగారివస్తుపరికరము సయితము రాజపుత్రుల యధీనమయ్యెను. రాణా తీవ్రముగ గాయపడియుండుటచే వెంటనే పురి చేరెను. రాజపుత్రులు సంతసించి యానాఁడు జయలక్ష్మి తమ్మువరించినందు లకు భగవంతునిఁ గొనియాడుచు నిజవాసములఁ జేరిరి.

---

# ఇరువది మూఁడవ ప్రకరణము

## సాహసము

కడచినయుద్ధమున రాజపుత్రులకు సంపూర్ణవిజయము లభించెను. యుద్ధము గడచినమఱునాఁడే వీరమరణమునొందిన పురుషశ్రేష్ఠులపత్నులు భర్తృసహగమనం బాచరించిరి. గాయపడిన వీరు లందఱకుఁ దగురీతిఁ జికిత్సలుగావింప రాణాయుత్తరు వొసంగెను. రాజసింహుఁడు తీవ్రనారాచఘాతంబుల నొందియుండియు, వానిని లెక్కసేయక యుత్సాహపూరితుఁడై యుండెను. రాజవైద్యులు గడుజాగరూకతతో నాతనికిఁ దగుచికిత్సలు సల్పుచుండిరి. సంపూర్ణజయము లభించినందుల కుదయనగరమునను దక్కిన దుర్గములందును రాజపుత్రులు మహోత్సవములు సల్పిరి. తనకు స్వస్థత కలుగఁగనే హిమగిరితనయాప్రియు నారాధింప వెడలవలయునని రాణా తలంచియుండెను.

రాజపుత్రుల కంతటివిజయము లభించినను వారిస్థితి యింకను గొంచె మతృప్తికరముగనే యుండెను. వారిబలములు చాల నష్టమయ్యెను. ఆహారపదార్థములు తక్కువయ్యెను. ఔరంగజేబుచు చిత్తూరుకోటనుండి ఢిల్లీకిఁ దఱిమి చేసినయెడల ననాయాసముగ గుజరాతు మాళ్వము మొదలగుశత్రురాజ్యములపైఁబడి దోఁపిడిగొని తగినవస్తుపరికరములను బ్రోగుచేసికొనవచ్చునని తలఁచి వెంటనే రాజసింహుఁడు వీరాగ్రేసరుఁడగు స్వవల్దాసుచు సైన్యయుక్తముగ నజ్మీరునుండి చక్రవర్తికి సహాయార్థ మరుగుదెంచుసైన్యమును నాపుటకై పంపెను. భీమసింగు తండ్రియాజ్ఞమేరకు మఱికొంతసైన్యముఁగొని చిత్తూరునొద్దనుండు చక్రవర్తికి భీతిఁగల్పించుటకై వెడలెను.

దుర్గాదాసు మొదలగువారు తక్కినయరణ్యమార్గములనెల్ల జాగ్రత్తతోఁ గాపాడుచుండిరి.

చక్రవర్తిస్థితిమాత్రము భయాస్పదముగ నుండెను. అన్నిప్రక్కల నుండియుం విరోధులు పొంచిచూచుచుండిరి. అతనిబలములు చాలభాగము నశించెను. వస్తుసామగ్రి రాజపుత్రుల యధీన మయ్యెను. తనకొమారుఁడగు మహజాముఁరాక కాతఁడు నిరీక్షించుచుండెను. తుదకు చక్రవర్తి యాత్మ సంరక్షణార్థమై, చిత్తూరునందు మజామువచ్చువఱకు నిలువక, యజ్మీరునకుఁ బారిపోయెను. పోవునపు డక్బరును నజామునుఁ జిత్తూరునందే యుండ నియ మించి, తాము మరల సైన్యములసేకరించువఱకు వారచ్చట ప్రవర్తింపవలసి నదియుఁ జెప్పియుండెను. చక్రవర్తి యజ్మీరునకుఁ బారిపోవుచుండువిషయ మును భీమసింగుయొక్క యంగరక్షకదళాధ్యక్షుఁడగు జగత్ సిం గెఱింగి భీమసింగునకు రహస్యముగఁ జెప్పెను.

ఆసమాచారమును వినఁగనే భీమసింగు మానసమున నొకయూహ జనించెను. ఆనాఁడు థార్ వరుఖాను, రాణి మొదలగురాజకాంతలను జెఱ పట్టఁ బ్రయత్నించిన విషయ మాలనికి మఱపునకు రాదయ్యెను. అందులకుఁ దగినప్రతిక్రియఁ జేయుట కిది మంచియదనని యాతఁడు నిశ్చయించుకొని, తనయుద్దేశ్యమును జగత్ సింహునకు కెఱిఁగించెను. అందుకు జగత్ సిం గిట్ల నియె. "రాకొమారా ! మీరు తలఁచినప్రతిక్రియమంచిదే. కాని మన మారంగజేబు నంతఃపురకాంతలను జెఱపట్టితిమేని చాల కష్టపడవలసి యుండును. ఏలయన ? మనయొద్ద వారినిఁ గొనివచ్చుట కందలములులేవు. వారు పాదచారులై రావలసినదేకదా ?"

భీమసింగు:—జగత్ సింగ్! వారికొఱకు నీవు చాల సంకటపడుచున్నావే?

జగత్ సింగ్:—రాజకుమారా! మొదట మనము చక్రవర్తిగారిశిబిరములను బ్రవేశించుటెట్లు? ఒకవేళఁ బ్రవేశించినసంతమాత్రమున నంతఃపురకాంతలఁ జెఱపట్టుట కష్టముగదా? పోనిండు. నిరపరాధినులగు మహిళామణుల

ధరించి, వర్తకులవలె వేషములఁబూని మొగలుశిబిరములను బ్రవేశించి మీాతె లివి నుపయోగించి కార్యసాఫల్యము నొందుఁడు."

భీమసింగు:—స్వవల్ దాస్! నీయుక్తికూడ సమంజసముగనే యున్నది. నీవు చెప్పినట్లే చేసెదము.

జగత్ సింగు:—స్వవల్ దాసు మంచియుపాయమును దెల్పెను. రాకొమారా! రేపుసాయంకాలమునకు మీారును, నేనును, జస్వంతసింగుభగత్ సింగులును నీకార్యము నిర్వహింపవెడలుదము.

స్వవల్ దాసు:—చక్రవర్తిశిబిరములను బ్రవేశించుటకుముందు మీారందరివిష యంబులఁ జక్కఁగ గమనింపవలసియున్నది. మరల నాకడ కొకతూరి రండు.

ఆమాటలకు వారెల్ల రియ్యకొని స్వగృహోన్ముఖులైరి.

స్వవల్ దాసు భీమసింహజగత్ సింహులు మువ్వురు మఱునాఁటిసాయం కాలమున నొక్కరహస్యప్రదేశమునఁ గూర్చుండియుండిరి. వారుండు ప్రదేశ మునకుఁ జక్రవర్తికొఱకై శిబిరములు వేయఁబడుచున్నస్థలము చక్కఁగఁ గన్పట్టుచుండెను. వారుమువ్వురు శిబిరములు వేయుపద్ధతిని గమనించు చుండిరి. సూర్యాస్తమయసమయమునకుఁ జక్రవర్తి పరివారసహితుఁడై స్కంధావారమును సమీపించెను. ఆయుధపాణులై పలువురు యోధులు ముందు మార్గంబుఁజూపుచుఁ బోవుచుండిరి. వారివెనుక సర్వాలంకార భూషితంబులగు, పదియేనుంగులు మందగమనంబున నడచుచుండెను. అందు మొదటిదాని తాపళంబుపై నతిరమ్యంబుగఁ గట్టఁబడిన యంబారియందుఁ జక్ర వర్తి గూర్చుండియుండెను. ఆయిభరాజంబున కిరుపంకల నాయుధపాణులై గుఱ్ఱపురౌతులు నడచుచుండిరి. వానివెనుదన నొక్కశిబికయందుఁ జక్ర వర్తి బేగము ప్రయాణముచేయుచుండెను. ఆపల్లకి చిత్రవిచిత్రంబులగు జవనికలతో నలంకరింపఁబడియుండెను. దానికి వెనుకభాగమున బేగమువారి

యథాస్థానసఖీజనంబు లుచితరీతుల నందలంబుల నారోహించి పరివారసహితలై
శిబిరముల సమీపించుచుండిరి. మనముగ్గురు రాజపుత్రవీరులు వైవిషయం
బులనెల్ల గమనించుచుఁ గూర్చుండియుండిరి. చక్రవర్తివైభవమును జూచి
భీమసింగాశ్చర్యమొందెను. ఇంతలో మొగలుసైన్యమంతయు నిర్దిష్టస్థల
మున విడిసెను.

మఱునాఁడు మనయువకులు నలుగురును బంజాబీవర్తకుల వేషముల
ధరించి బజారువర్తకులలోఁ గలిసిపోయిరి. వారందఱు ఆదివఱకు ఢిల్లీపురం
బున భీమసింగుతోఁగూడ నుండినవారేగాన మహమ్మదీయుల యాచారవ్యవ
హారములను జక్కఁగ నెఱింగి యుండిరి. ఇదిగాక పంజాబీవర్తకుల వేషభాష
లనుగూడ గొంతవఱకు నెఱింగియుండిరి. అందుచే వారి నెవ్వరుగాని రాజ
పుత్రులని యెఱుంగఁజాలరైరి. గుఱ్ఱముల యాహారపదార్థముల నమ్ముట వారి
వ్యాపారము.

నాఁటిరాత్రి గాఢాంధకారముగ నుండెను. ఆశిబిరములముందు విశాల
వటమహీరుహం బొండుండెను. భీమసింగున కది మఱింత యనుకూల
మయ్యెను. ఆస్కంధావారము నాల్గుప్రక్కల మంటలు ప్రజ్వరిల్లఁజేసిరి.
ప్రతిశిబిరమునందును దీపముల వెలిగించిరి. రాజోద్యోగుల శిబిరములముందు
సేవకులు గస్తుదిరుగుచుండిరి. సైనికులు కొందఱు నాయుధపాణులై "ఖబర్
దార్! హుషార్." అని యఱచుచు, జనుల హెచ్చరించుట కప్పుడప్పుడు
కొమ్ములనూఁదుచుఁదిరుగుచుండిరి. పాపము, వారింత జాగ్రత్తగనున్నను జిన్న
చిన్న దొంగతనములు జరుగుచుండెను. గ్రహచారవశమున నా దొంగలు దొరి
కినచోఁ గఠినదండన మనుభవింపఁజేయుచుండిరి.

జనసంచార మింకను దగ్గకమునుపే యొకదీర్ఘబలిష్ఠకాయుఁడు పెద్ద
వరిగడ్డిమూట నొకదానిని వీపునధరించి రాజాశ్వములఁ గట్టియుంచిన శిబిర
ములవెనుకఁ బోవుచుండెను. అతఁడు మఱెవ్వఁడునుగాఁడు. మనకథానాయకుఁ

డగు భీమసింగే. భీమసిం గావటవృక్షమును సమీపించి గడ్డినొక చోఁ బార
వైచి సంచికప్పుకొని, చెట్టెక్కి యెవ్వరికినిఁ దెలియక దట్టములగు కొమ్మల
చాటున దాగియుండెను. రాత్రి పదిగంటల గునప్పటికి నమీరులు, మునసబు
దారులు, మొదలగు రాజోద్యోగు లెల్లరును జక్రవర్తినిదర్శించి వారివారిశిబిర
ములకు వెడలి పరుండిరి. క్రమక్రమముగ జనసంచారము తగ్గెను. కావలి
వారెల్ల రప్రమత్తులై యుండిరి. అదియె మంచిసమయముగ నెంచి భీమసిం
గావటభూరుహంబునుండి మెల్లన డిగి, చక్రవర్తిశిబిరమును సమీపించి, యాశి
బిరమునకు ముందటబిగించిన త్రాళ్లను నిశ్శబ్దముగఁ గోసివైచి యందుఁ గొంత
సందు సేర్పఱచుకొనియెను. ఆశిబిరమునకుఁ జుట్టును నిరువురు సేవకు లాయుధ
హస్తులై గస్తు దిరుగుచుండిరి. భీమసింగు తాను దెచ్చిన సంచిని ముసుగిడికొని
మెల్లమెల్లనఁ గడుజాగరూకతతో నేలఁబ్రాకుచుఁ గత్తితో నాశిబిరపుగుడ్డ
యందొక రంధ్రమును గావించి యందుండి లోనికిఁ జూచెను? గాని యాసమ
యమునఁ జక్రవర్తి యొకమృదుతల్పంబునఁ బరుండి నిదురింపక ఖురాను
గ్రంథమును మెల్లగఁ జదువుచుండెను. లోన నిరువురుభటులు కావలిఁ
గాయుచు, నిద్రమైకమునఁ దూఁగుచు నేదైనశబ్దమగుచోఁ దెప్పిఱిలి కనులు
విచ్చిచూచుచు నుండిరి. ఆనిశీథసమయమున నిద్రాదేవికివశముగానివా రెవ్వరు?
కాని నాఁ డదేమియో యంతవఱకు నౌరంగజేబునకు నిద్రపట్టలేదు.

తనయుద్దేశ్యము కొనసాగనందులకు భీమసింగు చాలఁ జింతించెను.
ఇంక నచట నుండుట ప్రమాదకరంబని యెంచి, తత్క్షణమే వెనుకకుఁ బ్రాకుచు
బయటిసంచారమును జేయఁబోవుచుండెను. అంతలో నొకకావలివా డామార్గ
మున వచ్చెను. వానినిఁ దప్పించుకొన నెంచి భీమసిం గొకప్రక్క కొదిగెను.
గాని కప్పుకొని యున్నసంచి కొంచెముజాఱి యాగస్తుదిరుగుచున్న సైనికుని
పాదమునకుఁ దగిలెను. వాఁ డదియేదియో గుడ్డయని భావించి, రెండవసైని
కుఁడు గస్తుదిరుగుచు వచ్చుట కింకవిడిచియుండునని తలఁచి వంగిలేసికొనఁ

బోయెను. ఆతఁ డట్టువంగి గుడ్డకై తడువఁబోవ భీమసింగు పాదము వానికిఁ దగిలెను. వెంటనే వాఁడు "దొంగదొంగ" యని యొక్కపెట్టున అఱచెను.

భీమసింగు తత్క్షణమే తనసంచి నచటఁ బాఱవైచి సందుచేసికొని వచ్చిన వెనకుఁ బరుగెత్తెను. దొంగయనుశబ్దము విని రెండవవాఁ డెదురుగఁ బరుగిడివచ్చుచుండెను. ఆచీకటిలో భీమసింహుఁ డాతనిపైఁబడెను. వారిరువురు నేలపైఁబడిరి. కాని భీమసింగు లేచి వేగముగఁ బరుగిడిపోయి ముందు వచ్చినసందులో దూరి యొక్కక్షణములో సాంకేతికముగ నుంచుకొన్న మఱ్ఱిచెట్టుపైఁ జేరెను. ఇంతలో శిబిరములందు గొప్పగందరగోళము జనించెను. దీపికలఁగొని పలువురు పలుతావుల దొంగకై వెతకిరి. దొంగజాడయు వారికెవ్వరికిఁ గానరాదయ్యెను. దట్టమగుచెట్టుకొమ్మలనుండి భీమసిం గాగందరగోళమునంతను గాంచుచుండెను. కొంతసేపటికి కాకళవళము తగ్గెను. భీమసింగు చెట్టుఁ దిగి నిశ్శబ్దముగఁ దనచెలికాండ్రఁ గలియఁబోయెను.



# ఇరువదినాల్గవ ప్రకరణము

## రాజ్యాభిలాష

భీమసింగును నాతని యనుచరులును మొగలు శిబిరములనుండి తప్పించుకొని చిత్తూరును జేరిరి. రాత్రి తానొనర్చిన సాహసకృత్యమును నాతఁడెవ్వరితోఁ జెప్పలేదు. ఔరంగజేబు అజ్మీరుఁ జేరిన కొన్నిదినములకుఁ దనకుమారుని సహాయార్థము పండ్రెండువేలసైన్యమును బంపెను. ఆవిషయ మెఱిఁగి రాణా మఱికొంతసైన్యమును స్వవల్‌దాసు సహాయార్థ మంపెను. భీమసింగు చిత్తూరునుండి యెప్పుడుత్తరదిశగఁ బోకుండునట్లు జాగ్రత్తతోఁ గాచుచుండెను. అక్బరు నిదివఱ కనేకమారులు రాజపుత్రులబలశౌర్యములను, యుద్ధనైపుణ్యమును వెల్లడించినవాఁడు గావున రాజపుత్రులతో యుద్ధముసేయుట కొక్కింత జంకుచుండెను. స్వవల్‌దా సజ్మీరునుండి వచ్చుచున్నసైన్యమును "పుర్ మాండల్" వద్ద నెదిరించి సంపూర్ణముగ నిర్జించి తిరిగి యజ్మీరునకుఁ దఱిమివేసెను. ఇంతలో వర్షాకాలము ప్రారంభమగుటచే యుద్ధ మాపివేయఁబడెను.

యుద్ధ మాపివేయఁబడఁగనే భీమసింగు తనతండ్రినిఁజూడ నుదయనగరంబునకు విచ్చేసెను. రాణా యుత్సాహపూరితుఁడై యుండెను. వర్షాకాలమంతయు భీమసింగుదయనగరంబునందే తండ్రిగారికి శుశ్రూషలం జేయుచుండెను. అతఁడు తనమనోహారిణిం జూడ నభిలషించుచుండెనుగాని పోవుటకు వీలులేకుండెను. విశ్రాంతిసమయములం దాతఁడు యుద్ధనైపుణ్యంబును వృద్ధినొందించుకొనుచుఁ జక్కఁగఁ బరిశ్రమఁజేయుచువచ్చెను.

అక్బరు జయసింగులకు జరిగిన సంధినియమముల ప్రకారము, రాజద్రోహియగు ఘామాపగోకులదాసు రాణా వశముగావింపఁబడియుండెను

గదా ? రాణారాజసింహుఁ డాతఁడు చేసిన నేరవిషయ మామూలాగ్రము విమర్శించి యిరువదినాల్గుగంటలలో నాతఁడు తనరాజ్యమును విడిచి పోవలయుననియుఁ దర్వాత నాతఁ డెవ్వరికంటఁబడిన మరణశిక్షకలుగు ననియు నాజ్ఞాపించెను. రాణాయుత్తరువుమేరకు గోకులదాసు దేశభ్రష్టుఁడై వెడలిపోయెను.

వర్షాకాలానంతరము భీమసింగుతనను, రాజ్యాంగమంత్రియగు దయాళ్ షాకును, గొంతసైన్యమునుగొని వేర్వేఱుగ గుజరాతుమాళ్వము మొదలగు విరోధిదేశములపైఁబడి దోపిడిచేసికొని రావలయునని రాణా యాజ్ఞాపించెను. దయాళ్‌షా మాళ్వమునం దున్నవిరోధివర్గములనెల్ల జయించి మసీదులనెల్ల నిర్మూలించి మహమ్మదీయులను బలురీతులబాధించి వారిమతగ్రంథములను గాల్చి ధనధాన్యపశ్వాదుల దోపిడిచేసికొని యుదయనగరమును జేరెను. అది రాజపుత్రులకుఁ జాల సహాయమయ్యెను. కాని మహమ్మదీయుల నాతఁడు పెట్టినబాధలు దుర్భరములు.

ఆసమయమున గుజరాతునందలి ప్రజలు తమకష్టనష్టములనుగూర్చి రాజసింహున కొకవిజ్ఞప్తిఁ బంపుకొనిరి. ఉదారస్వభావుండగు రాణా వారి దీనస్థితిని విని తనకొమరుఁడగు భీమసింగును, నదిపఱకుఁ దొరకినవస్తుపరికరములమాత్రము గొనిరమ్మని యాజ్ఞాపించెను. భీమసింగు గుజరాతునందలి యనేకపట్టణములజయించి కొల్లఁగొనెను. తండ్రియుత్తరువువచ్చునప్పటికి గుజరాతునకు ముఖ్యపట్టణమగు సూరతును జయింప నాతఁడు వెడలుచుండెను. అతఁడు వెడలిన ప్రతిస్థలమునను జయలక్ష్మి యాతనిని వరించుచుండెను. గుజరాతమును సర్వమును జయించువఱకు వెనుదిరుగుట యాతని కిష్టములేదు. కాని తండ్రియాజ్ఞను జవదాటుట కాతఁడు సాహసింపఁజాలక తనకిష్టము లేకున్నను వెనుదిరిగి యుదయనగరమున కరుదెంచెను.

ఇంతలో దక్కనునుండి సుల్తాన్ మఉజాము గొప్పసైన్యమునుగొని చిత్తూరువచ్చిచేరెను. వెంటనే చక్రవర్తియాజ్ఞ పేరకు సుల్తా నక్కడ తనసోపా

పల నిరువురఁ జిత్తూరునందే యుండనియమించి తా నజ్మీరునకు వెడలెను.
అక్బరు షార్ వరుఖానుల నిరువురను నారావళీపశ్చిమప్రాంతమునుండి
మార్వారుపైఁ బంపుటకుఁ జక్రవర్తి నిశ్చయించియుండెను. ప్రస్తుత మక్బరు
చిత్తూరును విడుచుటగూడ 'రాజపుత్రుల కనుకూలముగనుండెను. కాన
నాతని నే యాటంకములులేక యజ్మీరునకుఁ బోనిచ్చిరి. అక్బరు వెడలిన వెం
టనే యజాముముజాముల నిరువుర నతి సులభంబున జయించి తర్వాత నక్బరు
పైఁబడి యాతని సంపూర్ణముగ నోడింపవచ్చునని రాజసింహుఁడు నిశ్చ
యించెను.

అక్బరు చిత్తూరును విడిచివెడలిన కొన్నిదినములకే దయల్ షాజయ
సింహులు చిత్తూరును ముట్టడించిరి. రాజపుత్రులరాకవిని సుల్తానజాము తన
సోదరుని గోటను గాపాడుటకై నియమించి తాను బలములనుగొని కోట
వెలుపల వచ్చుచున్న రాజపుత్రుల నెదిరించెను. ఉభయపక్షములవారికినిఁ
జాలదినములు పోరు తీవ్రముగ జరిగెను. తుదకు రాజపుత్రులదాడి కోర్వ
జాలక మొగలులు పలాయనమంత్రము బఠింపవలసినవారైరి. తమసైన్యంబు
దైన్యంబునొంది పరుగిడుటఁజూచి ముజాము తనయన్నకు బాసటయై వచ్చి
నిలిచెను. కాని విఫలమనోరథుఁ డయ్యెను. నాఁటియుద్ధమున మొగలులు సం
పూర్ణముగ నిర్జింపఁబడి తఱుమఁగొట్టఁబడిరి. చిత్తూరు రాజపుత్రుల వశ
మయ్యెను.

తర్వాత రాణా 'గాడ్వారు' పై దండెత్తి యచ్చటనున్నవిరోధులఁ
బారఁదోలి మేవారును శత్రువులనుండి సంపూర్ణముగ రక్షింపవలయునని
తలంచి కుంభాల్ మరును దనకు ముఖ్యపట్టణముగ నేర్పఱచుకొన నెంచెను.
కొన్నిదినములకు కుంభాల్ మరుకోట శిఖరాగ్రంబున మేవారుపతాక మల
రారుచుండెను. నాఁటిదినము తనయేలికయగు రాజసింహునకు స్వాగతమొసం
గుటకు, గోపీనాథుఁ డెల్లను సిద్ధముచేసి రాణా రాగనే తగురీతి స్వాగతం
బొసంగెను.

ప్రేమాబాయి తోరణగడ్డనుండి యనుచరసమేతుఁడై వచ్చు రాణాను గాంచుచుండెను. తారకాగణమధ్యంబునఁ బ్రకాశించు రోహిణీపతుని చందంబున నాజనమధ్యంబునఁ బ్రకాశించు భీమసింగు సుందరమూర్తి యాబాలామణి మనంబు నాకర్షించెను. ఆజవ్వని భీమసింగు నాకారసౌష్ఠవంబులఁ దిలకించి యానందమగ్న యయ్యెను. భీమసింగునం దిప్పుడు గొన్ని మార్పులు గలిగిన ట్లామె గ్రహించెను. ఆతని మోమునం దిప్పుడు బాల్యచిహ్నము లంతరించినవి. ఆరాజకొమరునిఁ గాంచినప్పు డామె మనమున నొక్కుమ్మడి సంతోషసంకటంబులు జనించెనుగాని యామె [illegible] గావునఁ దనభావంబుల నణఁచికొని. యాతనిసౌభాగ్యమే తన సౌభాగ్యమని యెంచికొనియెను.

భీమసింగు తండ్రితోడఁ గుంభాల్మేరునందు నివసించినప్పుడు తన మనోహరివిషయమై ప్రేమాబాయి నడుగుచుండెను. అతఁ డడుగునప్పు డెల్ల నామె భావమున నొకవిధమగు కలవరము గలుగుచుండెను. కాని యామె భావములను మఱుఁగుపెట్టుచు సంతోషము నభినయించి యామాటలకు సరిగ ప్రత్యుత్తరము లిచ్చుచుండెను. తా నెవ్వని గాఢముగఁ బ్రేమించెనో ఆసుందరాంగుఁ డన్యకాంతాసక్తుఁడై యావిషయముఁ దన్నే యడుగుచుండెనని విని ప్రేమాబాయి మనం బెట్లుండునో చదువరులే యూహింతురుగాక.

ఇట్లుండ నక్బరుఖాన్ వరుఖాను లారావళీపర్వతపంక్తిప్రాంతముల నుండి వచ్చుచున్నారని రాణాకుఁ దెలియవచ్చెను. వెంటనే యాతఁడు జోధ్పురమహారాణికిఁ గుంభాల్మేరునకు రావలయునని పత్త్రమునంపెను. మొగలు లడ్డమురాకమునుపే వారినిఁ గొనివచ్చుటకై భీమసింగును, కొంత సైన్యమును, రాణా పంపెను. ఒకసమయమున, వీలుండినఁ దనబలమును దుర్గాదాసుబలముతోఁ జేర్చి వచ్చుచున్న యక్బరుఖాన్ వరుఖానులను నోడించి కొండలకుఁ దఱుమవలయునని రాజసింహుఁడు కొమరునకుఁ జెప్పియుండెను.

అక్బరు మొదట జోద్పురమును బట్టుకొనఁదలఁచి యుండెను. ఏలన? జోద్పురమును బట్టుకొన్నవారికి సహాయార్థమై రాణాబలములు వచ్చుననియు, మార్వారు మైదానప్రదేశమగుటచేఁ దమకు కొంతయనుకూలముగ నుండుననియు నతఁడు దలంచెను. అతఁ డీయుద్దేశ్యమును దనతండ్రి కెఱిం నెక్కుడగుటచె క్రవర్తి యందు కిష్టపడలేదు. అతఁ డొక్కవ్రేటుతో సర్వమును నిర్మూలింపఁ దలఁచెను. కనుక బలములు రాజపుత్రుల బలములకంటె నెక్కుడగుటచేఁ దమకే సంపూర్ణవిజయము లభించు నని చక్రవర్తి నమ్మియుండెను. మొదట రాణాను జయించి, పిమ్మట రాజపుత్రస్థానమునంతయు నవలీలగ జయింపవచ్చునని నిశ్చయించుకొనెను. కాన నక్బరు తండ్రిమాటనే యొప్పుకొనవలసివచ్చెను. అతఁ డీతూరి రాజపుత్రుల నెట్టులైన జయింపఁ గృతనిశ్చయుఁడై యమితోత్సాహంబున వచ్చుచుండెను.

భీమసింగు దుర్గాదాసు నాధిపత్యమున వచ్చుచున్న రహతూరుసైన్యమును, 'సుప్రి' నదీతీరమునఁ గలిసికొనెను. దుర్గాదాసు భీమసింగును దగఁజేరి బహూకరించెను. ఆసమయమున భీమసింగు తనమనోహారిని నొక్కమారు సందర్శించెనుగాని మాటాడుటకు వీలు దొరకలేదు. వెంటనే రాణియు నంపాలికాదులును గుంభాల్మేరునకుఁ బంపఁబడిరి. దుర్గాదాసు భీమసింగులు దమ బలంబులతోఁ గొంతవఱకు నుత్తరదిక్కేఁగి వచ్చుచున్న యక్బరుసేనను గాంచిరి. ఉభయపక్షముల వారును 'నాడల్' అనుచోట ముఖాముఖి యైరి.

దుర్గాదాసు కరవాల విద్యయం దెంతనేర్పరియో బుద్ధియందుఁగూడ నంతనేర్పరి. అక్బరు సేనాపారావారము నెదుట వారి కంతసులభ సాధ్యముగ గన్పట్టలేదు. నాఁటి రాత్రి రాజపుత్రనాయకులంద ఱొక్కయెడఁ గూడితీ ప్రముగ నాలోచించిరి. వివిధ దళాధ్యక్షులందఱుఁ దమతమసైనికులకు వీరోద్రేకంబులగు గంభీరోపన్యాసముల నొసంగి యుద్ధోన్ముఖులఁ గావించిరి.

దుర్గాదాసు చాల యోచించి తుద కిట్లనియె. "రాకుమారా! రహ
తూరుయోధులారా! ప్రస్తుత మక్బరుబల మమితముగ నున్నది. ముఖా
ముఖి నెదిరించి నిర్జించుట సంశయాస్పదము. ఇప్పుడు మీకుఁ దోఁచినయు
పాయం బెద్దియైన నున్నఁ దెలుపుఁడు." అపలుకులు విని ఇందరభాను సర్వ
జనులు విన నిట్లనియె. "వీరపుంగవులారా! నాకిప్పు డొకయూహ జనించు
చున్నది. అదేమన? విరోధులనుండి దోఁచుకొన్న లొట్టిపిట్ట లాఱువందలు
నాయొద్దనున్నవి. మనకార్య సాఫల్యంబున కవి కొంతవఱకు నుపయోగిం
చును. రేపటిరాత్రికి మన మాలొట్టిపిట్టలకు మండుచున్న కొఱవులు గట్టి
యేమఱియుండు మొగలులపైఁ దోలుదము. శిబిరంబులం దగ్నిజ్వాలలు
ప్రజ్వరిల్లఁజేసి విరోధులఁ జీకాకుపెట్టఁగలవు. ఆసమయమును గనిపెట్టి
మొగలులపైఁ బడవచ్చును. ఇదియే నాయూహ. ఇందుపై మీయిష్టము."

అప్పటి కాయూహ సమంజసముగ నుండుటచే వారంద ఱద్దాని
కియ్యకొనిరి. మఱునాఁడు రాత్రియగునప్పటికి మొగలుసైనికులందఱుఁ గడు
పార భుజించి వినోదముగ గుంపులు గుంపులుగూడి మాటాడుకొనుచుండిరి.
అంతలో నకస్మాత్తుగ నాఱువందలు లొట్టిపిట్టలు కొఱవులతోఁ శిబిరములందుఁ
బ్రవేశించెను. పాప మాజంతువులు దమకుఁ గట్టఁబడిన కొఱవులవేఁడిమికిఁ
దాళఁజాలక పిచ్చియెత్తిన వానివలె దిక్కుతెలియక పరుగిడఁ దొడఁగెను.
అనేకులు వానిపాదముల వ్రేటులకు నలిగిపోయిరి. ఇంతలోఁ గొన్నిశిబిరము
లగ్నిభట్టారకున కాహుతి కాఁజొచ్చెను. పాపము అప్పటిమొగలుల దుర
దృష్ట మేమనగవచ్చును? యొంటెలపాదతాడనములును, భస్మీభూతమైన వస్త్ర
పరికరములతోఁ గూలు శిబిరములును గాంచి వారొనర్చు గంపరగోళము
చెప్పనలవిగాకుండెను. తటాలున నట్టివిపత్తు సంభవించుటచే మొగలులు నిర్వి
ణ్ణులై చిందఱవందఱయై యుండిరి. ఆసమయమున రాజపుత్రులు సింహనా
దములుచేయుచు వారిపైఁబడి యుద్ధమువచ్చిన మొగలులనెల్లఁ జంపఁదొడఁ
గిరి. ఇంతలో థార్వరుఖాను కొంతసైన్యమును దీసికొని రాజపుత్రుల

నష్టగించెను. పోరు తీవ్రముగనే జరిగెను. మొగలుసైనికులు చాలమంది నశించిరి. తుదకు వారువెన్నిచ్చి పర్వెత్తిరి. అక్బరు థాన్‌వరుఖానుల యదృష్ట మేమియోగాని జయలక్ష్మి వారి నొక్కపగిదియైన వరింపలేదు.

అక్బరున కీయుద్ధములం దిసుమంతయైన నిష్టము లేదు. ఈయుద్ధము లన్నియు నిష్ప్రయోజనములనియు ననర్థదాయకములనియు నాతఁ డెఱింగెను. రాజపుత్రుల జయించుట సులభసాధ్యము గాదని యాతనికిఁ దేటతెల్ల మయ్యెను. రాజపుత్రులతోడ సంధిసేయుటకంటె నితరోపాయ మొండాతనికిఁ గానరాదయ్యెను. తనయభిప్రాయము నాతఁడు థాన్‌వరుఖానునకుఁ దెలియఁబఱచె. మఱునాఁ డుదయమున నే థాన్‌పరుఖాను రాయబారిగ రాజపుత్రులయొడకు వచ్చెను. దుర్గాదాసు మూఁడుదినములు మాత్రమే వారితో సంధికొప్పుకొనెను.

భీమసింగు తనమిత్రుఁడగు సుల్తానక్బరును జూచుటకై థాన్‌వరుఖానుతోఁ గూడి వెడలెను. అక్బ రాతని సగౌరవంబుగ నాహ్వానించి కుశలప్రశ్నగావించి లోనికిఁ గొంపోయెను. స్నేహితు లిరువు రేకమృదుతల్పంబు నందుఁగూర్చుండి మాటాడుకొనఁదొడఁగిరి.

అక్బరు:—మిత్రమా! భీమసింహా! అనర్థదాయకంబులగు నీయుద్ధములందు నా కిసుమంతయేనియు నిష్టము లేదు. మన మిట్టి నిర్హేతుకములగు కలహంబులఁ బెట్టుకొని యనేకులప్రాణములఁ దీయుటఁ జూడఁ బాపానుభవమునకని తోఁచుచున్నది. ఈయుద్ధములవలన నిరుపక్షములందును నెందఱువీరాగ్రేసరులు మృతినొందిరి! ప్రయోజనం బావగింజంతయైనఁ గానరాదు. మనమన్యోన్యసఖ్యంబు గలిగియుండుట శ్రేయోదాయకంబు. నే నీతూరి చక్రవర్తిగారి కీవిషయంబులనెల్ల విశదంబుగఁ దెల్పి యెట్లయిన సంధి నొడఁగూర్చెద. ఇందులకు నీయభిప్రాయ మేమి?

భీమసింగు:—అక్బరుమహాశయా! మీ కీయుద్ధములం దిష్టము లేదని మేము చక్కఁగ నెఱుంగుదుము. కాని మీతండ్రి గర్వంబున మమ్ము నిర్మూలించు

బులును మాబలంబులును జేర్చి తత్క్షణమేయజ్మీరునకు వెడలి చక్రవర్తినిం జెఱ
పట్టి సింహాసనచ్యుతునిం జేయుదము మీరు సింహాసనమలంకరింపవచ్చును.
మీసహోదరు లిప్పుడు రక్షింబడుచున్నారు. వారొకవేళఁ జక్రవర్తికి
సహాయార్థమరుగుదెంచఁ దలఁచినను సకాలమునకు రాఁజాలరు. మీకిది
మంచి తరుణము. నిరాటంకముగఁ జక్రవర్తిపదవివచ్చును. అటుపిమ్మటం
మీసహోదరులువచ్చినను వారిని సులభంబున నిర్జింపవచ్చును. సర్వరాజ
పుత్రప్రభువులు మీకు బాసటయై నిలిచెదరు. మీరు రెండవయక్బరని
నిర్మలకీర్తిప్రతిష్ఠలఁ బొందఁగలరు. దేశమునకు శాంతిచేకూరును. మిమ్ము
వరింపనున్న రాజ్యలక్ష్మిని నిరాకరింపకుఁడు. సార్వభౌమపదంబు స్వీక
రించి సౌఖ్యం బొనగూర్పుఁడు. నాహితవు నిరసింపకుఁడు. మీకు భద్రం
బొడఁగూడుగాక!" మహాశయా! వింటిరా మాతండ్రిగారిసందేశము?
ఇందులకు మీయభిప్రాయ మేమియో? చక్కఁగ నాలోచించి తెల్పుఁడు.

అక్బరు:— మిత్రమా! భీమసింహా! యుదారస్వభావుఁడవు మీతండ్రిహితో
క్తుల కేనెంతయుఁ గృతజ్ఞుఁడను. కాని, యిట్టిదుర్ఘటకార్యంబు నెఱవేఱ
గలదా? యనిమాత్రము కొంతసంశయించుచున్నాను. ఔరంగజేబు కడు
చతురుఁడు. సామాన్యముగ మాయోపాయములకు దొరుకువాఁడుగాఁడు.

భీమసింగు:—సుల్తాను మహాశయా! మీరందులకు సంకోచింపఁబనిలేదు. రాజ
పుత్రులందఱు మీ కీవిషయమందుఁ దప్పక సహాయముఁ జేసెదమని ప్రతిజ్ఞఁ
జేయుచున్నారు. ఇదియే మంచితరుణము మిమ్ము వరింపనుండిన రాజ్యశ్రీ
రమ నేల నిరాకరింతురు? 'సిరిరా మోకాలొడ్డువాఁడుండునే'?
నామాట వినుఁడు.

అక్బరు:—మిత్రమా! నీవంటి మిత్రవతంసంబును గాంచఁగల్గినందుల కేనెం
తయు సంతసించుచున్నాను. మీతండ్రిగారి కోరికప్రకారమే వర్తిం
తము. రేపుదయమున నీమిత్రులగు దుర్గాదాసాదుల నిచ్చటికిం గొనిరమ్ము

మన మెల్లరుఁగూడి పైవిషయమును సావధానముగఁ జర్చించి తరువాతఁ బ్రవర్తింతము.

భీమసింగు:—మహారాజా! అటులనే కానిండు. త్వరలోనే ఢిల్లీపురమునకు నేను మీయతిథిగ రాఁగలనని నమ్ముచున్నాను. రేపు ప్రయాణమున మీదర్శనమునకై వచ్చెదము. ఇప్పటికి సెలవుగొందును.

అని భీమసింగక్బరునొద్ద సెలవుగొని తనశిబిరమునకుఁ జేరెను. భీమసింగువాక్యము లాలించినది మొదలక్బరు మానసమున నాశ జనించెను. రాజపుత్రులు సత్యసంధులనియు వీరాగ్రేసరులనియు నమ్మి వారిసాహసమునఁ దాను నిశ్చయముగఁ జక్రవర్తి కాఁగలనని యాతఁడు దృఢనిశ్చయుఁడై సంతోషమున నుండెను. ఆహా! ఆశాపాశ మెంత దృఢమైనది?



# ఇరువదియైదవ ప్రకరణము



## వంచన

భీమసింగక్బరువలన సెలవుగొని తనశిబిరమును జేరునప్పటికి సాయంకాల మయ్యెను. రాజపుత్ర ప్రభువు లందఱు నాతనిరాకకై వేచియుండిరి. నాఁటిరాత్రి భీమసింగు సందేశమును విన వారెల్లరు దుర్గాదాసుశిబిరమునందు సమావేశమై, యాతఁడు నుడివినవాక్యములఁ గడుజాగరూకులై వినిరి. కాని వారి కక్బరుమాటలం దంతనమ్మకము జనింపలేదు. తమ్ము మోసగింప నక్బ రట్టి పన్నాగమును బన్నియుండునని యనుమానించిరి. వారిసంశయములను గాంచి భీమసింగునకుఁ గోపము వచ్చెను. అప్పు డాతఁ డిట్లు చెప్పెను. "ప్రభువులారా! మీ రక్బరువాక్యముల కనుమానింపవలదు. అతఁడు సత్యవంతుఁడు. అక్బ రసత్యవాదియనియుఁ గ్రూరుఁడనియుఁ జెప్పువానికంటెఁ బాపాత్ముఁడు లేఁడు. మీ రిట్టి లేనిపోని యనుమానములఁ బెట్టుకొని మంచి తరుణమును బోఁగొట్టుకొనరాదు. దేశాభ్యుదయమున కడ్డుపడకుఁడు."

ఆవేశంబున భీమసింగునుడివిననుడువుల నాలకించి రాజపుత్రు లాశ్చర్యమున మునింగిరి. ఎల్లరును దమచూడ్కులను దుర్గాదాసుపైఁ బఱపిరి. దుర్గాదాసది గ్రహించి యిట్లనియె. "నాయకులారా! భీమసింగతి పరిశీలనానిపుణుఁడు. వయసునఁ జిన్నవాఁడైనను జ్ఞానంబున వృద్ధుఁడు. అతనిమాటలు విశ్వసనీయములనియే తలంచుచున్నాను. రేపుదయము మన మక్బరుసన్నిధికి వెడలుదము. ఒకవేళ మన కకస్మాత్తుగ నెద్దియైన నపాయము సంభవించిన వెంటనే మనకు సహాయమొనర్చుటకు వీలుండునట్లు మనబలంబులఁ దగువైనస్థలంబుల నిల్పి వెడలుదము. మీరు భయపడవలదు. రాకొమారా! నీకోరికమేరకే ప్రవర్తింతము." దుర్గాదాసుమాటలను మాఱుమాటాడక యెల్లరు సమ్మతించిరి.

మఱునాఁ డుదయముననే భీమసింగును, దుర్గాదాసును నతనిసహోదరుఁ డును, నింద్రభాను మొదలగు నాయకులును, గవచాద్యాయుధంబుల ధరించి యశ్వారూఢులై యక్బరును జూడ నేఁగిరి. వారు మొగలులసన్మానాచార మును జేయువేళ నక్బరుభార్గవరుఖానులును, మఱియుం ముఖ్యవసీరులును వారి నెదుర్కొని సగౌరవంబుగ నాహ్వానించి సమ్మానించిరి. తదుపరి వారందఱును జక్కఁగ నలంకరింపఁబడిన యక్బరుశిబిరమును బ్రవేశించిరి. ఆశిబిరమును బ్రవేశింపఁగనే రాజపుత్రులు తమయాయుధంబుల నొకప్రక్క నుంచి, శిబిరమధ్యభాగంబున వృత్తాకారముగ నమర్పఁబడిన హంసతూలికా తల్పంబుల నాసీనులైరి. వారెల్లరు సుఖాసీనులైనపిదప భీమసింగు నక్బరు రాజపుత్రుల నొక్కరొక్కరినిఁ గ్రమముగ నక్బరునకుఁ బరిచయము గావించెను.

అక్బరు రాజపుత్ర నాయకుల నెల్ల సావధానంబున నుపలక్షించి వారి ముఖభావములంబట్టి విశ్వాసపాత్రులని మనంబునఁ దలంచి భీమసింగుతోను నితరులతోను నిట్లనియె. "మిత్రులారా! నేఁడు మిమ్ముఁ గాంచఁ గల్గి నందులకును, మీతోడ స్నేహముగావించినందులకును, నే నెంతయు సంత సించితిని. ఉదారు లనియుం, విశ్వాసపాత్రు లనియుం నమ్ముచున్నాఁడను. పూజ నీయులగు రాణా రాజసింహులు, మాయౌరంగజేబును సింహాసనమునుండి తొలగించి నన్ను సింహాసనాసీనునిగఁ జేయ నుద్దేశించి యున్నారఁట. అందు లకు సర్వరాజపుత్రులు సాయమొనర్తురని మీ భీమసింగు వాగ్దత్తమొసంగి యున్నాఁడు. మీరు నిక్కంబుగ నిరర్థకయుద్ధంబుల నిర్మూలించి యుభయ పక్షములవారికిని శాంతి చేకూర్ప నిచ్చగించియుంటిరేని నన్ను మీరిప్పుడు నాకీసమయంబున సాయమొనరింపుఁడు. ఇదియే మంచిసమయము. ఔరంగజేబు చక్రవర్తి మితపరివారుండై యజ్మీరునందున్నాఁడు. మనముభయసబలంబులఁ జేర్చుకొని వెడలి యాతనిఁ గడుసులభంబున జయించి చెఱపట్టవచ్చును. నేను

చక్రవర్తిపైని పక్షమున మీసహాయము వృథాకాఁజాలదు. మొగలుసామ్రా
జ్యంబున మీకును గౌరవాదులు జరుగఁగలవు. ఇందులకు మీయభిమతం
బేమియో తెల్పుఁడు".

ఆమాటలు విని దుర్గాదాసు కొంతవఱకు యోజించి యిట్లనియెను. "అక్బరు మహాశయా ప్రస్తుతము మేము ఢిల్లీ రాజసంస్థానంబునందు గొప్ప యుద్యోగములకుఁగాని బహుమతులకుఁగాని యాశించుటలేదు. నిర్హేతుక సంగ్రామంబులు నిల్పి శాంతి నెలకొల్పుటయే మాయాశయము. అందులకు మీయిచ్ఛానువృత్తి వర్తింతుము. మీకుఁ దప్పక సాయమొనర్తుము. మీ రావిషయమునఁ జింతఁబక్కి యుండుఁడు. రాజపుత్రు లాడితప్పువారు కారు. ముమ్మాటికి మీ కీకార్యంబున సాయమొనర్చెదము."

ఆమాటలు విని యక్బరమితానందంబునొంది తనకృతజ్ఞతను వెడలఁ బుచ్చుచు, "నాలసించినఁ బ్రయోజనముండదు; గనుక తత్క్షణమే యుభయ బలంబులఁ జేర్చి యజ్మీరుపైకి వెడలుద"మనియెను. దాని కమీరుఁ డొకఁడు లేచి యక్బరు నుద్దేశించి "హుజూర్! మనమిప్పుడొక గొప్ప కార్యంబు నిర్వ హింపఁబోవుచున్నాము. ఆకార్యంబు నిర్విఘ్నముగ నెఱవేర్ప దలంచితి మేని శుభముహూర్తంబున బయలుదేరుట మంచిది. మన కార్తాంతికవర్యునిఁ బిలిపింత" మని నుడివి నిల్చుండెను. ఆపలుకులువిని తక్కిన మహమ్మదీయు లందఱును మంచిదని నుడివిరి. వెంటనే యక్బరుచెవిలో నేదియో తెల్పి యామీరుఁ డటనుండి వెడలిపోయెను.

రాజపుత్రులకు జ్యోతిషమన్న నమ్మకములేదు. వారు శుభముహూర్త ములకొఱకు నిరీక్షించువారుగారు. కేవలము బుద్ధిబలస్థైర్యంబులమీఁదనే యాధారపడువారు గనుక, నాయమీరు తెల్పినవాక్యములు వారికి రుచింప లేదు. తమవారిమనసులందలి విషయమును భీమసింగు గ్రహించి, యామా టకు మీరనుమానపడవలసినదిలేదని కనుసన్న చేఁ దెలియఁజేసెను. తర్వాతఁ

గొంతసేపటికి కచ్చరు నానతిమేరకు రాజపుత్రులకు ఫలాహారాదులును బాసి యాంబులును నొసంగఁబడెను.

అంతలో మౌహూర్తికుని నొక్కనిఁ బిలుచుకొని యమీరుఁ డరుదెంచెను. ఆకార్తాంతికుఁడు మధ్యవయస్కుఁడు. సుఖచపాటివాఁడు. స్థూలకాయుఁడు. ఆతనిచూపులును, మాటలును జూచి, కపటియనియు ననుమానాస్పదుఁడనియు దుర్గాదాసు తలంచెను. వెంటనే యామౌహూర్తికుఁడొక్కసుముహూర్తంబు నిర్ణయింపఁదొడఁగెను. ఎల్లరును నాతఁ డేమిచెప్పఁబోవునో? యని వేచియుండిరి. ఆకపటదైవజ్ఞుఁడు కొంతవఱకు కాకపదము సుఖలక్షించి మఱికొంతతడవు తీవ్రముగ నాలోచించి, పదపడి నొకదీర్ఘనిశ్వాసంబుఁబుచ్చి యిట్లనియె. "హుజూర్! రేపటిదినము ప్రయాణమునకు బాగుగలేదు. మఱునాఁడు మీరు వెడలవచ్చును. మీకార్యము సాఫల్యమునొందును. ఉన్నవిషయమును మనవిఁజేసికొన్నాను." ఆవాక్యములు విని, యమీరును సైనికులు మొదలగువారెల్లరు దైవజ్ఞుఁడుచెప్పినచొప్పునఁ జేయుట మంచిదని పలికిరి. అక్బ రొక్కఁడేమి చేయగలఁడు?

జ్యోతిష్కునిఁగాంచినప్పటినుండియు దుర్గాదాసున కాతనియందొకవిధమైనయనుమాన ముదయించెను. అతఁ డాతనిపై నొకకన్నుంచియే యుండెను. నాఁటిరేయి యెవ్వఁడేని యజ్మీరుమార్గమునఁ బోవుటకు యత్నించిన వానిఁబట్టికొనిరండని కొంతమందిని దుర్గాదాసు నియమించెను. ఆసివారుమార్గమును గాచియుండఁగా నల్వురు మాఱువేషములఁధరించి యజ్మీరునకుఁ బోవుమార్గమున నొంటెలనెక్కి పోవుచుండిరి. వారు కొంతదవ్వుపోవునప్పటికి దుర్గాదాసుచే నియమింపఁబడినసైనికులు వారిని నిరోధించిరి. అప్పుడు వారికిని వీరికినిఁ బోరయ్యెను. ఆనలుగురుబాటసారులలో ముగ్వురు మరణించిరి. తక్కినవాఁ డొక్కఁడెట్టులనో తప్పించుకొని పాఱిపోయెను.

మఱునాఁడు మౌహూర్తికుఁడుచెప్పినట్లు రెండుపక్షములవారును నొకటిగఁగలసి యజ్మీరునకు వెడలిరి. వారు బయలుదేరుటకుముందు దుర్గా

దా నక్బరును సమీపించి యేదో యొకనెపమున నాతాత్కాలికముగ సెలవిప్పుం డని చెప్పెను. వెంటనే సేనకుఁ డొకఁడు జ్యోతిష్కుని గొనివచ్చుటకు వెడలెను. మఱికొంతసేపటికి వాఁడరుదెంచి "మహాప్రభూ! మౌహూర్తికుఁడు గానరాలేదు. ఆతనికొఱకు కన్నిచోటులందును వెదకితిని. జాడయే కానరాదయ్యె"నని తెల్పెను. ఆమాటలు వినఁగనే యక్బరుమోమున నాశ్చర్యభయంబు లొక్కుమ్మడి గన్పట్టెను. అక్బరుమోమునఁ గన్పట్టిన యాందోళనము దుర్గాదాసుకన్నుల నేమఱింపఁ జాలదయ్యెను. తక్షణమే దుర్గాదాసునకు సంశయము మఱింత హెచ్చెను. కాని యాతనియనుమానము నిర్హేతుకమని యాతఁ డెఱుంగఁ జాలఁ డయ్యెను. తుద కాతఁడు సంశయములనెల్ల మనమునందునే గుప్తంబు గావించుకొని తనసైన్యమును జాగ్రత్తగనుండఁ బంచి జాగరూకుఁడై ప్రయాణముఁ జేయుచుండెను.

మాయావినగు గణపం డారాత్రి దైవయోగంబునఁ దప్పించుకొని మఱునాఁటిసాయంకాలమున కశ్మీరుఁ జేరెను. వెంటనే యాతఁడు చక్రవర్తి యుండుకోటను వెదకెను. బహుప్రయాసమున నాతఁడు కోటలోనికిఁ బ్రవేశించి, చక్రవర్తిని సమీపించుసమయమునకుఁ జక్రవర్తి రాజప్రాసాదసమీపమునందుండు 'బిసల్ జలప్', అనుసరోవరతీరంబున విహరింపుచుండెను. ఆద్వారజ్ఞుఁడు కడుఁగష్టంబున రాజసన్నిధిఁ జేరి వినయంబున సలాము లాచరించి, తానువచ్చినవృత్తాంతంబంతయుఁ బూసఁగ్రుచ్చినవిధంబునఁ దెలియఁ బఱచెను. అప్పలుక్కులాలించి యౌరంగజేబు నిర్విణ్ణుఁడై పోయెను. కొంతసేపటికి కాతఁడు తెప్పిరిలి మౌహూర్తికునకు బహుమానము లొసంగి పంపివేసెను.

ఔరంగజేబు సామాన్యుఁడుగాఁడు. కడుఁజతురుఁడే; కాని దుర్గాదాసున్నను, శివాజీయన్నను, నాతనికిఁ గడుభీతి. ఆతనియొద్ద నారాజపుత్రమహారాష్ట్రనాయకులచిత్రపటంబులు రెండుండెను. కృపాణపాణులై యశ్వంబు నధిరోహించి సంగరరంగంబున మూర్తీభవించిన శౌర్యంబుచందంబుననున్న

దుర్గాదాసు చిత్రంబుగా నావి యెప్పుడప్పు డాతఁడు భయపడి పెగా త్రుళ్లిపడె
“కటకటా! యీదుర్గాదాసు నాపాలిటిధూమకేతువై జనించినట్టుఁ దోఁచు
చున్నాఁడు. వీనిని జయించుట దుస్సాధ్యముగ నున్న” దని తలంచుచుండు
వాఁడు. ప్రస్తుత మీ తానాపదసంబుధి దాఁటు టెట్టులని తీవ్రముగఁ జిం
తింపఁబోడఁగెను. తుట్టతుద కాతని కొక యూహ తోఁచెను. వెంటనే యాతఁ
డొకలేఖను వ్రాసి, యద్దాని నొక యాంతరంగికసేవకుని కొసఁగి రహస్య
ముగ నాతని కెద్దియో తెల్పి, ‘నీకుఁదగిన బహుమతి నొసంగెద. కార్యము జాగ్ర
త్తగ నెఱవేర్చిరమ్మని, చెప్పిపంపెను.

దుర్గాదాసు తనతమ్ముఁడగు సోనింగుశిబిరమునను వెడలివచ్చియుండి రాత్రి
పదిగంటలకుఁ దనశిబిరమునకు విచ్చేసెను. అతఁ డొకయాసనమున నాసీ
నుడై యేమియో యాలోచించుచు నొక్కపరి యిటునటుఁ బరికించెను.
దీపప్రవెలుతురులో నాతని కెద్దియో కాగిత మొకటి కాన్పించెను. వెంటనే
యాతఁ డద్దానిం గైకొని చూడ, దానిపై నక్బరువిలాసము వ్రాయఁబడి
యుండెను. చక్రవర్తిముద్ర సైతము వేయఁబడియుండెను. ఆలేఖనుఁ జూడ
గనే దుర్గాదాసు మానసమునం దనేకయూహ లంకురించెను. “అహా! అక్బరు
వర్తనమంతయుఁ జిత్రముగఁ దోఁచుచున్నదే! ఈలా విచ్చటనుంచుటకుఁ
గారణ మేమి? యక్బరిచ్చటికి వచ్చియుండినపు డిద్దాని మఱచి వైచియుండ
నోపు. నే నాతని కిద్దానిఁ బంపుదునా?—కానిమ్ము. దీనిఁ జదివి చూచెద,”
నని తలఁచి యాతఁ డాలేఖను జదువ, “మోసము- మోసము” అనెడి
వాక్యము లాతనినోటినుండి వెడలివచ్చెను. నిశ్చేష్టుఁ డయ్యెను. ఆతని కిప్పు
డేమిచేయవలయునను దోఁచలేదు. వెంటనే యావర్తమానమును దనతోడి
నాయకుల కెల్లను దెలియఁబలికి, భీమసింగెంత చెప్పినను వినక, మొగలులకుఁ
దెలియకుండ దుర్గాదాసు నడురేయి తామువచ్చినమార్గంబుఁ బట్టి యెల్లరాజ
పుత్రులతోఁ జనెను.

తెల్లవారుచుండగనే యక్బరు లేచి కాలకృత్యములఁదీర్చుకొని వచ్చునప్పటికి
రాజపుత్రులు లేరనియు వారెప్పు డెచ్చటి కెందులకు వెడలినది తెలియలేద
నియును వినవచ్చెను. ఆపలుకు లాలించిన వెంటనే మోము వివర్ణత నొందెను.
అక్బరుహృదయసంకటంబు లొక్కుమ్మడి నాతని నావరించెను. తర్వాతఁ గొంత
సేపటికాతఁడు దేవు నుద్దేశించి, "ఓ స్వామీ! దైవమా! నాయట్టి యదృష్టహీను
నెందులకు సృజించితివి? రాజపుత్రులు విశ్వాసపాత్రులని నమ్మియుంటిని.
కాని ద్రోహము చేయుదురని కలనైనఁ దలంపనైతిని. నాజీవిత మింతటితో
ముగిసినది. జ్యోతిష్కుఁడు పలికిన హాస్యాస్పదమును, చక్రవర్తికిఁ జెప్పి
యుంచెనువారేమి?" యని పరిపరివిధంబుల మనంబునం బొగిలి తుట్టతుద
కెట్టులో ధైర్యంబు గొంత తెచ్చుకొని సర్వసైన్యంబును రావించి వారి కిట్ల
నియె.

"సైనికులారా! మన ప్రయత్నము లన్నియు విఫలము లైనవి. రాజ
పుత్రులు మనలవిడిచి చనిరి. కారణ మేమియో నాకుఁ దెలియదు. ఇంతకును
నాదురదృష్ట మిట్లుండ వారి నెందులకు నిందింపవలయును? నాజీవిత
సౌఖ్యంబుల కన్నింటికిని నేటితో సెలవొసంగుచున్నాను. నాయాశలన్నియు
పడుగంటినవి. మీరిదివరకు నాయందు శ్రద్ధాభక్తులు గలిగి సేవించినందుల కేను
మీకెల్లరకును కృతజ్ఞుఁడను. మీరింక మీమీగృహంబులకు వెడలి సుఖంబుఁ
గాలంబుఁ గడపుకొనుఁడు లేదా! యదృష్టవంతుఁడైన మఱియొక దండనాయ
కుని సేవింపుఁడు. మీఋణము దీర్చుకొనఁజాలనైతిని. ఇఁకమీఁదనైన
దేవుఁడు మీకు సౌఖ్యంబు లొసఁగునుగాక!" అని మోము చింతాక్రాంత
ముగా నేత్రములనుండి కన్నీరు గార మాటాడెను.

తమప్రభువగు సుల్తానక్బరు పలుకులను విన్న యాసైనికుల నేత్రము
లశ్రుపూరితము లయ్యెను. చాలమంది యాతనివిడిచిపోవఁ గాళ్లు రావయ్యెను.
తుట్టతుదకు వారెల్ల రారాపొమ్మనని యనుజ్ఞఁగొని తమతమ నెలవులకుం బోయిరి.
అక్బరు నంగరక్షకదళములోని వేయిమందిరౌతులు మాత్రము మిగిలిరి. వారక్బ

డును విడువఁజాలక యతనితోడిదె తమకు లోకమని చెంచి నిలిచిరి. అప్పు డక్బరు కుటుంబపరివారసమేతుఁడై తామిదివఱకు వచ్చినత్రోవను బట్టి పోయెను. సాయంకాలమున నాతఁడు తన్ను విడిపించిన రాజపుత్రులను సమీపించి తనవిషాదభరితంబగుకథ నెఱింగించి తానకల్మషుఁడని సోదరుఁ, నన్ను నా పర కుటుంబమును రక్షింపవలయుననియుఁ, దన్ను వారు మోసగించి విడిచివచ్చి నందుల కేమికారణమో తెలియఁబల్కవలయుననియు వారిని వేఁడికొనెను.

అప్పటి యక్బరుస్థితినిఁ జూచి రాజపుత్రులప్పు [illegible] కరఁగి పోయెను. అక్బరు నిష్కల్మషుఁడని వారప్పుడెఱింగిరి. [illegible] వారే నిందించుకొనిరి. కార్యము మించినపిదప వగచిన నేమి ప్రయోజనము! అప్పుడు దుర్గాదాసక్బరు నూరడించుచు నిట్లు పలికెను. "మహాశయా! మాయవివేకమునకును నాతురతకును గడుంగడు వగచుచున్నాము. నష్ట[illegible] లకు మీ కష్టములు సంప్రాప్తములయ్యెను. మీరాగ్రహింపరాదు. మీరు పంపినట్టి యుండిన జాబును జూచిన నెవ్వఁడను మానింప నేరఁడు. మారు తెల్పుఁ" డని యాలేఖ నతని కందించెను.

తనతండ్రి తనకుత్తరము వ్రాయుట యక్బరున కాశ్చర్యమైనది. పాప మాతఁడాయుత్తరమును గాంచి నిర్విణ్ణుఁడై, కడగడు చేతులతో నద్దానిఁ గొని విప్పి యిట్లు జదువఁదొడఁగెను. "సుల్తానక్బరు నకు—నిరాశ ప్రేమ చేయునాశీర్వచనములు. నీవు కడుఁజతురుఁడవని నే నిప్పు డెఱింగితిని. నీ తెలివి తేటలకు, యుక్తాయుక్తపరిజ్ఞానమునకుఁ గడుంగడు సంతసించుచున్నాను. దుర్ఘటంబగుకార్యంబు నొక్కత్రుటిలో నెఱవేర్పఁగలిగితివి. భళి! భళీ! చక్కని పన్నాగమునే పన్నితివి. కేవటిదినమునకు నీవు వారినిఁ గొనివచ్చినపాటనే మనయిరువురిబలంబులఁ జేర్చి యామదాంధులగు రాజపుత్రుల జుట్టుముట్టి చిత్రవధగావింతము. వారిలో నొక్కరుఁడైనఁ బోసియుఁ బలుడు. సఫలా! నీ ప్రజ్ఞాతిశయ మద్వితీయము. సెబాస్! ఒక్కప్రేటున సంఘటించు గాఢుల హరింపఁగల్గితివి. శక్తిసామర్థ్యములు గలపుత్రుని గాంచినందుల కెంతయు సంతసించుచున్నాను. దేవుఁడు నీకు మేలొనగూర్చుఁగాక!"

ఆ లేఖను జదివినవెంటనే యక్బరొందిన యాశ్చర్య మింతింత యనరాదు. తుదకాతఁ డొక వేఁడినిట్టూర్పుఁ బుచ్చి "దుర్గాదాస్! చూచితిరా? యౌరంగజేబు ప్రజ్ఞావిశేషము. ఇదియంతయు నాశనితంత్రమే. మీఁదు మిక్కిలి నాయదృష్టమే దీనికిఁ గారణము. ప్రతిమానవుఁడు వానివాని కర్మ ననుభవింపవలసినదే గదా? ఇపుడు చింతించిన నేమిప్రయోజన" మని నుడివి యూరకే వదనుఁడయ్యెను.

అక్బరు దీనావస్థనుగాంచి దుర్గాదాసు భీమసింగుల హృదయములు నవనీతమువలెఁ గఱఁగెను. వా రాతనిం గాంచి "మాపొరపాటునకు క్షమింపుఁడు. వీలుండిన నెన్నటికైన మిమ్ము మయూరసింహాసనాసీనుం జేయ సిద్ధముగ నున్నారము. తప్పక మిమ్మే చక్రవర్తిఁ జేసెదము. మీరందులకు సంశయింపఁబని లేదు. మీరిప్పుడు చక్రవర్తిగారికి భయపడవలదు. మామేనఁ బ్రాణములుండు నంతవఱకు మీకే విపత్తును గలుగనీయము. ఆటంకములు గాని యవమానములు గాని లేక మాయింట సత్కృతులై యుండుఁడు. మీ కేలోటయునుఁ గలుగనీయము. మామాటల నమ్ముఁడని వచించిరి.

అక్బ రాపలుకు లాలించి "దుర్గాదాసు భీమసింహులారా! మీయాదార్యమున కే నెంతయు సంతసించితిని. కృతజ్ఞుఁడను. నేనీదేశంబున నింకఁ గొంతకాలమైన నుండఁజాలను. నే నిచ్చట నున్న నాతండ్రి యెట్టులనైన నన్నుఁబట్టి హింసించును. నేఁటితో నాయాశలన్నియుఁ బంచబంగాళమైనవి. రాజ్యకాంక్ష గగనకుసుమమైనది. భోగములు కలలోఁగన్నవాని చందమైనవి. నే నిప్పు డాతనినుండి తప్పించుకొన్న నంతియె చాలును. కుటుంబపరివార సహితుండనై పర్షియాకుఁ బాఱిపోవఁదలఁచి యున్నాఁడ" ననెను.

అందులకు దుర్గాదా సిట్టులనియెను. "సుల్తాన్ మహాశయా! చక్రవర్తి వలని భయంబు విడనాడుఁడు. నాప్రాణములనైన నర్పించి మిమ్ము రక్షించెద. మీకోరిక మేరకే మిమ్ము నిరపాయముగ పర్షియాకుఁ బంపెదను. చింతింపకుఁడు." దుర్గాదాసు మాటలను విని యక్బ రొక్కింత శాంతిఁ జెందెను. ఇంతలోఁ గుంభాకొమనునుండి, రాణాదేహస్థితి యపాయకరముగ నున్నదని

ఖార్ వరుఘా నాగ్రహమునొంది, తాను బంధింపఁబడకమునుపే, యక్బరును బంధింపఁ జక్రవర్తిసేనను బంపుచున్నాఁడనియు నాలసింపక పాఱిపొమ్మనియు నక్బరునకు వర్తమాన మంపెను.

అక్బరును జెఱపట్టుట కమితసైన్యము వచ్చుచున్నదని దుర్గాదాసునకుఁ దెలియవచ్చెను. ప్రస్తుతము రాణారాజసింహుఁ డపాయస్థితియందుండుటచే నాతఁడేమియు సహాయ మాచరించుటకు వీలుండదని యెంచి దుర్గాదాసు, రాజ్యవిషయములనెల్లఁ దమ్మునిపై నునిచి వేయిమందిరౌతులను గొని చక్రవర్తిసైన్యము రాకమునుపే యక్బరును స్వయముగ సూరతునకుఁ గొంపోవఁ దలఁచి ప్రయాణ మయ్యెను. మార్గమధ్యమునఁ దెక్కిఁడుములఁబడుచు వారు నడచుచుండిరి. చక్రవర్తిసైన్యములు వారి సన్నిధిశలనుండి యాక్రమించెను. అప్పుడు దుర్గాదాసు తటాలునఁ దనమార్గంబుమార్చి దుర్గంబులగు నరణ్యమార్గంబులంబడి పోయిపోయి, కొన్నిదినములకు సూరతునుఁ జేరెను. చక్రవర్తి దుర్గాదాసును జయింపఁజాలక నానుపాయంబులఁ దనకోర్కెను దీర్చికొనఁదలంచి యొక్కసేవకుని వెంట నలుబదివేలబంగరునాణెములఁ బంపి యాద్రవ్యమునుగొని యక్బరును దనయధీనము సేయుమని దుర్గాదాసునకు వర్తమాన మంపెను. మొదట దుర్గాదాసా ద్రవ్యమును నిరాకరింపఁ దలఁచెను గాని మఱుక్షణమున నే యాతని కొకయూహకలిగి ద్రవ్యమునుగొని చక్రవర్తి యాజ్ఞమేరకే చేసెదనని చెప్పి సేవకునిఁ బంపివేసెను. తర్వాత నాతఁ డక్బరును సమీపించి, "అక్బరుమహాశయా! మాచిలిరా! మీ తండ్రిగారికి గల పుత్రవాత్సల్యము; నౌదార్యము. మీకొఱకై నలుబదివేలబంగరు నాణెములఁ బంపియున్నాఁడు. ఈ ద్రవ్యముచే విదేశములందు మీరు సుఖింపవచ్చును." అని జరిగినవిషయముల నెల్లఁ జెప్పి ద్రవ్య మొసంగెను. అక్బరటనుండి పడవనెక్కి పర్షియాకు బయలుదేరెను. చక్రవర్తిమాత్రము విఫలమనోరథుఁ డయ్యెను. అక్బరును రక్షించి రాజపుత్రులు సమకులగౌరవాదుల నిలుపఁబెట్టుకొనిరి.

---

# ఇరువదియాఱవ ప్రకరణము.

---

## సంధి

రాణా రాజసింహుని యారోగ్యము క్రమక్రమముగ క్షీణింపఁదొడ
గెను. పలుమాఱు విడిచివచ్చెడి జ్వరముచేతను, గతయుద్ధమునఁ దగిలిన గాయ
ములచేతను. రాజ్యాంగవిషయములనుగుఱించిన మనోవ్యథచేతను నాతని
బలారోగ్యములు చాలవఱకు నశించెను. తనతండ్రిస్థితినిఁజూచి భీమసింగు
పొందినశోకమునకు మేరలేదు. రాజవైద్యు లెన్నివిధములఁ జికిత్సలు చేసినను
నిష్ఫలము లగుచుండెను. ఈశ్వరువిషయమునఁ జేసిన ప్రయత్నము విఫలమగుట
విని రాణా యొకపెద్దనిట్టూర్పుఁ బుచ్చెను. ప్రస్తుతము చక్రవర్తి మేవారు
తోడియుద్ధమును, బూర్తిగ నాపివేయవలసివచ్చెను. ఈవార్త రాణాకుఁ
గొంతహృదయశాంతినిఁ జేకూర్చెను. వెంటనే యాతఁడు జయసింగును రణ
రంగమునుండి మరలిరమ్మని వార్త నంపెను.

రాణామనమున నొకదారుణవ్యథ ప్రబలుచుండెను. అదేమనఁ? దన
యనంతరము కొమరులిరువురు రాజ్యాభిలాషచే నొకరితో నొకరు పోరాడుదు
రేమో యనువిషయమే. జయసింగు రాజ్యమునకు హక్కుదారుఁడు. అతఁడు
భీమసింగునంతటి గట్టివాఁడు కాఁడు. భీమసింగు చతురుఁ డగుటయే గాక సాహస
కృత్యములచేతను సుగుణసంపత్తిచేతను నెల్లరమనంబుల నాకర్షించెను. ఒక
వేళ నాతఁడు రాజ్యకాంక్షచే సహోదరున కేమైన నపకార మాచరించు
నేమో యని రాణా తలంచుచుండెను. ఒక్కొక్కపఱి జయసింగున కాతఁడు
భీమసింగుపెడ భ్రాతృవాత్సల్యంబుతోడను, న్యాయవిచక్షణతోడను,
బ్రవర్తింపుమని తెల్పుచుండెను. రహస్యముగ వారిరువురమనోవృత్తుల

నాతఁడు గమనింపఁ దొడఁగెను. కొంతకాలమున కాయిరువురన్నదమ్ము లన్యోన్యమైత్రిఁగలిగి యుండుటయు, విశేషించి భీమసింగు తనయగ్రజునియెడ బ్రవర్తించువిధమును, రాణా గ్రహించి సంతోషించెను. భీమసింహునకుఁ దన యన్నతోడివిరోధము గాని, తండ్రియనంతరము రాజ్యమును జేకొనవలయునని గాని కోరికలేదు.

పరిస్థితు లిట్లుండ సారంగజేబునకు విశ్వాసపాత్రుండును సామంతుం డును, నగు రాజాషయముసింగు చక్రవర్తిసెలవుగొని తనదేశమున కరు దెంచుచుండి యకస్మాత్తుగఁ 'గుంభాల్మరు' నకు విచ్చేసెను. రాజసింహుఁడు థాకూరు మొదలగువా రాతనికి సగౌరవంబుగ స్వాగత మొసంగిరి. పూర్వ పరిచితులగు భీమసింగు షయముసింగు లొకరి నొకరు కుశలప్రశ్నగావించు కొనిరి. షయముసింగు భీమసింహు తెలివితేటలకుఁ జాల మెచ్చుకొనెను.

ఒకనాఁడు రాజాషయముసింగును, రాణా రాజసింహుఁడును మాటాడు చుండఁ బ్రస్తావవశముగ, షయముసింగు రాణాతో నిట్లు లనియెను. "మహా శయా! మీ రుభయపక్షములవారును లేనిపోనియుద్ధములఁ గల్పించుకొని దేశ క్షోభమును గలుగఁజేయుటకంటె, నన్యోన్యస్నేహంబున నుండుట మంచిది. సంధికుదిరినఁ జక్కఁగ నుండును. మీరు సంధికొప్పుకొనుట కిష్టపడిన నే నెటు లైనఁజేసి చక్రవర్తిగారి నందుల కొడంబఱచెదను. ఇందులకు మీయుద్దేశ్య మేదియో తెల్పుఁడు. ఇంతియెగాక మీనియమము లెవ్వియో? తెలియఁ బల్కుఁడు." అందులకు రాణా, తనకుఁ గొంతదేహస్వస్థత కుదురఁగనే యుంద యనగరమునకు వెడలి యచ్చట సర్వవిషయముల జర్చించి నిర్ణయింతమని బదులుసెప్పెను.

రాణాకుఁ గొంతదేహస్థితి కుదురఁగనే యాతఁడు పుత్రమిత్రామాత్య పరివృతుండై, థాకూరుయొద్దను, నతనికొమార్తెయొద్దను సెలవుగొని ప్రయా ణమై కతిపయదినంబుల కుదయనగరంబుఁ బ్రవేశించెను. ఉదయనగరమును

గమనంబాచరించిరి. జయసింగు తల్లులకుఁ దండ్రికి నగ్నిసంస్కారాది పరలోక క్రియలు విధ్యుక్తముగ నాచరించెను.

రాజసింహుని మరణానంతరము, జయసింగు రాజుగావలసివచ్చెను. అతనిపట్టాభిషేకమహోత్సవమును, వీక్షింప సర్వసామంతులును గ్రామపత్తనంబులందలి ప్రజలును విచ్చేసిరి. కాని యాసమయమున జోధ్పురమహారాణి తన యింట నుండుటం జేసి థాకూ రామెనువిడిచి పట్టాభిషేకమహోత్సవమునకు రాఁజాలఁడయ్యెను. పట్టాభిషేకమహోత్సవము జయప్రదముగ జరుపఁబడెను. జయసింగు, తమ్ముఁడగుభీమసింగును, దనపార్శ్వమునఁ గూర్చుండనియోగించి తగురీతి గౌరవించెను. తనతలిదండ్రులు పోయినందులకు భీమసింగు చాలఁ జింతిల్లుచుండెను. భీమసింగు స్వేచ్ఛాలోలుఁ డగుటచేఁ, దనయన్న యాస్థానమున నుండునంతవఱకు నాతనికి సంపూర్ణస్వాతంత్ర్యముండదని తలంచుచుండెను. రాజ్యములోని కొంతభాగమును నొకబలమైనకోటను దనకొసంగినఁ జాలునని యాతఁ డెంచియుండెను. జయసింగాతని మనోభావములను గ్రహించి గోకులదాసురాజ్యము నాతని కొసంగి నాఁడే యాతని నొక సామంతరాజుగఁ జేసి రాజ్యాభిషిక్తునిఁ జేసెను.

మఱునాఁడే భీమసింగు, సోదరుని యనుజ్ఞగొని, తనరాజధానికి వెడలి పోయెను. అతఁ డప్పు డుత్సాహపూరితుండై యుండెను. అంబాలికాసుందర వదనారవింద మాతని నేత్రవీథిఁ బొడగట్టుచుండెను. అంబాలిక నప్పుడే వివాహమాడినట్లును, బ్రపంచమున నందఱికంటె నెక్కుడదృష్టవంతుఁడై నట్లును, దలంచుకొనుచుఁ దన కట్టికాంతారత్నంబును, బ్రసాదించినందులకు భగవంతుని గొనియాడుచు, నంబాలికాదర్శనలాలసమానసుండై లోనొక్కనాఁడు బ్రయాణము సల్పుచుండెను.

జయసింగు రాజుకాఁగనే, మరల సంధివిషయమై రాజాపయామునసింగుతో సంప్రదించెను. కొన్నితర్కవితర్కములమీఁదట నిరువురుఁ

గొన్ని నియమముల కొడఁబడెను. ఔరంగజేబు కూడ నయమునకు గొప్పగాని వచ్చినదాని కొప్పుకొని, యీనియమపత్రికయందుఁ జేవ్రాలొనర్చెను. నియమ ప్రకారము చిత్తూరుకోట రాజపుత్రులవశ మయ్యెను. అదిగాక హిందూదేవాలయములఁబడగొట్టి యాస్థలములందుఁగట్టిన మసీదుల నేమి చేయఁగూడదనియు, నికమీఁద దేవళంబులఁగాని దేవతావిగ్రహంబులఁగాని నిర్మూలింపఁ గూడదనియు, జస్వంతసింగునిరాజ్యము నాతనికొమరుఁడైన యజితసింహున కొసంగవలయుననియు, నప్పటినుండి మేవారురాణా, చక్రవర్తికి యుద్ధసమయములందుఁ గొంతసైన్యమును బంపుకొనవలయుననియుఁ బ్రజలపై నిర్హేతుక పన్నుల విధింపఁ గూడదనియుఁ, దీర్మానింపఁబడియెను.

---

# ఇరువదియేడవ ప్రకరణము



## స్థిరసంకల్పము

మేవారురాజ్యమునకుఁ జేరిన సంస్థానములలో 'బెడ్నరు' అనునది యొకటి. దానికి మనకథాకాలంబున రావుకేసరిసింగను రాజపుత్రప్రభుఁడు రాజై యుండెను. ఆతనికి దాదాపు ముప్పదియేఁడు లుండవచ్చును. అతఁడు రాణావంశమునకుఁ జేరినవాఁడు. రూపవంతుఁడు. బలవంతుఁడు. ఆతనికి రూపవిద్యాగుణంబులసమానయు ననుకూలవతియు నగు భార్యాలలామం బుండెను. కాని పాపమాదంపతులు చిరకాలసౌఖ్యం బనుభవింప నోఁచుకొనలేదు. వివాహమాడిన కొద్దికాలమునకే, యాబాలలలామ చూలాలై యొకశిశువును బ్రసవించి కొద్దికాలమునకే పరలోకమునకుఁ వెడలెను. అనుకూలవతియగు భార్యారత్నంబు గతించినందులకుఁ జింతాక్రాంతుఁడై యిఁకముం దట్టియర్ధాంగినిఁ బడయుట కడుదుర్లభంబని యెంచి, రెండవవివాహమాడనని యాతఁడు పంతముఁబట్టియుండెను. అటులనే నాలుగైదుసంవత్సరములు గడచిపోయెను.

ఇట్లుండ నొకనాఁ డాతఁడు మహారాణిని సందర్శింప నేఁగియుండెను. ఆసమయమునం దొక్కపరి యకస్మాత్తుగ నంబాలిక నాతఁడు చూడఁ దటస్థించెను. అంబాలిక లావణ్యతారుణ్యవిలాసంబులం గాంచి యాతఁ డాశ్చర్యానందంబుల మునింగెను. వెంటనే యాతనిమానసమునఁ బ్రేమాంకుర ముద్భవించెను. ఆమఱుక్షణమునసే యాతనిప్రతిజ్ఞ పలాయనమంత్రమును బఠించెను. మానసము కాంతాసక్తమయ్యెను. ఆసుందరాంగిని బడయఁగల

జరిపింప సంకల్పించియున్నాఁడు. కాన మీరన్యథా తలంపక నియమిత దినమునకు మిత్రబాంధవపరివారపరివృతులరై కుంభాల్మరునకు విచ్చేయ వలయును.

ఇట్లు,
జోధ్పురమహారాణి.

పైలేఖ నెఱింగి రావుకేసరిసింగు జయసింగుపట్టాభిషేకమునకు పిదప పట్టాభిషేకమైనమఱునాఁడే కొన్ని త్రొందఱకార్యము లున్నవనియుం వెంటనే వెడలవలయుననియుఁ జెప్పి జయసింగునొద్ద ననుజ్ఞఁగొని మితపరివారుండై తనవివాహవిషయము వెల్లడింపక యతివేగంబునఁ గుంభాల్మరునకుఁ బయన మయ్యెను.

కుంభాల్మరునందు, జక్కఁగ నలంకరింపఁబడిన గదియందు లావణ్య ఖనియగు నొక్కకన్యకారత్నం బొకమృదుతల్పంబునఁ గూర్చుండి యేలకో? చింతిల్లుచు నిట్లు తలపోయసాగెను.

“అయ్యో! దైవమా! నన్నేల పుట్టించితివి? ఆసుందరాకారుని ముందు నాకేల మరులుగొల్పితివి? మరులుగొల్పితివి పో! నాకోరిక నెందులకు సాఫల్యము నొందింప వైతివి? —హా! హతవిధీ! ముదుసలివైనందున నీమతి పోయినది కాఁబోలును. ప్రాణులఁ బుట్టించి, వారు కష్టపడుచుండఁ జూచి నవ్వుచుంటివా?—

ఏముహూర్తమున నే నాతనిఁ గాంచితినో గాని నామనం బంతయుం నాతని యధీన మయ్యెను. నా కాతనియందుఁగల ప్రేమ ద్యోతకమగునట్టు నటించినను, నాప్రేమ నాతఁడు గ్రహింపఁజాలఁ డయ్యెను. అతనిమనం బన్య కాంతాసక్తంబై యున్నది. నే నిప్పుడేమిచేయఁగలను?—హా!—రాజస్థానము!—నారూపము! నాసౌశీల్యాదిసుగుణంబులు! తుదకడవిగాచిన వెన్నెల చందమయ్యెనుగదా? నాజీవితము నిరర్థకమయ్యెనే!—ప్రాణములభరించి

నిష్ఫలమగు నీబ్రతుకు బ్రతుకుటయా? లేక యాత్మహత్య గావించుకొని తన్మూ లంబున రౌరవాదినరకంబుల ననుభవించుటయా?-ఇం దేది శరణ్యము?— ప్రస్తుతము ప్రాణములనిలిపిన నైహికసుఖంబులు లేకపోవును. ప్రాణంబులం దొఱంగిన నిహపరసుఖంబులు రెండును లేకపోవునుగదా?—ఛీ! అస్థైర్యమా! నన్ను వీడిపొమ్ము. ఈతూరి ప్రయత్నించి చూచెదను. సమయము గనిపెట్టి యాతనికి నామనోవృత్తి నెల్లం దేటతెల్లముగ నెఱింగించి యాతని చరణం బుల వ్రాలి నామనోభీష్టంబు నెఱవేర్పుండని ప్రార్థించెద. పురుషపశువులు నూతనప్రియులుగారె? వారిమనంబులు క్షణక్షణంబునకు మారుచుండునుగదా? కావున నే నెట్టులైన నాతని బతిగాం బడయంగలను. కానిమ్ము. మనో వాక్కాయకర్మంబుల నా కాతండే ప్రాణప్రియుండు. అతనిం దప్ప దేవేంద్రు నంతటివానినైనం జేపట్టను. ఒకవేళ నన్నాతండు నిరసించినను నేనుమాత్ర మాతని దివ్యనామమును జపించుచు వీలున్న పాదదాసినై యాతని దివ్యమంగళ విగ్రహమును, కనులారం గాంచుచుం గాలముగడపెద."

అని తలపోయుచుండ గదితలుపులు తట్టినట్లయ్యెను. ఆధ్వనివిని యామె 'యెవరక్కడ' నని ప్రశ్నించెను. "అక్కా! తలుపుతీయుము" యనెడి వాక్కులు వినవచ్చెను. తత్క్షణమే యామె తలుపుందెఱచెను. ఒక్కసుందరాంగి మందగమనంబున లోనికిం బ్రవేశించెను. ఇరువురు నొక్కతల్పమునం దాసీనులైరి. అప్పు డానూతనస్త్రీ యామెను ప్రేమమీఱ గ్రుచ్చి కౌఁగిలించు కొని "అమ్మా! అంబాలికా! యేల యిటు లస్వస్థతగ శోకించుచుంటివి? కార ణం బెద్దియో తెల్పుమని" యడిగెను. అంత నంబాలిక యిట్లనియెను.

అంబాలిక:— అక్కా! ప్రేమా! సర్వమెఱింగియుం నేమియు నెఱుంగని దానివలె నిట్లడుగుచుంటి వేల?

ప్రేమా:—అంబాలికా! నీవుచెప్పునది వింతగనున్నది! నీమనసునందలి విష యమును నే నెట్టెఱుంగంగలను? విషయ మేమిటో సక్రమముగం దెల్పుము.

అంబా:—వేఱువిషయ మేమున్నది? నావివాహవిషయమే.

ప్రేమా:—ఓహో! నీవివాహవిషయమా! రెండుదినములేగదా యనున్నది. రేపు నాన్నగారుసింహగుప్తుడు వచ్చునని వింటిని.

అంబా:—(వ్యసనమున) అక్కా! ప్రేమా! నిక్కముగ జెప్పుచున్నాను వినుము. ఈవివాహమునందు నా కిసుమంతయేని యిష్టములేదుసుమా! ఇదివఱకే నామనంబు భీమసింగునియందుం జిక్కినది. అతనిఁ దప్ప మఱి యొకనిని వరింపఁజాలను. నాయభిమతమును రాణిగారి కెఱింగించుండి రనియే యనుంటిని. కాని యామె గ్రహించియుండలేదు. కాన రావుకేసరి సింగునకు నన్నంటఁగట్టనున్నది. నా యీకార్యమును మహారాణి కెఱింగింప సాహసింపఁజాలకున్నాను. ప్రియుం డిన్వి డెచ్చటనుండునదియుఁ గూడ నే నెఱుంగను. తల్లిదండ్రులు లేని యనదను. నన్నీవిపత్సముద్రము నుండి రక్షింప వేడుచున్నాను. నన్నిప్పుడు రక్షించువారు నీకంటె మఱి వ్వరును లేరు. సోదరీ! ప్రేమా! నీవు నిశ్చయముగ ప్రేమస్వరూపిణివి. రక్షింపుము. నీమే లెన్నటికిని మఱువఁజాలను.

ప్రేమా:—అమ్మా! అంబాలికా! నీ వెందులకుఁ జింతిల్లెదవు? శోకింపకుము. నాచేత నైనంతసాయముఁ జేసెదను. నాకొక్కయూహ తోఁచుచున్నది. నీ వట్లుచేసెదవా?

అంబా:—అక్కా! నీ వెట్లుచేయుమన్న నట్లుచేసెదను.

ప్రేమా:—అటులైన వినుము. వివాహమునకుముందు నాఁటిసాయంత్రము నీవు మహారాణి యాజ్ఞనుగొని, యికోట బాహ్యప్రదేశంబునంగల దుర్గాలయంబునకు నద్దేవి నారాధించునెపంబునఁ బొమ్ము. అత్తఱి నీప్రియుఁడు నిన్నుఁగలసికొని, నిన్నుఁ గొంపోవఁగలఁడు. నీ పీవర్తమానమును గడురహస్యముగ నుంచవలయును సుమా.

అంబా:—సోదరీ! నే నట్లు పాఱిపోయిన రాణిగారు కోపింతురేమో యని విచారించుచున్నాను.

ప్రేమ:—అంబాలికా! నీ వావిషయమున నేమియుఁ దలంపవలదు. సర్వ
విషయముల నేఁజక్కఁబఱచెదను. నీవు చింతఁదక్కియుండుము.

ఆమాటలు విని యంబాలిక, నేత్రముల నానందాశ్రులురాలఁ బ్రేమా
బాయిని గౌఁగిలించి, "అక్కా! నీప్రేమాలాపములు న న్నీవిపత్సాగరము
నుండి దరిఁజేర్చినవి. సోదరీ! నీవు నిశ్చయముగ సార్థకనామ్నివే సుమా! నీ
ప్రేమను నే నాజన్మాంతము మఱువఁజాలను. నీవు నాపాలిటిదేవతవు. పతిభిక్ష
నిడి నన్ను రక్షించితివి. నీమేలునకే నేమి యుపకారము గావింపఁగలను?
నాయావజ్జీవము నీకుఁ గృతజ్ఞనై యుండెద. నీపవిత్రపాదపంకేరుహంబుల
కిదె యభివందనముల నర్పించెద" నని యామె భక్తిఁ బ్రణమిల్లెను. వా
రటనుండి లోనికి వెడలిరి.

అంబాలికావివాహమహోత్సవమునకై 'సంభాల్ మరు'నందు సర్వము
సంసిద్ధముగావింపఁబడెను. కోట నంతయు సర్వశోభాయమానముగ నలంకరిం
చిరి. సౌధశిఖరంబుల వివిధములగు రంగులపతాకములఁ గట్టిరి. ఎచ్చటఁజూచి
నను మంగళతోరణములు మనోహ్లాదమును గొల్పుచుండెను. రాజగృహంబున
నొకవిశాలంబగు పెండ్లిచప్పరము వేయఁబడియుండెను. జలతార్లుగల చిత్ర
విచిత్రంబులగు తెరలతోడను వివిధగతుల నమర్పఁబడిన తోరణములతోడను,
పరిమళద్రవ్యంబులతోడను, వివిధాసనంబులతోడను, నలంకరింపఁబడిన యా
వివాహమండపము నేత్రపర్వం బొనర్చుచుండెను. ఆకళ్యాణమహోత్స
వంబుఁజూడ రాజబంధువులెల్లరును దారపుత్రబంధుపరివారసహితులై వివాహ
దినంబునకు ముందునాఁడే విచ్చేసిరి.

వివాహదినమునకు ముందునాఁటిసాయంకాలమున నంబాలిక సర్వాలం
కారభూషితయై భూసురపత్నులతోఁగూడి, కులాచారప్రకారము, గౌరిని
బూజింప నక్కోటబాహ్యప్రదేశమునం గలదుర్గాలయంబునకుఁ బయనమై
పోయెను. అంబాలిక బాలేందుధరసుందరీమందిరంబుఁ బ్రవేశించి బ్రాహ్మణ
కాంతాలలామంబులు సెప్పెడువిధంబున నద్దేవి నతిభక్తిఁ బూజించి సాష్టాంగ

దండప్రణామము లాచరించి మనంబున నిట్లు ప్రార్థించె. "లోకజననీ! న న్నీవిపత్సముద్రంబునుండి యుద్ధరింపుము. భీమసింగునే భర్తగాఁ బ్రసాదింపుము. తల్లీ! శాంకరీ! ప్రియుండు శీఘ్రంబున వచ్చునట్లు చేయుము. నీచరణకమలసేవనంబును సదా సాగొనంగుము. కృపాయత్తచిత్తంబున రక్షింపుము. రక్షింపుము."

అని శాంకరిం బ్రార్థించి యాయాలయంబు నిర్గమించి భీమసింగు రాకకై ప్రతిక్షణమును నిరీక్షించుచుండెను. భీమసింగుజాడయే యామెకుఁ గాన్పింపలేదు. ఆమె మనంబునఁ దీవ్రమగు నాందోళనపడుచుండెను. ప్రియుండు తన్నుమఱచెనా? లేక యాలసించెనా? యని యామె తలపోయసాగెను. ఇంతలో సూర్యుండు గ్రుంకెను. చీకటు లెల్లెడల నావరింపఁ దొడఁగెను. అంబాలికకు నిరాశ మఱింత హెచ్చెను. కోటను సమీపించవలసి వచ్చెను. ఇంతలో నొకవ్యక్తి తటాలున నంబాలికకడ కేతెంచి నాఁడు యదుకులపుంగవుండగు కృష్ణుండు భీష్మకసుతను హైకొన్నచందంబున, నాకుసుమకోమలినిఁ దనయశ్వంబుపై నిడుకొని మఱుక్షణములో నదృశ్యుఁ డయ్యెను.

తటాలున నిట్లంబాలిక యపహరింపఁబడుటచే, బ్రాహ్మణస్త్రీలును, పక్షిజనులును నొక్కుమా రాశ్చర్యభయంబుల మునింగి వేగంబునఁబోయి రాణిగారి కీవర్తమానమెల్ల విశదంబుగఁ దెలియఁబల్కిరి. ఆమాటలువినగనే రాణి పొందినశోకరోషములు వర్ణనాతీతములు. రావుకేసరిసింగు, భీమసింగే తన కీపరాభవము గావించెనని యెఱింగి, యాతని వెన్నాడ సైనికుల నియోగింపనుండ, ఘాతూరుగోపీనాథుఁ డాతని నాపి యిట్లనియె. "మిత్రమా! భీమసింగే దీనికుఁ బోయినదియుం మనకుఁ దెలియదు. ఆతఁ డిక దొరకుట దుర్లభము. ఒక్కరహస్యమును జెప్పుచున్నానువినుము. అంబాలికాభీమసింగు లిదివఱకే యొకరినొకరు గాఢముగఁ బ్రేమించిరి. వారియన్యోన్యప్రేమ లపారములు. ఆవిషయ మేను రహస్యమున నెఱింగితిని.

అట్లు లేకయుండిన నిట్లు జరుగఁజాలదు. అంబాలిక నిన్నిసుమంత యైనఁ బ్రేమింపలేదని తేటతెల్లమగుచున్నది. నీయం దిసుమంతయేని ప్రేమ లేనికాంతను వరించి నీవేమి సుఖింపఁగలవు? ప్రేమలేనిభార్య, భార్యగాదు. అనుకూలవతి కానిభార్యను బొందినవానిజన్మము నరకతుల్యముసుమా! నీవే యాలోచింపు" మని యనేకరీతుల నీతులఁజెల్పి యాతనికోపంబు నుపశమింపఁజేసెను. థాకూరుమహారాణికిఁ జెల్పవలసినవిషయంబులనెల్లఁ జెల్పి యామె కంబాలికాభీమసింగులపై కోపంబును జల్లార్చి ప్రసన్నచిత్తను జేసెను.

---

# ఇరువదియొనిమిదవ ప్రకరణము

## ఆత్మార్పణము

భీమసింగంబాలికను గొని, వజ్రాయుధంబనుదనయశ్వంబుపై నిడుకొని యరణ్యమార్గంబున వేగంబుగఁ జనియెను. నాఁటిరేయి వెన్నెల చెన్నలరారుచుండెను. అతఁడారాత్రి కొన్నిమైళ్లవఱకుఁ బ్రయాణముచేసి యొకభిల్లగ్రామమును జేరెను. మఱునాఁడు ప్రాతఃకాలముననే లేచి యంబాలికాభీమసింగులు, కాలోచితకృత్యంబుల నిర్వర్తించుకొని, తదనంతరము ప్రయాణమై 'బికనిర్' మార్గమునఁ జనిరి. మధ్యాహ్నమునకు వారొకసరోవరతీరంబున విడిసి జలకంబులాడి యాహారమును భుజించి, గుఱ్ఱము నొకచెట్టునకుఁ గట్టివైచి, యావిశాలతరుచ్ఛాయ విశ్రమించిరి. దీర్ఘప్రయాణముచేఁ జాల నలసియుండినందున గొంతసేపటిలో వారు నిద్రించిరి.

వారు నిద్రించిన దాదాపొకగంటసేపటికొకమనుష్యునియార్తనాదము వినవచ్చెను. వారారావంబున నులికిపడి మేల్కాంచి, యేమిశబ్దమని విచారించుచుండ మరల నార్తనాదము వినవచ్చెను. వెంటనే భీమసింగు కరంబునఁ గరవాలంబుగొని యాసవ్వడివచ్చినదెసకు వేగంబునఁ బోయెను. అతఁడు కొంతదూర మరుగ నాప్రదేశంబునఁ నిరువదేండ్లబాలుఁ డొకఁడు మహావీరునితోఁ బోరుసల్పుచుండు టాతనికిఁ గానవచ్చెను. మఱియొకవీరుఁడు ప్రాణములఁ దొఱఁగి నేలఁ గూలియుండెను. ఆబాలుఁడు వెనుదీయక వీరునితోఁ బోరుసల్పుచుండెను. పోరు తీవ్రముగనే యుండెను. బాలుఁడతిచాకచక్యంబున విరోధిప్రేటులఁ దప్పించుకొని తనఖడ్గంబునఁ దుద నావీరుని డొక్కఁ జీల్చెను. వాఁడాదెబ్బఁ దిని నేలకొఱగుచుఁ గ్రోధారుణితలోచనుండై విష

పూరితంబగు కుంతంబునఁ గడపటిపో టొక్కటి పొడిచెను. ఆబల్లె మాబాలుని డొక్కను గొంచెముగఁ జీల్చికొనిపోయెను. గాయము చిన్నదైనను విషయుక్తమగుటచే నాప్రేటున కాబాలుఁడు నేల కొఱగి మూర్ఛిల్లెను.

ఇంతలో భీమసిం గాప్రదేశమును సమీపించి బాలునిం గాంచి మూర్ఛాక్రాంతుఁడయ్యెనని యెఱింగెను. స్ఫురద్రూపియగు నాబాలునిఁ జూచుకొలఁది భీమసింగున కాతనియం దొకవిధమైన ప్రేమ జనించెను. మఱియు నేలఁబడియుండినవీరులలో నొకఁడు తనకుఁ బరిచితుఁడుగఁ గన్పట్టెను. భీమసిం గాతని సమీపించి చూచి, యాశ్చర్యమున 'గోకుల్‌దా'సని యొక్కయఱ పఱచెను. అచ్చటిపరిస్థితులన్నియుం నాతని కించుకైనఁ దెలియలేదు. కాని, తత్క్షణమే సరోవరంబునకుఁ బరుగిడి, కొంతనీరమును గొనియంబాలికాయుక్తుఁడై శీఘ్రంబునవచ్చి యాబాలున కుపచారములఁ జేయఁ దొడఁగెను. "ఈకుమారుఁ డెవ్వఁడో? గోకులదా సిందుఁ జంపఁబడియుండుటకుఁ గతం బేమియో! రెండవపురుషుం డెవ్వఁడో? వీరివృత్తాంత మేమియుం దెలియకున్నదే?" యని భీమసింగు తలపోయఁజొచ్చెను. అతఁ డెంత యాలోచించినను నాతని కేమియుం దెలియకుండెను.

కొంతవడి కాబాలుఁడు మూర్ఛదేరి కనులువిచ్చి దీనాలోకనములతో వారినిరువురను జూడఁదొడఁగెను. ఆబాలునినేత్రములనుండి యశ్రుధారలు బొటబొటఁ గాఱఁజొచ్చెను. ఆతనిసుకుమారదేహము, కర్కశభూప్రదేశంబునఁ బడియుండెను. వా రాయువకుని దీనావస్థను గాంచి శోకంబున మునింగిరి. భీమసిం గాబాలునిఁ దనతొడపై నిడుకొని యుపచారములు సేయఁ గొంతసేపటికి కాబాలుఁడు తెప్పిరిల్లి కూర్చుండెను. భీమసిం గాతనితో నిట్లనియెను. "కుమారా! నీ వెవ్వండవు? నీముఖం బుపలక్షించి చూడ రాకొమరుఁడవని తోఁచెడిని. నీ వేదేశపురాకొమరుండవు? నీతలిదండ్రు లెవ్వరు? నీనామధేయం బెద్ది? ఈయరణ్యమధ్యంబున నీ విట్టిస్థితితో

యుద్ధంబుఁ జేసి తుదకిట్లగుటకుఁ గతంబేయ్యది? గోకులదా సెందులకుఁ జంపఁ బడెను? ఈరెండవవాఁ డెవ్వఁడు? సవిస్తరముగఁ దెల్పుము.

ఆపల్కు లాలించి బాలుఁడు దీనస్వరంబున, "ఆర్యపుత్రా! భీమసింగ కుమారా! నాకష్టవృత్తాంతము నడిగితిరి కానఁ దెల్పెదను వినుఁడు. నాయీ శిరస్త్రాణమును దీయుఁడు. సర్వము మీకే విశదమగును. నాకు స్పృహ మరలఁ దప్పుచున్నట్లున్నది. హా! దైవమా!—రాకుమారా!—ప్రాణములు పోవుచున్నవి.—దేహము కంప మొందుచున్నది. హా!—హా!—తాళఁ జాలను." అనిమరల మూర్ఛిల్లెను.

ఆతఁడు దన్నుఁ బేరుతో సంబోధించుటకు భీమసిం గాశ్చర్యపడుచుఁ దడబడుహస్తములతో నాబాలునిశిరస్త్రాణమును మెల్లనఁ దీసివైచెను. మఱు క్షణముననే భీమసింగును, బ్రక్కనఁగూర్చుండి చూచుచున్నయంబాలికయుం భయాశ్చర్యసంకటంబుల మునింగిరి. వారినోటినుండి "నీ-నీ-నీ-వా-నీవా-ప్రే-మా-బా-యి-"యనెడిమాటలు వచ్చెను. ఆదృశ్యమును గాంచినయం బాలిక జొటజొటఁ గన్నీరుగాఱ నొక్కపెట్టున రోదనముఁ జేయుచుఁ బ్రేమాబాయి దేహముపైఁబడి గట్టిగఁ గౌగిలించి "అక్కా! —అక్కా!—ప్రేమా!—సౌజన్యనిధీ!-తుదకు నీకింతటిదుర్దశవచ్చెనా? నిన్నటిదినముననే కదా నీసాయంబునఁ బ్రియునిఁ గలిసికొనఁగలిగితిని? ఇంతలో నింత యయ్యెఁగా? అయ్యో!-అయ్యో!-నాతో నొక్కపలుకైనఁ బలుకవా?- నీ వెంతటిపవిత్రవో? నీచరిత్ర మద్భుతముగ నున్నదే! నీ వీనిర్జనారణ్యంబున నిట్లగుటకుఁ గతంబెద్ది? నీవిషయంబువిన్న నీతండ్రి యొక్కనిమిషమైన నిలువఁగలఁడా? అక్కా! నావంక నొక్కమాఱు విలకింపుము. హాతవిధీ! నీవెంత క్రూరుండవు!— దుర్భరము!—దుర్భరము!—"అని యనేకరీతుల విలపించుచు మూర్ఛిల్లెను. ఆసమయమున భీమసింగుస్థితి యెట్లుండెనో దేవున కెఱుక.

కొంతసేపటికి భీమసింగు ధైర్యం బవలంబించి యిరువురకు నుపచారములఁజేయఁ బ్రేమాంబాలికలు కొంత తెప్పిరిల్లిరి. భీమసింగప్పుడు గద్గదకంఠుఁడై నయనములనుండి తొరఁగు కన్నీటినిఁ దుడుచుకొనుచు నిట్లనియె. "ప్రేమా! - ప్రేమా! - నీవిషయమేమియో నాకిసుమంతయేనిఁ దెలియుట లేదు. నీవిట్టి కుమారాకారంబు ధరించి నట్టడవి జట్టివలె పులితోఁ బోరఁ గారణంబేమి?" అనినవెంటనే ప్రేమాబాయి దాహమగుచున్నదని సంజ్ఞచేసెను. భీమసింగు తనహస్తముతో నామెనోటఁ బానీయమొసంగెను. నీరమును ద్రాగి యావీరవనిత సేదఁదేరి యిట్లు చెప్పఁదొడఁగెను.

"ఆర్యపుత్రా! నాప్రాణము లిక నెంతోసేపు కాల ముండవు. విషము దేహమునందుఁజేరి శక్తిని హరించుచున్నది. అమ్మా! అంబాలికా! యేల దుఃఖించెదవు? మీరిరువు రీదీనురాలి కష్టవృత్తాంతంబు వినుఁడు. ఆర్యపుత్రా! మిమ్ముఁ జూచినది మొదలు నాహృదయము మీదివ్యమూర్తియందే లగ్నమై యుండెను. ఆనాఁటి నుండియుం మీపవిత్రమూర్తినే మదీయహృత్పీఠంబున నిల్పి మీనామమునే జపించుచున్నాను. మనోవాక్కాయ కర్మంబుల మిమ్మే భర్తగ వరించితి. కాని, మీరు నాప్రేమను నెఱుఁగఁజాలరైతిరి. నాయం దణుమాత్రమైన వలపుఁజూపకుంటిరి. తమయందు నాకుఁగల వలపును బలుమారులు ద్యోతకమగురీతిని బ్రవర్తించితిని గాని మీ రద్దాని గ్రహింపరైతిరి. మీ రెన్నఁడు నామనోభావము గుర్తింపలేక నాప్రేమను నిరాకరించితిరో? ఆనాఁడే యసువులఁ బాయఁదలఁచితి. కాని యాత్మహత్య దూష్యంబనియుఁ దన్మూలంబున రౌరవాదినరకంబులఁ బడవలసి వచ్చుననియుం నెంచి బ్రదికి యుండు నంతవఱకు మీపాదసేవనైనఁ జేసి జీవించుట పరమశ్రేయంబని నిర్ధారణఁజేసికొంటిని. మీరంబాలికను గొని వెడలిన మఱునాఁ డుదయముననే మనోహరులగు మిమ్ము విడిచియుండుట కూడదనియుం, మీయొద్దఁ బురుషవేషంబును ధరించి సేవకుఁడుగనైన నుండవలయునని యెంచి, మీరు వెడ

లినత్రోవను గనుగొని బయలుదేరితిని. నామనంబున వివిధాలోచనలు బయలుదేరి హృదయమును గలత నొందింపఁ దుదకుఁ ద్రోవఁదప్పి యాయా రణ్యంబుఁజేరి చాల నలసియుండుటచే నొక్క వృక్షచ్ఛాయ విశ్రమించితిని. సమీపరహస్యప్రదేశమున నిరువురుపురుషు లేదియో మాటాడుకొనుచుండిరి. వారిలో నొకఁడు గోకులదాసు. రెండవవాఁ డాతని భృత్యుఁడు. నేనును వారిని సమీపించి, దాగియుండి వారుమాటాడు విషయములను వినుచుంటిని. అప్పుడు సేవకుఁడు. "స్వామీ! మీయాజ్ఞానుసారమే వెడలి భీమసింగంబా లికను గొనిచేసిన విషయమును నతఁడేఁగిన దారియును గనుగొనివచ్చితి"ననెను. అందులకు గోకులదాసు, "మంచిది. నేనెట్లైన నాకన్నియను వివాహమా డవలయును. భీమసింగు 'బికనిరుఁ' జేరకమున్నే మార్గమధ్యంబునఁ గాచి యుండి సమయముఁజూచి యాతని వధించి యంబాలికను గొనిరావలయును. అమృగాక్షిని వీక్షించిన క్షణమునుండి మనం బామానినీమణి యధీనంబైన" దనగా సేవకుఁడు "ప్రభూ! యట్లైన మన మిప్పుడే పోయి యాఁతఁడు వచ్చెడుత్రోవయందు గాచికొనియుండెద" మనియెను.

ఆమాటలు వినగనే నాగుండె పగిలినట్లయ్యెను. దేహము భయకంపిత మయ్యెను. వారికిఁ దెలియకుండ నేనుగూడ మెల్లన వారివెన్నంటి వచ్చు చుంటిని. వారిరువు రిచ్చోటుఁజేరిన తర్వాత గోకులదాసు సేవకునిఁ జూచి "నీవు వెడలి భీమసింగుజాడల నరసిరమ్ము. మంచితరుణము గనిపెట్టి నాకు వర్తమానముఁ దెల్పుము. నీ వాతని సంహారింపవలదు. అకార్యము నేనే చేసెదను. నేను వరించిన కాంత నాతఁడు దొంగిలించుకొని పోవుచున్నాఁడు. నే నాపగఁదీర్చుకొనవలయును." అని పల్కి యాతని నంపివేసెను.

నేనుకూడ నాసేవకుని రహస్యముగ ననుసరించితిని. నే నెంత మెల్లగ నడచిపోవుచుండినను నేలఁబడి యుండిన యెండుటాకులు చప్పుడుగల్గించు చుండెను. ఆసేవకుఁ డాసవ్వడిని గ్రహించి తన్నెవ్వరో యనుసరించు చున్నారని తెలిసికొని యచ్చోట నిలిచి నలుదెసలఁ బరికించెను. అయ్యది

గ్రహించి నేనొకమఱుగు ప్రదేశమునకుఁ బోయితిని. వాఁ డిటునటుఁ జూచి యెవ్వరినిఁగానక దారిఁబట్టెను. వెంటనే యెప్పటియట్లు వానిని వెన్నంటితిని. వాఁడనుమానపడి తటాలున వెనుదిరిగి చూచెను. మఱుగునకుఁబోవ యత్నించి తినిగాని నాదురదృష్టవశమున వాఁడు నన్ను గనుగొనెను. తత్క్షణమే వాఁడు నన్ను సమీపించి "ఎవఁడవురా నీవు? నన్నేల యనుసరించుచుంటివి? నీ వెవ్వఁడవో తెల్పుము. లేకున్న నిన్నిదే చంపెద" నని బెదరించెను. నేనందులకు దగిన ప్రత్యుత్తర మీయనందున వాఁడు గోపించి "నీవు మోసగానివలెఁ దోఁచుచున్నావు. నడువుము నాయజమానునియొద్దకుఁ బోవుదము." అని బెదరించెను. నేను వానిబెదరింపులకు బెదరక నిలుచుకొని యేదోచెప్పఁబోవుచుండ నానీచుఁడు కోపోద్దీపితుఁడై "నిన్నీకరవాలంబున కెరగా నొసంగెద"నని కృపాణంబుఁ దీయఁబోవ నే నదిగాంచి యాలసించిన ప్రమాదమగునని యెంచి, యొఱనుండి ఖడ్గంబు వెలికి తటాలున వానిమస్తకంబుఁ దెగనేసితి. వాఁడావ్రేటు దిని యొకయఱపఱచి నేలఁగూలెను. ఆకూఁత విని గోకులదాసు నాపంకకుఁబరుగిడి వచ్చెను. వచ్చి కోపారుణితలోచనుండై చచ్చినవానిఁ జూచి నన్ను దూషించి నాతోఁ బోరఁదొడఁగెను. నేనుగూడ వెనుదీయక యాతనితోఁ బోరితిని. తుదకబలనగుటచేతను మీరీ ప్రాంతముల నుండిన నరుదెంతురను నమ్మకముతోడను నఱచితిని. తర్వాత వృత్తాంతము మీరెఱింగినదే. ప్రియా! - యీబాధను భరింపఁజాలను. మిమ్ముల దర్శించిన మాత్రమున నాసతో నింతమాత్రము వచించితి" నని యామె మఱిమాటాడలేకపోయెను. కంఠము రుద్ధ మయ్యెను. కన్నీరుమున్నీరుగాఁ గార్చుచు భీమసింగు తొడపైఁబడెను. అప్పు డామె విషమస్థితిఁ గాంచిన నెట్టి కఠినహృదయమైనను నీరైపోవునన్న నంబాలికాభీమసింగుల విషయమై వేఱచెప్పవలయునా? వారు తమశోకంబు నాపుకొనలేక గొల్లుగొల్లున రోదనముఁ జేయఁ దొడఁగిరి.

మఱికొంతసేపటికిఁ బ్రేమాబాయి తెప్పిరిలి గద్గదస్వరంబున "ఆర్య పుత్రా! ప్రియా! -ప్రియా! - అవయవములు చేష్టలు దప్పుచున్నవి. ప్రాణావసానము - "అనియెను. ఆమాటలు వినుకొలఁది భీమసింగు మనము వేయివ్రక్కలగుచున్నట్లుండెను. శోకము పొంగిపొంగి వచ్చుచుండెను. తుద కాతఁడు శోకము నాపుకొనలేక "ప్రేమా! ప్రేమా! సౌజన్యనిధీ! మదీయప్రాణదాత్రీ! నీప్రేమ మద్వితీయము. నీసుగుణము లసమానములు. నీజీవితము పరమపవిత్రము. నీవు కేవలము మనుష్యమాత్రవుగావు. దేశహితం బొడఁగూర్ప నుద్భవించిన దేవీమూర్తివి. ప్రేమాగ్రణివి!-అయ్యో-అయ్యో!-ప్రేమా! -నీకింతటితో నూరేండ్లు నిండెనా? మమ్మీదుఃఖసాగరంబున ముంచి పోవఁదగునా? విధాతా! ఎంతపనిఁజేసితివి? సకల సద్గుణరాసిని! సౌజన్యనిధిని! మాప్రేమను! ఇంతలో హరింతువా? ప్రేమా! నీతండ్రి యీవార్తవిని యెంత పొగులునోగదా! నే నాతనికేమనివచింపఁగలను? ఏ మొగము పెట్టుకొనియాతని దర్శింపఁగలను? నాబహిఃప్రాణము-నాపుత్రి-నాప్రేమాబాయి, యే దని యడిగిన నేనేమి చెప్పఁగలను? ప్రేమా! నీ వెంతకాల మీప్రపంచమున జీవించి యెట్టి సుఖంబులఁ బడయఁదలఁచియుంటివో? నేఁడు నీయాశలన్నియు నంతమయ్యెఁగదా? అయ్యో! దుర్భరము! దుర్భరము! నీకోరిక లెవ్వియైననున్న దెలుపుము. ఈభీమసింగు చేయసంసిద్ధుఁడు." అని యేడువఁదొడఁగెను. అంబాలికయు నమితశోకంబున, "అక్కా! అక్కా!—ప్రేమా!—అయ్యో!—అయ్యో! మమ్మువిడిచిపోవుచున్నావే? నీవంటి సౌజన్యరత్న మిట్లు నిర్దయతో మమ్ము దుఃఖసాగరంబున ముంచి చనుట న్యాయమా?—" యని యామె దేహము నాలింగనమొనర్చి ప్రలాపింపఁదొడఁగెను.

ప్రేమాబాయి భీమసింగువాక్యములను విని మోమునఁ గొంతవికాసము దోప హీనస్వరంబున "ఆర్యపుత్రా! నిర్భాగ్యురాలనగు నాకోర్కె నెఱవేఱునా?—లేదు—లేదు. ఇక నీజన్మమున—నెఱవేఱదు—పునర్జన్మమున-

నెఱవేఱునే మో—హా! భవానీ! రక్షింపుము." అని నుడివి మఱల మాటాడఁ జాలక భీమసింగును దదేకధ్యానముతోఁ జూడఁదొడఁగెను.

ఆమాటలు భీమసింగుహృదయమును ప్రేలఁజేయుచుండెను. అతఁడు శోకంబున మాటలు తడబడ "ప్రే-మా!—ప్రేమా!—నీ-కో-రి-క-నెఱ వేర్ప-సంసిద్ధు డ" నని నుడివెను. ఆమాటలు విని యంబాలికకూడ నామెకోరిక నెఱవేర్పుఁడని యాతని వేఁడుకొనెను.

అప్పుడు ప్రేమాబాయి శోకమిళితంబగు మందహాసంబున "నే నింక ధన్యను. నాకోరిక సాఫల్యము నొందింపుఁడు. ఒక్కసారి నన్నుఁ గౌఁగిలింపుఁడు. మీయర్ధాంగినిగా గ్రహించి పుణ్యముఁ గట్టికొనుఁడు" అని పలికెను.

ఆపలుకులువిని భీమసింగామె హృదయభావ మెఱింగి యామెకుఁ దనయందున్న గాఢానురాగమునకు సంతసించుచుఁ దా నామెభావములను గ్రహించి యామెను బ్రేమింపనందులకు సిగ్గును శోకము నొందుచు గద్గదకంఠుఁడై "ప్రేమా! ఇదియా నీమనోభిప్రాయము! చిన్నతనమునుండి నీయనన్యసామాన్యంబైన రూపలావణ్యాతిశయంబులఁ గాంచుచుండియు, నీయనూనవాక్సుధాధారలం గ్రోలుచుండియుఁ నీయతిశయధైర్యసాహసాదులం గాంచుచుండియుం, నీవు నాకొనరించినయకారణసహాయంబు లనుభవించుచుండియుం, నీహృదయాంతర్వర్తితమగు ప్రణయానురాగ మిట్టిదని గ్రహింపనేరనైతినిగదా? హా! మనోహరీ! ఇట్టికట్టిడికిఁ బంచభూతములు సైతము సాయమొనర్చునా? అయ్యో! ప్రేమా! నేనెంత మతివిహీనుఁడను? ఎంత క్రూరుఁడను? ఎంతనీచుఁడను? ఎంతమందభాగ్యుఁడను! నామూలమున నిరపరాధినగు నీవిట్లు ప్రాణంబులఁ దొఱంగవలసివచ్చెనుగా? అన్యపురుషముఖావలోకనమైనఁ జేయనేరని నీవు నాయందవ్యాజానురాగపారవశ్యంబున దేవతవోలె తోడునీడవైయుండి వచ్చినకష్టపరంపరలనెల్ల సాహసంబునఁ బారఁదోలి నాప్రాణములఁ గాపాడితివి. అట్టి నీభావంబుల నెఱుంగఁజాలక మూర్ఖుఁ

డవై నీపవిత్రప్రేమను నిరాకరించి, తుద కీరీతి నీప్రాణఘాతకుండవైతినిగదా? నాకంటెః క్రూరుండును, కఠినుండును, కృతఘ్నుండును, మందప్రజ్ఞుండును, మందభాగ్యుండును మఱియొకఁ డుండునా ? ఈపాపమునకు నాకెద్ది ప్రాయశ్చిత్తము”.—ప్రేమా ! నా యీయపరాధమును క్షమింపుము.—నీవువరించిన పురుషుఁడు నీకన్నులయెదుటనే యన్యకాంతాసక్తుఁడై యుండ నీర్ష్యయణుమాత్రమైన లేక వర్తించుచు, నిష్కల్మషహృదయవై నన్నెంతప్రేమించితివో గదా ! నీప్రేమ నిష్కళంకమనియుం, నగాధమనియు, నిప్పుడుకదా యెఱింగితి. ఇట్టికాంతారత్నమును జేతులారఁ జంపుకొంటిని.—ప్రేమా ! ఏమినీ పవిత్రహృదయము ! ఏమి నీయకలుషజీవనము !—అహా ! ఎంత సహనము ! ఎంత విశ్వాసము ! ఎంతటి శాంతము ! ఎంతటి యింద్రియనిగ్రహము ! ఎంతటి యౌదార్యము ! ఎంతటి యనురాగము ! ఇదిగాక నీపతినిఁ బ్రేమించినకాంతయం దసహ్యపడక, నీ వామెయందుఁ జూపినప్రేమ యెంతటిది ? స్వార్థత్యాగ మెంతటిది ? ప్రేమా ! నీవు నిశ్చయముగఁ బ్రేమస్వరూపిణివే సుమా ! ఈ కలికాలమునఁ బుట్టినస్త్రీ యెంతటిశీలవతియైన, నెంతటిపతివ్రతయైన, నీలోఁ గోట్యంశమైనఁ జేయఁజాలునా ?—అయ్యో ! —అయ్యో !—ఏమైననేమి? నావంటిమందభాగ్యునకు నీవంటి కాంతారత్నము దక్కునా?—హా ! నాజీవిత మయోమయమైనది. నాయసుంగుఁజెలి నన్నుఁ గడవరాని దుఃఖసాగరంబున ముంచి పారలౌకికసౌఖ్య మనుభవింప నిర్గమించుచున్నది. అయ్యో!—అయ్యో!—నేనేమిచేయఁగలవాఁడ” నని పలువిధములఁ గన్నీరుమున్నీరుగా, గోడుగోడున దుఃఖించుచు, సహజంబగుధైర్యంబు విడనాడి, యాసుందరమూర్తినిఁ గౌఁగిలించి తనివిదీర ముద్దులిడి, హతాశుఁడై, తన్ను దాను నిందించుకొనుచు, వెఱ్ఱివానివలె రోదనముఁ జేయుచు నుండెను!

అతని మనస్సంతాపముతోపాటు సంచాలితయైఁ బ్రేమాదేవి గుణగణమ్ముల స్మరించుచు నబలయగుటచే రోదనముఁజేసి చేసి మూర్ఛమునిఁ

గెను. ప్రియుని పశ్చాత్తాపము గమనించి ప్రేమాబాయి మరణసామీప్యంబు నొందియుండియుఁ బ్రేమాంతరంగమునందు నాతని నునిచికొని "మనోహరా! నానోముపండె. జన్మసార్థకమయ్యె. ఇదే నా పంచప్రాణముల నెవరికొఱకు వారపోయఁదలఁచితినో? ఇట్టి మీ ప్రేమసామ్రాజ్యలక్ష్మినై మీ పాదకంజంబుల చెంతఁబడి ప్రాణంబులఁ దొఱఁగఁగలిగితిని. ఇంతకంటె నాకు నేఁటిభాగ్యమేమున్నది?—సోదరీ! అంబాలికా! దుఃఖింపకుమమ్మ! సర్వేశ్వరుఁడు మీకు సర్వసౌఖ్యంబు లొసంగుఁగాక!—మనోహరా!—ప్రియా!—సోదరీ!—దుర్గాదేవీ!—ర-క్షిం-పుఁ-డు." అని యామె మరల మాటాడదయ్యెను. వెంటనే నిమీలితనేత్రయయ్యెను. ఆ నిశ్వాసవాయువులు సర్వవ్యాపకుఁడగు వాయుభట్టారకునిలో లీనమైపోయెను.

శ్రీ రామార్పితము.



చెన్నపురి : వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్‌వారి
'వావిళ్ల' ప్రెస్సున ముద్రితము.—1950

# వచనగ్రంథములు

| | | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|---|
| ఆంధ్రవచనభాగవతము, ద్వాదశస్కంధములు, ఒకేసంపుటము | | 9 | 0 |
| డిటో మూడుసంపుటములు | ... | 10 | 8 |
| ఆంధ్రవచనభారతము, ఆదిసభాపర్వములు | ... | 5 | 0 |
| ,, అరణ్యపర్వము | ... | 5 | 0 |
| ,, విరాటోద్యోగపర్వములు | ... | 5 | 8 |
| ,, భీష్మద్రోణపర్వములు | ... | 7 | 8 |
| ,, కర్ణశల్యసౌప్తిక స్త్రీపర్వములు | ... | 5 | 8 |
| ,, శాంతిపర్వము | ... | 7 | 8 |
| ,, అనుశాసనికము మొదలు స్వర్గారోహణపర్వమువఱకుగల సంపుటము | ... | 7 | 8 |
| ఆంధ్రవాఙ్మయచరిత్రసంగ్రహము | ... | 3 | 0 |
| అరేబియన్ నైట్సుకథలు | ... | 2 | 0 |
| తిలకుగారిసెక్యూరిటీకేసు, ఉపన్యాసములు | ... | 0 | 14 |
| భారతరమణీమణులు, ప్రథమభాగము | ... | 1 | 4 |
| డిటో రెండవభాగము | ... | 0 | 10 |
| డిటో మూడవభాగము | ... | 0 | 8 |
| యజుర్వేదకథాసంగ్రహము | ... | 0 | 8 |
| నీతిచంద్రిక, చిన్నయసూరిగారిది | ... | 0 | 10 |
| డిటో టీకతో | ... | 1 | 4 |
| పంచతంత్రము, వచనము, సులభశైలి | ... | 0 | 12 |
| నీతిరత్నాకరము | ... | 0 | 8 |
| సంగ్రహరామాయణము | ... | 1 | 8 |
| భోజునికథలు | ... | 1 | 0 |
| భోజకాళిదాసకథలు, I భాగము | ... | 1 | 0 |
| డిటో II భాగము | ... | 1 | 0 |
| తెనాలిరామలింగనికథలు, జీవితము | ... | 0 | 6 |
| డిటో A. S. P. అయ్యరుగారిది | ... | 0 | 8 |

| | | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|---|
| సంస్కృతనాటకకథలు 1. 2 - భా. | ... | 2 | 0 |
| రాజశేఖరుఁడు—గోపాలుఁడు | ... | 0 | 12 |
| విక్రమార్కునికథలు | ... | 0 | 12 |
| చార్‌దర్వేషుకథలు | ... | 1 | 0 |
| బేతాళునికథలు | ... | 0 | 12 |
| వైద్యులకథలు | ... | 0 | 4 |
| వీరాంగనలు | ... | 0 | 12 |
| పరమానందశిష్యులకథలు | ... | 0 | 4 |
| నలుగురుమంత్రులకథలు | ... | 0 | 6 |
| అయిదుగురుదొంగలకథలు | ... | 0 | 8 |
| రేచుక్కపగటిచుక్కకథ | ... | 0 | 4 |
| సత్యసేనవిజయము | ... | 0 | 6 |
| ఋషులచరిత్ర | ... | 0 | 8 |
| పురాణగాథలు I | ... | 1 | 0 |
| ,, II | ... | 1 | 0 |
| బాజీరాయనిచరిత్ర | ... | 1 | 4 |
| రఘువంశకథ | ... | 0 | 8 |
| విక్రమార్కచరిత్ర, భా. రామమూర్తిశాస్త్రి | ... | 1 | 4 |
| ఈసబునీతికథలు 2-వ భాగము | ... | 0 | 12 |
| పంజాబుఅల్లరి | ... | 0 | 8 |
| మర్యాదరామన్నకథలు | ... | 0 | 3 |
| మైరావణచరిత్ర, చక్కనికూర్పు | ... | 0 | 2 |
| అనంతసాగరము, బుక్కరాయసముద్ర చరిత్ర | ... | 1 | 8 |
| శకుంతల చరిత్ర | ... | 0 | 6 |
| నల ,, | ... | 0 | 8 |
| సావిత్రి ,, | ... | 0 | 6 |
| హరిశ్చంద్ర ,, | ... | 0 | 8 |

వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్,

292, ఎస్ప్లనేడ్, చెన్నపురి. 1.

## న వ ల లు

| | | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|---|
| సీతారామము | ... | 1 | 4 |
| సుజనరంజని | ... | 1 | 0 |
| విజ్జలదేవి | ... | 1 | 8 |
| ఉన్మాదిని | ... | 0 | 6 |
| రాధారాణి | ... | 0 | 6 |
| దుర్గేశనందని | ... | 1 | 0 |
| లక్షణ, నవల | ... | 0 | 12 |
| లీల | ... | 0 | 6 |
| కోవలన్ కన్నకి | ... | 0 | 12 |
| పీలబాల | ... | 0 | 8 |
| ఆనందమఠ, నవల | ... | 1 | 12 |
| లాలాబాయి | ... | 0 | 8 |
| సౌందర్యతిలక | ... | 2 | 0 |
| రోషినార, (చరిత్రవిషయికమగు నవల) | ... | 0 | 12 |
| బాలాదిత్య (చరిత్రాత్మకమగు నవల) | ... | 3 | 0 |
| దేశభక్తుడు | ... | 1 | 0 |
| శంభుతో నొకనాటిసహవాసము | ... | 0 | 4 |
| చంద్రగుప్తుడు | ... | 2 | 8 |
| నీతిసింధువు | ... | 1 | 0 |
| వనజాక్షి | ... | 1 | 0 |
| స్వప్నయాత్ర | ... | 0 | 12 |
| ముగ్గురుమూర్తులు | ... | 2 | 8 |

## విశ్వభారతీగ్రంథమాల ప్రచురణములు

| | | | | | |
|---|---|---|---|---|---|
| కథాగుచ్ఛము I భాగము | | | ... | 2 | 8 |
| ,, | II | ,, | ... | 2 | 8 |
| ,, | III | ,, | ... | 2 | 8 |
| ,, | III | ,, ప్రథమఖండము | ... | 1 | 0 |

| | | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|---|
| కథాగుచ్ఛము III భాగము ద్వితీయఖండము | ... | 1 | 0 |
| ,, IV ,, | ... | 1 | 8 |
| షడవమునక 1, 2 భాగములు | ... | 5 | 0 |
| ,, విడిగా 1 భాగము | ... | 2 | 8 |
| 2 భాగము | ... | 2 | 8 |
| స్టెల్ మాండ్ మేజస్ట్రేటు | ... | 1 | 0 |

## నా ట క ము లు

| | | | |
|---|---|---|---|
| నందవధము | ... | 0 | 8 |
| నందునిచరిత్రము, నాటకము | ... | 0 | 12 |
| ప్రభాకరవిజయము | ... | 1 | 8 |
| శూరబొబ్బిలినాటకము | ... | 0 | 12 |
| రామవనవాసనాటకము | ... | 0 | 12 |
| విచిత్రపాదుకాపట్టాభిషేకము | ... | 0 | 12 |
| కమలాపహరణము, జి. సి. వి. శ్రీనివాసాచార్యకృతము | ... | 1 | 4 |
| ఆంధ్రప్రసన్నరాఘవనాటకము, కొక్కొండ వెంకటరత్నంపంతులు | | 1 | 0 |
| కర్ణభారము | ... | 0 | 2 |
| సుజనమైత్రి | ... | 1 | 0 |
| చంద్రగుప్తనాటకము | ... | 1 | 4 |
| మధ్యమవ్యాయోగము | ... | 0 | 3 |
| పూర్వశాకుంతలము | ... | 0 | 12 |
| చినరంగారాయనాటకము | ... | 0 | 6 |
| వీరాభిమన్యునాటకము | ... | 0 | 12 |
| విధిలేకవైద్యుఁడు | ... | 0 | 8 |
| స్వర్ణభూతము | ... | 0 | 10 |
| ఎలెక్షన్ ప్రహసనము | ... | 0 | 2 |

వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్,
292, ఎస్ప్లనేడ్, చెన్నపురి. 1.